

సంపుటము 18
సంచిక 11

# భారతి

వృష. కార్తికము.
1941 నవంబరు

# ప్రభుపాదములు

= శ్రీ బొడ్డు బాపిరాజు =

[ఆశ్వయుజ శుద్ధపౌర్ణిమ కిటికీ ప్రక్కల పారిజాతపుష్పాలు. కిటికీలోనుండి చందమామ వెలుగులు. గది క్రమ్ముకొని అగరువత్తుల పరిమళాలు. రాత్రి కలవరించినట్లు దూరాన దివాణంలో ఒంటిఘంట మ్రోత. అప్పటి వరకు భాగవతములో లీనమైపోయి ఎప్పుడు కనుమూసినానో ఏమో!.........

పైరాత్రి రాలిన పారిజాతా లొకటొక్కటి యేరి మాలగ్రుచ్చిన మా కన్నతల్లి కాత్యాయనివలె ఈ విరిదండ కూర్చుకొన్నాను. ఇది నా హృదయముతోపాటు ఆ ప్రభుపుపాదాలకే అంకితము]

ఇవి యెంత కోమలమ్ములు, - నవనాళీకములకన్న నాథుని పదముల్ !
తవిలిన చూపుల క్రేశులు - యవనికలై చూడనీయ వంతంతకునున్.

స్వామిపదాగ్రముల్ పవనచాలిత బాల తమాలపల్లవ
శ్రీ మృదులమ్ములై య[illegible]రించె, స్వయంపరివేషవత్స్రన
న్నామృత కాంతిపూర్తి; నసితాంకముతో తుహినాంశువట్టు; లీ
నా మనసెల్ల పాల్కడలినా, నయనమ్ములు చంద్రకాంతముల్.

అస్తోకప్రభుపాద దీధితికి ముంపై వాయుమార్గమ్ములన్
కస్తూరీఘనసార చందన మిళత్కాశ్మీర సౌరభ్యముల్
ప్రస్తావించినయంత నాదు తను వెల్లన్ శబ్దమై సప్తతం
త్రీస్తోమాయుత వల్లకీ సరణి పల్కించున్ త్రయీగానముల్.

అభిషేకింతు, ముదశ్రువేగము ప్రవాహం బాపుకోలేక త
త్ప్రిభుపాదమ్ముల; కేతపఃఫలమొ ! ప్రత్యూతమ్ములమ్యాన్ పునః

ప్రభవత్పావన జాహ్నవీ సలిలసంరంభంబు, లాపైన ఖ
ప్రభ లుద్యన్నవపుండరీకములుగా భాసించు నాయందముల్.

ఇవెకదా శ్రుతిలతాహిత శిఖాంతములందు పూచిన పొందమ్మి పూవులనిన,
ఇవియకా పరమర్షి హృత్పద్మ మధుకుల్య కదలని మొం దేటికొదమ లనిన,
ఇవియే జగన్మాతృ పృథులాంక పర్యంకముల సొమ్మసిలు పసిపూవలనిన,
ఇవె, పయోధితరంగ పృషదంశువులలోని తడి నాడుకొను నాగుపడగ లనిన,
నిరతపరితాపి హృత్తప్త నిఖిలభువన - వలయ లక్ష్మి శిరస్సీమ లలముకొనుచు
నివియె చల్లనినీడ లంకించునట్టి - కొలికి ముత్యాల హారంబట్టుగొడుగు లన్న.

హరినీలమ్ములకన్న స్వచ్ఛముల నయ్యాత్మేశు పాదమ్ములం
దొరద్రొక్కుల్ల కిశుద్ధవృత్తి వలగొందున్ నేను; నాచుట్టునుం
దిరుగున్ దత్ప్రభ లట్లనే; తెలియరా దింతైన నన్యోన్యబం
ధురమూర్తి ప్రతిబింబ హేతువున నేనో తాను, తా నేనొగా.

అనుభూతం, బనుమేయ, మెయ్యదియు కా దాసుందరజ్యోతి. కాం
చను లే, నట్లని మాన లేను; బహిరంతర్వ్యాప్త తద్విశ్వమో
హనరూపం బదె వ్రేలు కన్నులను. బ్రహ్మానంద పాథోధిలో
నను నే నూర్మిక నొచు ముద్దులిడుదుం దత్పాదవేలాస్థలిన్.

అవి యమునాస్రవంతికలు, అం దెదురీతల రాజహంస నే;
నవి తొలుకారుమబ్బుకొన, లంత నటించు శిఖావళమ్ము నే;
నవి మధురోత్పల చ్ఛదము, లంటి ధ్వనించు మిళింద మేనుగా
వివిధవిచిత్రభావ పదవీ మదవిస్మృతి సంభ్రమించెదన్.

శ్రీ చరణాబ్జముల్ శిరసుజేరిచి, మూపుల నిల్పి, వాసనల్
మూచుచు, మోవినంటి, నుదురుం గను లద్దుచు, పేరురమ్మునన్
మోచి, రొయిడిం గుదిర్చి, తమినొత్తి సపర్య లొనర్చుచున్న నా
కా చిరకాంక్షితార్థ ఫలితాకృతిమ త్సుఖభక్తి చాలదున్.

తా నెంత దనుజుడే కానిమ్ము బలిరాజు తలనెత్తుకొనె నీపదమ్ము నొకటి
తాను పాషాణంబె మైననేమి యహల్య సవదరించినది యీ చరణధూళి
తనకు విరోధియే యనుము కాళింగుండు పడగనాడించె నీ యడుగుజంట
తా నెరుంగని ముగ్ధ మైనగాని సుజాత ఆత్మసర్పించె నీ యంఘ్రులందు

ఇంతయేటి కిప్పటికి నావంతు వచ్చె - పనికిమాలిన నరజన్మ పరిమళింప
శతసహస్రశరత్తపస్సాధ్యమైన - ప్రభుచరణ సన్నిధానవర్తన సుఖమ్ము.

నిలిచినచోటు లక్షయమణి ప్రతిపన్న పృథక్ప్రికాశముల్
వెలిగి; చతుస్సముద్ర పరివేష్టిత ముర్వర కాంచిరత్నమై
యలవడి; తారకాపరివృతాబ్జుడు క్రొమ్ముడి పూలచెండుగా,
తెలియక నే నదో జగదతీతమహాగపరిణామ మొందితిన్.

పతిచరణాగ్రవేది ప్రణవాకృతి బూనుచు, తన్నఖప్రభా
లతకు విభాతపద్మ ముకుళాయిత మత్కరబంధనం బలం
కృతి యొనగూర్ప నాహృదయమే యటు దోసిటపట్టి 'మాధవా
ర్పిత' మని నిశ్చలమ్ముగ నివేదన సల్పుచు నుండిపోయితిన్.

పరచిన పాన్పు పై వలువ ప్రక్కల జారిపడన్, మఱాన ని
బ్బరముగ సాము లేచి, విలువంపున మెత్తని పట్టుదిండుపై
నొరగి, బిగించి కేలుగవ నొక్కటిసేయుచు నున్న నాకు ని
ద్దుర లెఱిగించు నెచ్చెలికి తోచవు నే నపుడున్న లోకముల్.

పులకించు నొడలు మలయా - నిలమున సీపమ్ములీల; నెమ్మనము సుధా
కలశమ్మువోలె వెలుగున్; - కలయని నరిఘచ్చుకొనగకా దిప్పటికిన్.

"స్మరగరళ ఖండనం మమ శిరసి మండనం
దేహి పదపల్లవ ముదారం"



# ఆంధ్ర మహాభారత రచనాకాలము



= శ్రీ మారేమండ రామారావు =

ఆంధ్రభాషలో మహాభారత మాదికావ్యము. ఇతరకావ్యముల వలె గాక నియ్యది మువ్వురు కవులచే వివిధకాలములయందు రచింపబడినది. ఈకవిత్రయమున మొదటివాడగు నన్నయ వేంగీచాళుక్యరాజగు రాజరాజువద్దను, రెండవవాడగు తిక్కన నెల్లూరి తెలుగుచోడరాజగు మనుమసిద్ధివద్దను, మూడవవాడగు ఎఱ్ఱాప్రగడ రెడ్డిరాజ్యస్థాపకుడగు ప్రోలయవేమనవద్దను ఉండిరి. వీరిలో రాజరాజు క్రీ. శ. ౧౧-వ శతాబ్దమునను, మనుమసిద్ధి ౧౩-వ శతాబ్దియందును, ప్రోలయవేమన ౧౪-వ శతాబ్దమునందును ఉండిరి. అందువలన కవిత్రయమును మహాభారతము నాయాకాలములలో రచించిరని యింతవరకును స్థూలముగ నిర్ణయింపబడినది. కాని యిటీవల లభించిన చారిత్రకాధారముల మూలమున నీమువ్వురు కవులును తెలుగుభారతమును రచించిన కాలము నింతకంటెను సూక్ష్మముగ నిర్ణయింప వీలగుచున్నది. ఇట్టిప్రయత్నమును జేయుటయే యీవ్యాసము యొక్క ముఖ్యోద్దేశము.[1]

నన్నయ మహాభారతమును రచించిన కాలమును నిర్ణయించుటకు తనని పోషకుడును, భారతకృతిపతియు నగు రాజరాజు యొక్క రాజ్యారంభాంత్యకాలములును, అతని రాజ్యకాలమునందలి విశేషములును ముఖ్యాధారములు. విమలాదిత్యతనూజుడైన యీరాజరాజు క్రీ.శ. ౧౦౨౨-౧౦౬౩ నడుమ ౪౧సంవత్సరములు పరిపాలించె నని సామాన్యముగ విశ్వసింపబడుచున్నది. ఈ కాలనిర్ణయము సరియైనది కాదు. రాజరాజు యొక్క నందమపూడి,[2] కోరుమిల్లి శాసనములను[3] బట్టి యితడు శా.శ.౯౪౪లో సింహమాసమున కృష్ణ ద్వితీయా గురువారమునాడు ఉత్తరాభాద్రా నక్షత్రయుక్త వణిజ లగ్నమునం దభిషిక్తు డయ్యెనని తెలియుచున్నది. ఈకాలము క్రీ.శ. ౧౦౨౨ ఆగస్టు ౧౬-వ తేదీకి సరియగుచున్నది ఈ రాజరాజుతండ్రి విమలాదిత్యుడు శా.శ.౯౩౩ లో వృషభమాసమున శుద్ధషష్ఠీగురువారమునాడు పుష్యానక్షత్రయుక్త సింహలగ్నమునం దభిషిక్తు డయ్యెనని యితని రణస్తిపూడిశాసనము చెప్పుచున్నది. తరువాతి రాజుల శాసనములలో నితడు ఏడేండ్లు పరిపాలించె నని చెప్పబడియున్నది. పై రణస్తిపూడిశాసన మితని యెనిమిదవ రాజ్యసంవత్సరమునాటిది. అందలి పట్టాభిషేకకాలము క్రీ.శ.౧౦౧౧ మే నెల ౧౦-వ తేదీకి సరియగుచున్నది. దీనినిబట్టి విమలాదిత్యుడు క్రీ.శ. ౧౦౧౧-౧౦౧౮ నడుమ రాజ్యమేలెనని స్పష్టమగుచున్నది. ఇతనికి పిమ్మట నితని జ్యేష్ఠపుత్రుడగు రాజరాజే వేంగీదేశమునకు రాజయ్యెనని శాసనము లేకగ్రీవముగ చెప్పుచున్నవి. అందువలన రాజరాజు యొక్క పరిపాలనము వాస్తవముగ క్రీ. శ. ౧౦౧౮ లోనే

---

1. ఈవ్యాసము ఆగస్టు ౨౨-వ తేదీనాడు గుంటూరులోని ఆంధ్రేతిహాససంశోధకమండలివారు జరపిన రాజరాజు పట్టాభిషేకవర్ధంత్యుత్సవమున నాచే జదువబడినది.
2. *Ep.Ind. IV.p. 303.*
3. *Ind. Ant. XIV. p. 48.*
4. *Ep. Ind. VI. pp. 347-361.*

ప్రారంభమయ్యె ననియు, నీకారణమువలననో అతని పట్టాభిషేకము క్రీ. శ. ౧౦౨౨ వరకును జరుగ లే దనియు స్పష్టమగుచున్నది. ఇదేవిధమున రాజరాజు యొక్క రాజ్యపరిపాలనము క్రీ. శ. ౧౦౬౩ లో నంతమయ్యె నను నభిప్రాయముగూడ సరియైనది కాదు. ఈ రాజరాజు సవతితమ్ముడగు విజయాదిత్యుడు తన యన్న పరోక్షమున వేంగీరాజ్యమును గైకొని దానికి తన కుమారుడగు రెండవ శక్తివర్మను శా. శ. ౯౮౩ లో తులామాసమున శుద్ధ విదియా గురువారమునాడు అనూరాధానక్షత్రయుక్తకుంభలగ్నమునం దభిషిక్తుని జేసె నని యాశక్తివర్మనమియనాడశాసనము దెల్పుచున్నది. 5 ఈకాలము క్రీ. శ. ౧౦౬౧ అక్టోబరు ౧౫-వ తేదీకి సరియగుచున్నది. దీనినిబట్టి రాజరాజుపరిపాలనము క్రీ. శ. ౧౦౬౧ లోనే సమాప్తమయ్యెనని తెలియవచ్చుచున్నది. అప్పుడు ఈరాజు క్రీ. శ. ౧౦౧౯-౧౦౬౧ నడుమగల ౪౧ సంవత్సరములు పరిపాలన చేసెనని స్పష్టమగుచున్నది.

రాజరాజు యొక్క పరిపాలనాకాలము ప్రశాంతముగ జరగిపోయె ననియు, నందువలననే ఆరాజు భారతరచనము చేయించె ననియు మరియొక సామాన్యాభిప్రాయము గలదు. ఇదియును సరియైనది కాదు. రాజరాజు సవతితమ్ముడగు విజయాదిత్యుడు మొదటినుండియు తన యన్న కుపద్రవములను గల్పించుచునే యుండెను. ఈ విజయాదిత్యుడు రాజరాజు పండ్రెండుసంవత్సరములు పరిపాలించినపిమ్మట, నతనితో పోరి, యతనిని దేశమునుండి తరిమివేసి, వేంగీరాజ్యమును గైకొని దానికి తాను శా.శ.౯౫౨లో కార్తికశుద్ధ పంచమీ భానువారమునాడు కన్యాలగ్నమునందభిషిక్తుడయ్యెనని అతని పాములవాకశాసనము6 తెలుపుచున్నది. ఈశాసన మతని రెండవ రాజ్యసంవత్సరమునాటిది. ఇందలి యభిషేకకాలము క్రీ.శ.౧౦౩౦ జూలై ౯-వ తేదీకి సరియగుచున్నది. దీనినిబట్టి విజయాదిత్యుడు క్రీ.శ.౧౦౩౦-౧౦౩౨ నడుమ వేంగిని పరిపాలించె నని

5. *J. A. H. R. S. V pp. 33-49.*

6. *J. A. H. R. S. II pp. 277-289.*

యేర్పడుచున్నది. క్రీ.శ.౧౦౧౯లో విమలాదిత్యుడు మరణించిననాటినుండి క్రీ.శ.౧౦౨౨లో రాజరాజు పట్టాభిషిక్తు డగువరకును గల నాలుగేండ్లకాలము నీ యన్నదమ్ములు రాజ్యమునకై తగవులాడుచుండిరనియు, తుదకు రాజరాజు విజయమందె ననియు నూహింపవచ్చును. దీనినిబట్టి రాజరాజుకు తన రాజ్యారంభమధ్యాంత్యకాలములలో విజయాదిత్యునివలన బాధ గలిగెననియు, నతడు రాజ్యభ్రంశమును, రెండేండ్లు ప్రవాసమునుగూడ ననుభవించెననియు స్పష్టమగుచున్నది.

పైచర్చవలన రాజరాజు రాజ్యకాలమునం దీ క్రింది నాలుగు విభాగము లుండినవని తేలుచున్నది: (౧) క్రీ.శ.౧౦౧౯-౧౦౨౨ అభిషేకమునకు పూర్వపు కాలము. ఇందు రాజరాజవిజయాదిత్యులు రాజ్యమునకై తగవులాడుచుండిరని యూహింపనగును. (౨) క్రీ.శ. ౧౦౨౨-౧౦౩౦ రాజ్యాభిషేకానంతరకాలము. (౩) క్రీ. శ. ౧౦౩౦-౧౦౩౨ రాజరాజు రాజ్యభ్రష్టుడై బహుశః ప్రవాసమునం దుండినకాలము. ఈకాలమున విజయాదిత్యుడు వేంగికి రాజుగ నుండెను. (౪) క్రీ.శ. ౧౦౩౨-౧౦౬౧ రాజరాజు పునఃప్రతిష్ఠితు డైన తరువాతి కాలము.

పై నాలుగు విభాగములలో నేది రాజరాజు మహాభారతరచనము చేయించుట కనుకూలముగ నుండెను అను ప్రశ్న యిచ్చట బయల్వెడలును. ఈ రాజు తమ్మునితో పోరాడుచుండిన దగుటచే మొదటి విభాగమును, ఇతడు రాజ్యమునందే లేకుండిన దగుటవలన మూడవవిభాగమును నీకార్యమున కనుకూలములు కావని స్పష్టముగ జెప్పవచ్చును. అగుచో నన్నయ మహాభారతాంధ్రీకరణము క్రీ. శ. ౧౦౨౨-౧౦౩౦ నడుమ జరిగెనా, లేక క్రీ. శ. ౧౦౩౨-౧౦౬౦ నడుమ జరిగెనా యను ప్రశ్న వచ్చును.

పై ప్రశ్నకు సమాధానము నొసగుటకు బూర్వము ప్రసక్తములగు రెండుమూడు విషయములను చర్చింపవలసియున్నది. ఇందు మొదటివిషయము రాజరాజు నందమపూడిశాసనమును నన్నయభట్టు రచించెనా అనునది. నన్నయభారతరచన మరణ్యపర్వమునం దేల

ఆగిపోయెను అనునది రెండవవిషయము. అట్లాగి
పోయిన కావ్యమును పూరింపజేయుటకై రాజరాజేల
ప్రయత్నము చేయలేదు అనునది మూడవ విషయము.

కీ. శే. వీరేశలింగముగారు నందమపూడి శాసన
రచయితయగు నన్నియభట్టును, మహాభారతాంధ్రీకర్త
యగు నన్నయభట్టును ఒక్కరే యనియు, తద్గ్రంథరచన
మున సహాయ మొనర్చిన నారాయణభట్టునకు క్రీ.శ.౧౦౫౩
లో నందమపూడి గ్రామము దానముచేయబడియుండు
టచే నన్నయ మహాభారతరచనము క్రీ.శ.౧౦౫౦ ప్రాంత
మునసే జరిగియుండు ననియు నభిప్రాయపడిరి.[7] నందమ
పూడిశాసనకావ్యకర్త నన్నియభట్టు; మహాభారత
కర్త నన్నయభట్టు. ఈ యిర్వురి నామములయందును
గొంత వ్యత్యాస మున్నది. అదియునుగాక గ్రంథరచ
నమున సహాయమును మాత్ర మొనర్చిన నారాయణ
భట్టుకే అగ్రహార మొసగిన రాజరాజు రచనాభార
మును వహించిన నన్నయ కంతకంటె నెక్కువ సన్మా
నమును జేసియుండుట సమంజసముగదా! అయినను
రాజరాజు నన్నయను గౌరవించిన శిలాశాసనమువను,
మహాభారతావతారికయందును చెప్పబడియుండలేదు.
రసజ్ఞుడును, ఉచితజ్ఞుడును నగు రాజరాజు నన్నయను
వీడి నారాయణభట్టును మాత్రమే సత్కరించునా?
మరియును నందమపూడిశాసనమునందు నారాయణ
భట్టు బహువిధముల ప్రశంసింపబడియున్నాడు.
అయినను అందు "కావ్యస్య కర్తా నన్నియభట్టః" అని
మాత్రమే యున్నది. ఈ కావ్యకర్త వాస్తవముగ
నన్నయయే యైనచో, తన సాహాయకుని నట్లు పొగడిన
నన్నయ తననుగూర్చి (అందునను మహాభారతమువంటి
యుద్గ్రంథమును, ఆంధ్రమునం దాదికావ్యమును రచిం
చినపిమ్మట) ఏమియు జెప్పకొనకుండునా యని సందే
హము గలుగుచున్నది. ఈ కారణములనుబట్టి నందమ
పూడిశాసనరచయిత నన్నయభట్టు కాడనియు, నా
శాసనకాలమగు క్రీ. శ. ౧౦౫౩ లో నతడు జీవించి
యుండెనని యూహించుట సమంజసము కాదనియు
చెప్పవచ్చును.

మహాభారతావతారికనుబట్టి నన్నయ తాను
కావ్యమును పూర్తిగ నాంధ్రీకరించుటకే సంకల్పించి
నట్లు తెలియవచ్చినను, తిక్కన యెఱ్ఱాప్రగడలు రచిం
చిన భాగములనుబట్టి యతని రచన తృతీయపర్వమునసే
నిలచిపోయినట్లు స్పష్టమగుచున్నది. ఇట్లీకార్యము
నిలచిపోవుటకు గారణమేమి యను ప్రశ్నకు నన్నయ
హఠాత్తుగ మతిభ్రంశము నందుట యను నొక సమా
ధానముగలదు. దీనినిగూర్చి పెక్కు గాథలుగలవు.[8] ఈ
సమాధాన మంత విశ్వసనీయముగ గన్పింపదు. అగుచో పై
ప్రశ్నకు నన్నయయొక్క హఠాన్మరణమును మరియొక
సమాధానముగా జేర్కొనవచ్చును. మహాభారతావతారి
కనుబట్టి నన్నయ గ్రంథరచనము, నారంభించువాటికే
వయసుమళ్లినవాడుగనుండెననియూహింపనగుచున్నది.[9]
అట్టియెడ నీగ్రంథరచనాభార మాతనిని క్రుంగదీసి
యుండవచ్చు ననుట సమంజసముగ నుండును. ఇంతియ
గాక హృదయమును స్తంభింపజేయగలుగునంతటి దుఃఖ
మేదియైన నాతని కీవార్ధక్యమున హఠాన్మరణమును
గలిగింపజాలియుండును. కావున నన్నయరచన మరణ్య
పర్వమున నిలచిపోవుటకతని మరణమే కారణమని
చెప్పవచ్చును.

అగుచో నన్నయ మరణించినపిమ్మట కొంత
కాలమునకైనను రాజరాజు తన కిష్టతమమగు భారత
రచనము నితరులచేనైన నేల సాగింపలేదను ప్రశ్న
కిట సమాధానము నొసగవలసియున్నది. నిజముగ నీరా
జీవితమున సంకల్పించినను ఈకార్యమును జయప్రద
ముగ నిర్వహింప సమర్థుడగు నారాయణభట్టు తన
చెంతనే యుండెను. నన్నయకు సహాయుడుగ నుండి
యిత డాకవిరచనాపద్ధతుల నెరిగియుండెను. స్వయ
ముగ నీతడు "సంస్కృతకర్ణాటప్రాకృతపైశాచికాంధ్ర
భాషల"లో 'కవిరాజశేఖరు'డని ప్రసిద్ధికెక్కినవాడు.
సుకవిత్వవిభవుడు. 'కవీభవజ్రాంకుశుడు'. 'సరస్వతీ

---

7. ఆంధ్రకవుల చరిత్రము. పే.౧౧.

8. డిటో పే. ౩౬–౪౦.

9. ఆంధ్రమహాభారతావతారిక ౭-వ పద్యము, కవులచరిత్రము పే. ౪౦–౬౪లోని నన్నయ రచించిన యితర కావ్యముల ప్రశంస — వీని నీసందర్భమున జూడనగును.

కర్ణావతంసుఁడు. 'అష్టాదశావధారణచక్రవర్తి'[10] ఇట్టి సమర్థుఁడగు కవి యుండియును రాజరాజు భారతరచనమును సాగింపఁజేయలేదు. ఇందులకేదియో ప్రబలమగు కారణ ముండియుండవలెను. క్రీ. శ. ౧౦౫౩ లో నీకవికి రాజు నందమపూఁడిని దానముచేయుట యీకవి నన్నయకు సహాయముచేసియుండుటయే కారణ మనియు, నప్పటికే రాజు భారతపూరణమును విరమించుకొనెననియు స్పష్టమగుచున్నది. తన పూర్వుల చరిత్రమనియు, సకలామ్నాయసారమనియు, సర్వ సంతరణసాధనమనియు మిక్కిలి కుతూహలముతో భారతము నాంధ్రీకరింపఁజేసిన రాజరాజు దాని నసమగ్రముగ విడచుటకు రెండు ప్రబలకారణముల నూహింపవచ్చును. అందు మొదటిది తద్గ్రంథరచయితయగు నన్నయామరణము. రెండవది రాజునకే యేదియైన నొక ప్రమాదము సంభవించియుండుట. ఈ ప్రమాదమునకును, భారతాంధ్రీకరణమునకును పౌర్వాపర్య సంబంధ ముండియుండును. అందువలన నాగ్రంథమును రచింపఁజేయుటవలననే తనకు ప్రమాదము సంభవించెనని యనుమానించి రాజు తిరిగీ యట్టి యుపద్రవమేదైన సంభవించునేమోయను భయమువలననే నన్నయమరణానంతర మాగ్రంథరచనమును సాగించుటకు ప్రయత్నించియుండకపోవచ్చును. రాజరాజున కింతటి భయమును గల్పింపఁజాలిన ప్రబలప్రమాద మొక్కసారియే గలిగెను. అది క్రీ. శ. ౧౦౬౦ లో నతఁడు రాజ్యభ్రష్టుఁడగుటయు, మరి రెండేండ్లకాలము ప్రవాస మొనర్చుటయు. ఈకారణములనుబట్టి మొదట రాజరాజు నన్నయచే భారతరచనమును ప్రారంభింపఁజేసెననియు, నారచన మరణ్యపర్వమధ్యమునం దుండగనే విజయాదిత్యుఁడు దండెత్తివచ్చి, రాజరాజు నోడించి, దేశమునుండి తరిమివేసెననియు, జరాభారపీడితుఁడయ్యు గ్రంథరచనాభారమును వహించుచుండిన నన్నయకు తన కృతిపతికి గలిగిన యీకష్టము హృదయవిదారకమై హఠాన్మరణమును గలిగించెననియు, రెండేండ్లయనంతరము తాను రాజ్యమును తిరిగీ వశపరచుకొనిన పిమ్మట రాజరాజు భారతకృతికర్తయగు నన్నయ మధ్యలో మరణించుటను, కృతిభర్తయగు దాను కష్టములపాలగుటను జూచి యమంగళమును శంకించి తద్గ్రంథపూరణప్రయత్నమును విరమించెననియు నూహించుట సమంజసముగ నుండును. అప్పుడు నన్నయభారతరచనము క్రీ. శ. ౧౦౬౦ కి పూర్వము, బహుశః ౧౦౫౫–౧౦౬౦ నడుమ జరగియుండునని చెప్పవచ్చును.

## ౨

తిక్కనసోమయాజి మహాభారతము నాంధ్రీకరించిన కాలమును నిర్ణయించుటకుబూర్వ మతని పోషకుఁడగు మనుమసిద్ధియొక్క రాజ్యారంభాంత్యకాలములను, అందలి విశేషములను నిర్ణయింపవలసియున్నది. తిక్కన మున్నుగ నిర్వచనోత్తరరామాయణమును రచించి, దానిని మనుమసిద్ధికి గృతియిచ్చెను. పిమ్మట నతఁడు యజ్ఞముచేసి సోమయాజి యయ్యెను. అటు పిమ్మట మహాభారతమును రచించెను. కేతనకృతదశకుమారచరిత్రమునుండి తిక్కనయు, నతనిపూర్వీకులును నెల్లూరిరాజులవద్ద పారంపర్యముగ మంత్రులుగ నుండిరని తెలియుచున్నది.

నిగ్దుమసుశాసనప్రమాణముయొక్క సహాయమున మనుమసిద్ధి క్రీ. శ. ౧౨౪౮ లో[11] రాజ్యమునకు వచ్చి క్రీ. శ. ౧౨౯౦ వరకును పరిపాలనమును సాగించెనని తెలియుచున్నది. ఇతని రాజ్యకాలమున పెక్కుకష్టములు సంభవించెను. క్రీ. శ. ౧౩-వ శతాబ్దిమధ్యభాగమున నేటి తెలంగాణ మంతయు, తూర్పుతీరమునం దుభయగోదావరీకృష్ణాగుంటూరు మండలములును, కర్నూలుకడపమండలములలోని చాల భాగమును సువిశాలమగు కాకతీయసామ్రాజ్యమున జేరి గణపతిదేవచక్రవర్తియధీనమునం దుండెను. దక్షిణమున పాండ్యహొయసలులును, కొప్పెరుంజింగ డను పల్లవరాజును విజృంభించుచు నుత్తరదిశకు రాఁ బ్రయత్నించుచుండిరి. ఈ యిరువంకలవారికిని నడుమ

10. ఈబిరుదములన్నియు నందమపూఁడిశాసనమున ప్రతిగ్రహీతవర్ణనమున గాంచనగుచున్నవి.

11. *Sewell—Hist. Ins. South Ind. p. 396.*

నెల్లూరు, కడప, చెంగల్పట్టు, ఉత్తరఆర్కాడుజిల్లాల లోని భాగములకు వ్యాపించిన తెలుగుచోడుల రాజ్య ముండెను. దీనికి నెల్లూరు ముఖ్యపట్టణము, కంచి యొక ముఖ్యస్థానము నై యుండెను. ౧౩-వ శతాబ్ది మొదటి పాదమునుండియే గణపతిదేవుడు నెల్లూరిరాజగు చోళ తిక్కనికి సహాయము చేయుచు నతనిచే దాక్షిణాత్య రాజులను ప్రతిఘటింపజేయుచుండెను. కాంచీనగర మునం దన్ని పక్షములవారును తరచుగ పోరాడుచునే యుండిరి. మనుమసిద్ధి తండ్రియగు తిక్కరాజునంత ప్రతిభాశాలి కాకుండుటచే దక్షిణదేశభూపతులవలన పెక్కు ఇక్కట్టుల ననుభవించెను. అయినను ఇతనికి కాకతీయులు తోడుచుచునేవచ్చిరి. తిక్కన మహా భారతరచనమును సాగించిన వాతావరణ మిట్టిది.12

తిక్కనమహాభారత రచనాకాలమునకంటెను ముందుగ నతడు నిర్వచనోత్తర రామాయణమును రచించిన కాలమును నిర్ణయింపవలసియున్నది. ఈ సందర్భమున మన కీరామాయణావతారికయందు కవి పేర్కొనిన మనుమసిద్ధి రాజ్యకాలవృత్తాంతము లుపక రింపగలవు. అందు మనుమసిద్ధి "ద్రవిడోర్వీపతిగర్వముం డుని మె"వనియు, "కర్ణాటదర్పవిఘాతంబు సేవర్చె" ననియు, 'మహారాష్ట్రసారంగుని' నోడించెననియు13 చెప్పబడియున్నది. ఈసారంగుడు క్రీ. శ. ౧౨౫౩ నాటికి కాకతీయగణపతిదేవుని సామంతుడగుటచే 14 మనుమసిద్ధి యతనిని జయించు టంతకుబూర్వము కావలెను. ఈ తెలుగుచోడరాజు చోళహొయసల రాజులతో పోరిన ట్లితర ప్రమాణములు చెల్పుట లేదు. క్రీ. శ. ౧౨౫౮ కు చిమ్మట దక్షిణమున హొయసలుల ప్రతిభ కొంత యణగెను. అందువలన వారివలన నితని కొత్తిడి గలుగలేదు. క్రీ. శ. ౧౨౫౮ లో పాండ్యులు హొయసలులను కన్ననూరువద్ద నోడించి వారి ప్రతిభ నణచిరి. 15 తరచుగ తన కాంచీనగరముపై నెత్తి వచ్చుచుండిన హొయసలులపై బగదీర్చుకొనుటకై మనుమసిద్ధి యాకన్ననూరుయుద్ధమున పాండ్యులతో జేరి హొయసలులతో పోరెనని చెప్పినచో తిక్కనవ్రాతకు సార్థక్య మేర్పడును. 16 మనుమసిద్ధి చోళరాజుతో పోరుటనుగూడ నిదేవిధమున సాధింపవలసియున్నది. గుంటూరుజిల్లా నాయనిపల్లిగ్రామమునందలి యొక శాస నము 17 గణపతిదేవుని దిగ్విజయములను పేర్కొనుచు నతడు తిక్కన బయ్యన లనువారిని జంపి, నెల్లూరు రాజుచే ఏనుగులను గానుకగొని, చోళమండలమున కులోత్తుంగరాజేంద్రచోళుని బట్టుకొనెనని తెల్పు చున్నది. ప్రతాపచరిత్రము, సోమదేవరాజీయము మున్నగు గాథలలో నొకప్పుడు అక్కన బయ్యన లను దాయాదులు మనుమసిద్ధిని రాజ్యచ్యుతుని జేసిరనియు, నంతట తిక్కన యేకశిలానగరమునకు బోయి గణపతి దేవుని సహాయము నర్థించెననియు, నాకాకతీయ రాజు నెల్లూరుపైదండెత్తి, అక్కనబయ్యనల నోడించి మనుమసిద్ధిని పునఃప్రతిష్ఠించి యతని రాజ్యమున నొంత భాగమును దన సామ్రాజ్యమున గలుపుకొనె ననియు జెప్పబడియున్నది. నెల్లూరుప్రాంతమున గణపతిదేవుని మొట్టమొదటి శాసనము క్రీ. శ. ౧౨౫౫ లో గన్పించు చున్నది. 8 దీనినిబట్టి మనుమసిద్ధిపునఃప్రతిష్ఠయు, గణపతిదేవుని దక్షిణదిగ్విజయమును నంతకుముందే జరిగి యుండెనని యూహింపవచ్చును. బహుశః క్రీ. శ. ౧౨౫౫ ప్రారంభమున గణపతి మనుమసిద్ధిని నెల్లూరులో మరల ప్రతిష్ఠించి, యతనితోగూడి చోళమండలముపై

---

12. ఇందునుగూర్చి విశేషాంశములకు ఆంధ్ర పత్రిక వృషసంవత్సర ఉగాదిసంచిక ౭౩-౭౭ పుటల లోని "కాకతీయులు-దక్షిణదేశ పరిపాలకులు" అను నా వ్యాసమును చూచునది.

13. ప్రథమాశ్వాసము - ౩౯, ౪౩ పద్యములు.

14. *Nel. Ins. O.* 150.

15. *Sewell-HISI P.* 150.

16. మనుమసిద్ధికి హొయసలసోమేశ్వరుడు క్రీ. శ. ౧౨౫౮ వరకును సామంతుడుగ నుండెను. అతని యనంతర మాతనిపుత్రులగు నరసింహుడును, రామ నాథుడును అంతఃకలహములకు లోనై తెలుగుచోడ రాజ్యమువంకకు రాకుండిరి. సోమేశ్వరుడు మనుమసిద్ధి తండ్రియగు చోళతిక్కని కాలమునగూడ కాంచీ నగరము నలజడిపరచెను.

17. *MER* 769 *of* 1922.

18. *Nel. Ins. I*-137.

దండెత్తియుండును. అచ్చట నతనికి చోళరాజగు కులోత్తుంగునితో జరిగిన యుద్ధమునందు మనుమసిద్ధియు పాల్గొనియుండును. దీనిని పురస్కరించుకొనియే తిక్కన "ద్రవిడోర్వీపతిగర్వమున్ దునిమి" అని వ్రాసియుండును. ఈచర్చనుబట్టి నిర్వచనోత్తర రామాయణము క్రీ.శ.౧౨౫౫కు పిమ్మటనే వ్రాయబడియుండె నని యూహింపనగును. క్రీ.శ. ౧౨౫౮ నుండి పల్లవ రాజగు కొప్పెరుంజింగడు కాంచీనగరము వలజడిపరుప సాగెను.[19] ౧౨౬౦ నాటికి పాండ్యులు విజృంభించిరి. సుందరపాండ్య జాయేట తెలుగుచోడరాజ్యముపై దండెత్తివచ్చి మనుమసిద్ధిని దరిమివేసి నెల్లూరులో వీరాభిషేక మొనర్చెను.[20] క్రీ. శ. ౧౨౬౩ వరకును మనుమసిద్ధి తిరిగి తన రాజ్యమునకు వచ్చిన ట్లగపడదు. ఈరాజునకు మంత్రిగ నుండిన తిక్కన క్రీ.శ.౧౨౫౫-౧౨౫౮ నడుమ నిర్వచనోత్తరరామాయణమును వ్రాసియుండుట కవకాశము గలదు.

తిక్కన తాను తెనుగుచేసిన ౧౫ పర్వములను ఆసువుగా గాక, ముందువెనుకలను చూచుకొనుచు సవిమర్శకముగను, జాగరూకతతోను వ్రాసెననియు, నీ పనిని నెరవేర్చుట కతని కైదుసంవత్సరములైనను పట్టియుండుననియు కీ. శే. వీరేశలింగముగారు వ్రాసియుండిరి.[21] ఈ అంచనా సరియైనదే నని యొప్పుకొనినను ఆ యైదుసంవత్సరములును మనుమసిద్ధి రాజ్యకాలమున ప్రశాంతమైనవిగ నుండవలెనుగదా! క్రీ.శ.౧౨౬౩లో మనుమసిద్ధి తిరిగి తన రాజ్యమునకు వచ్చిన పిమ్మటనుండి యైదారుసంవత్సరముల ప్రశాంతమైన కాల మెప్పు డుండెను అని మనము వెదుకవలసియున్నది. మనుమసిద్ధి కాకతీయసామంతుడని యిదివరలో చెప్పియుంటిని. క్రీ. శ. ౧౨౬౧-౬౨ నడుమ కాకతీయగణపతిదేవుని యనంతరము రాజ్యమునకు వచ్చిన రుద్రాంబపరిపాలనారంభకాలమున కాకతీయసామ్రాజ్యమునం దలజడులు సాగినవి. చోళరాజగు మూడవ కులోత్తుంగుడును, మల్లిదేవుడును, కొప్పెరుంజింగడును, మరి యితరులును దక్షిణభాగముపై దండెత్తిరి. కాకతీయసేనానులు వీరిని ప్రతిఘటించిరి.[22] ఈసమయమున తిక్కనభారతరచనమున కనుకూలమగు వాతావరణము లభించియుండనేరదు. అటుపిమ్మట సామ్రాజ్యదక్షిణభాగమున కాయస్థసామంతులు మున్నగువారు శాంతిని నెలకొల్పిరి. క్రీ. శ. ౧౨౭౩ నుండి తిరిగీ పాండ్యులు తెలుగుచోడరాజ్యములోనికి విజృంభించి క్రమక్రమముగ మనుమసిద్ధికి ఒత్తిడిగలిగింప సాగిరి.[23] ఈకాలమున రాజకీయములు క్లిష్టములై నందున కాకతీయులు మరియొకసారి దక్షిణదిశకు దండయాత్ర సాగింపవలసివచ్చెను. దీనినిబట్టి క్రీ. శ. ౧౨౮౦-౧౨౯౦ నడుమగల పదిరేండ్లకాలము ప్రశాంతముగ నుండెనని చెప్పవచ్చును. ఈకాలమున కావలసిన విశ్రాంతి లభించుటచే తిక్కన యజ్ఞముచేసి సోమయాజియై, నిశ్చింతగ నొకరొకని గూర్చిని మహాభారతరచనమును సాగించెనని యూహింపవచ్చును.

## 3

కవిత్రయములో నాఖరివాడగు నెఱ్ఱాప్రగడ నన్నయ విడచిన యరణ్యపర్వశేషమును పూరించెను. ఇతడు రామాయణహరివంశములను వ్రాసి రెడ్డిరాజ్యస్థాపకుడగు ప్రోలయవేమన కంకితముచేసెను. పిమ్మట అరణ్యపర్వభాగమును రచించెను. కడపట నృసింహపురాణమును వ్రాసెను. ప్రోలయవేముని తమ్ముడగు మల్లారెడ్డి

---

19. *Sewell. HISI. P.* 152. ఈ కాలమున కాంచీప్రాంతమున మనుమసిద్ధియొక్కయు, కొప్పెరుంజింగనియొక్కయు శాసనములు దగ్గరదగ్గర తేదీలలో గన్పించుచున్నవి.

20. *Ind.Ant. XXI P.* 121; *Ep. Ind. VI P.* 307; *MER* 167, 168, 186 *and* 187 *of* 1894; 303 *of* 1921 *and* 322 *of* 1911.

21. ఆంధ్రకవులచరిత్రము పే. ౧౪౨

22. కాకతీయసంచికలో "కాకతీయుల చరిత్రము" అను నావ్యాసమునందు రుద్రాంబనుగూర్చి వ్రాయబడిన వివరములను చూచునది.

23. *Sewell. HISI.* క్రీ.శ.౧౨౭౩-౧౨౯౦ సంవత్సరములక్రింద నొసగబడిన విశేషములను చూచునది.

మొదట నీకవి నాదరించి పిమ్మట వేమారెడ్డివద్ద కంపెను. ఈప్రోలయవేమన వెన్నెలకంటిసూరనను గూడ నాదరించి యగ్రహారాదికముల నొసగియుండు టచే బహుశః వేమారెడ్డి రాజ్యము చేయుచుండగనే ఎఱ్ఱాప్రగడ మరణించియుండునని క్రీ. శే. వీరేశలింగముగా రూహించిరి. ప్రోలయవేమన క్రీ. శ. ౧౩౨౮లో పరిపాలనము నారంభించి[24] స్వబాహుబలముచే రాజ్యమును విస్తరించెను. ౧౩౪౪ లో నితడు తురుష్కులతో పోరెను. అంతటనీతని తమ్ముడు మల్లారెడ్డి మరణింప నతని పేరిట నారాజు ౧౩౪౫ లో అమరేశ్వరాలయముపై కలశల నెత్తించెను.[25] అటుపై వేమనపరిపాలనము క్రీ. శ. ౧౩౫౩ వరకును ప్రశాంతముగ జరిగిపోయెను. ౧౩౪౪ కు పిమ్మటనే యిత డెఱ్ఱాప్రగడ నాదరించుటయు, నతడు రామాయణ హరివంశములను రచించుటయు జరిగియుండును. ఈ గ్రంథరచనము ౧౩౪౪–౪౬ నడుమ జరిగియుండును. ఎఱ్ఱాప్రగడ ౧౩౫౦ లో మరణించెనని యనుకొనినచో నతని నృసింహపురాణరచనము ౧౩౪౭–౫౦ నడుమను, భారతారణ్యపర్వపూరణము ౧౩౪౬–౪౭ నడుమను జరిగెనని యూహింపవచ్చును.

ఇట్లు ఉపలబ్ధములగు చారిత్రకాధారముల యొక్కయు, సమకాలికచరిత్రము యొక్కయు సహాయముతో నన్నయభారతాంధ్రీకరణము క్రీ. శ. ౧౦౨౫-౧౦౩౦ నడుమను, తిక్కనరచనము క్రీ. శ. ౧౨౬౦-౧౨౮౦ నడుమను, ఎఱ్ఱనరచనము క్రీ. శ. ౧౩౪౬-౧౩౪౭ నడుమను జరిగెనని నిర్ణయింప వచ్చును.[26]

---

*24. Proceedings of the All India Oriental Conference, Trivandram Session, pp. 734-741* లోని *"The chronology of the Reddis of Kondavidu"* అను నావ్యాసమును చూచునది.

*25. MER 268 of 1897.*

*26*. ఈవ్యాసమున మహాభారతరచనాకాలమును గూర్చి నాకు దోచిన యభిప్రాయములను పేర్కొంటిని. విజ్ఞులగువారి దృష్టి నీవిషయ మాకర్షించునని నమ్ముచున్నాను.

---

# సవరణ

గత జూనునెల భారతి సంచికలో ౬౯౯–౭౧౩ పుటలలో నెదుర్గురాయ తామ్రశాసనమును బరిష్కరించుచు స్థలనిర్ధారణ సందర్భమున శ్రీ రావుబహద్దరు సి. ఆర్. కృష్ణమాచార్యులవారు ద్వితీయసింహవర్మయొక్క విళవట్టి శాసనమున వారాజు రాజధానిగ పేర్కొనబడిన 'పల్దుకర' యనుపట్టణమే (See E. I. XXIV pp. 301) యన్య ప్రాచీన పల్లవశాసనములందు పేర్కొనియున్న 'పలక్కడ' పట్టణమని గుర్తించిరని వ్రాసియుంటిని. ఇటీవల వీరితో సంభాషించుచున్నప్పుడు ఈ యంశము ప్రస్తావమునకు రాగా, వీరు తాము అట్లు గుర్తించలే దని చెప్పిరి. వీరి వ్యాసమును పరిశీలించిచూడగా వీరు 'పల్దుకర' ను 'పలక్కడ' యని గుర్తించలేదని విశద పడినది. కావున పై నెదుర్గురాయశాసన వ్యాసమున నేను చెప్పినది సరికాదు; ప్రమాదజనితము. పాఠకులు ఈ సవరణను గమనించవలయునని ప్రార్థించుచున్నాను.

—నేలటూరు వెంకటరమణయ్య.

# అమృత బిందువులు

[ కథానిక ]




౧

ఆనాడు గొప్పపర్వము. గోమతీస్నానము నకు చాలామంది వచ్చినారు. వారిలో కొందఱు శౌనకతీర్థమునకు దగ్గఱగా చిన్న మెట్టమీద నున్న గుడికి పోయి వీరాంజనేయ స్వామిదర్శనము చేయుచున్నారు. అట్టి వారిలో నలుగు రొక జట్టుగా ధర్మశాలదారి పట్టి పోవుచున్నారు.

'ఈ అమ్మాయి మీకూతు రా?'

'కా దమ్మా! కోడలు.'

'అల్లాగా? ఆ అబ్బాయి?'

'కొడుకు.'

'బాగుంది ఈడూ జోడూ! ఇంకా మనమడు...'

'మొన్న మొన్న నే శుభ కార్యమయింది దొడ్డమ్మగారూ!'

'అదృష్టవంతురాల వమ్మాయీ! మళ్లీ యీరోజులనాటి కాంజనేయస్వామిదయవల్ల నీకు మనమడు...'

అపుడు కోడలు చిఱునవ్వుతో ముఖము ప్రక్కకు త్రిప్పడమూ, గుడికి పోవుచున్న యొక యువకుడు తన్ను చూచి నవ్వుచున్న ట్లున్నయాసుందరిముఖము చూచి తెల్ల పోవడమూ ఒక్కమా టైనవి. వా రట్లే పోవుచున్నారు. ఆయువకు డట్లే నాలుగు నిమిషాలు నిలబడి, చులుకుగా వెనుకకు నడచి వారివెనుక చేరినాడు.

'అబ్బే! కట్నాలూ లేవు కానుకలూ లేవు. పిల్ల నచ్చింది. సంప్రదాయం మంచి దని నలుగురూ చెప్పారు. వారి కొక్కర్తే పిల్ల. ఏదో యిల్లూ, కాస్తపొలమూ ఉందట. చేసుకొన్నాం.'

'పెళ్లి బెంగుళూరిలోనే జరిగిందా? ఎన్నాళ్లయింది?'

'ఆఁ! అదీ మొన్న మొన్న నే. రె ణ్ణెల్లవు తుంది.'

'అల్లా చెప్పండి. అయితే రెండూ ఓమాటే.'

అపు డాపిల్ల మందహాసముతో తల వెనుకకు త్రిప్పి ముసలమ్మవంక చూచినది. దానిమొగ మాయువకుడు మరల విస్పష్ట ముగా చూచి నిలచెను. వారు ముందుకు సాగిపోయిరి.

౨

'ఇదేమిటి? మళ్లీ, యిక్కడ సిద్ధ మా?...నన్ను చూడలేదు గదా!... సంవ త్సరం పైగా అయింది... అప్పటినుంచీ తీర్థ యాత్రలే చేస్తున్నారా?...తక్కినవా ళ్లేరీ? ...అరే! పొరపా టయింది... ఇల్లా చూ చింది...'

'అమ్మమ్మా! అదుగో అదుగో! ఆయనే. వెళ్లిపోతున్నారు. ఎడంచేతిలో మూటా తెల్లగుడ్డగొడుగూ కుడిచేతిలో కాశీచెంబూ. ...వెళ్లు వెళ్లు, కలుసుకో!'

'ఎవరే? విశ్వనాధమే? మనపుణ్యం పూసిందా?'

'గబగబా వెళ్లు. ఆయన చురుగ్గా నడచిపోతున్నారు.'

'ఆ బట్టలూ, చెంబూ పట్టుకొని చప్పున రా!... విశ్వనాథం!!'

'అమ్మమ్మా! మెట్లు. జాగ్రత్త. పరుగెత్తకు, పడతావు.'

'నాయనా! ఆ వెఱ్ఱిపిల్లాణ్ణి పిలవండి బాబూ!... విశ్వనాథం! ఆగు బాబూ! పరుగెత్తలేను.'

'అయ్యో! అన్నంతా అయింది. లేలే. మోకాలు కొట్టుకుపోయిందే!'

'ఏమయ్యో! అబ్బాయీ! ఆగవయ్యా, నీకోసం పరుగెత్తి పడ్డది ముసలమ్మ!!'

'అయ్యో! నన్ననుకోలేదు. పాపం! పడిపోయిందా?'

'ఏంనాయనా! నే రెట్టి పిలుస్తూఉంటే, వెళ్లిపోతావా? చూశావు కాబోలును! మతి విరిగిపోయిందా యేమిటి?'

'రేవులో తిన్నగా చూడలేదో పరధ్యానంగా ఉన్నారో అనుకొన్నాను. ఎదట పడ్డా కదా! పలకరించకపోతే మానె, నాకేసి చూడక కింద చూస్తా రేమిటి? నాఆశ నిరాశ అయిపోతుందా దైవమా!!'

'అదేమిటే? కళ్ల నీళ్లెట్టకు...విశ్వనాథం! నన్నెఱగవు పోనీ!...మాది కొల్లేటి దగ్గఱ కొణితివాడలే! ... దీన్నెఱగవూ? మఱచిపోయినావా?...నీకోసం దేశమంతా గాలిస్తూ అష్టకష్టాలూ పడి కాశీ చేరి జోషీగారి బసలో వాకబు చేస్తే, అక్కడెవరో అబ్బాయి, వాడిధర్మమా అని, ప్రయాగ వెళ్లండి ఆవైపున దొరుకుతా డంటే, తిండి లేదు నిద్ర లేదు, ప్రాణాలు చేత బట్టుకొని వచ్చాం...కనబడ్డాడు కష్టం గట్టెక్కిం దనుకొంటే ఈఘోర మేమిటి నాయనా?'

'నాకోస మెందుకు వచ్చారో తెలియడం లేదు.'

'అయ్యో పాపమా! ఇం కెవరికోసం వస్తాము?...కంట నీరు పెట్టకూడ దన్నా నా? ఉండు ఉండు. సంగ తేమిటో!! అడ్డంగా మాటాడుతున్నాడు. అన్నీ అడగనీ! ఏం చెపుతాడో చెప్పనీ!! మాటకు ముందుగా ఏడు పెందుకూ?'

'మీ పేరు సూరమ్మగారే కాదూ!... ఇది పదిమందీ వచ్చిపోయే దారి. వంతెన దిగి ఆపక్కకు వెడదాము రండి. మెల్లగా మాటలాడండి. ఏడుపూ అల్లరీ వద్దు సుమండీ. మాటాడకుండా పోతే మఱీ గోలచేస్తా రని ఆగాను'

'అమ్మా! రా! నాచెయ్యి పట్టుకో! ...దిక్కులేనిపిల్ల, మొగు డిల్లా మాట్లాడితే, ఇంక దీనిగ తేమిటి దేవుడా?'

'అమ్మమ్మా! ఆశ అడుగంటిన ట్లుంది. ఇంక...'

'వద్దు వద్దు. ఏదో మతి మాఱిపో యుంటుంది. అతనే సర్దుకొంటాడు. కొంచె మోపిక పట్టు'

'సూరమ్మగారూ! నామతి మాఱిపో

లేదు. మీమతి మాఱిపోయింది. దీనిమతి మార్చేశారు'

'అ దేమిట్రో నాయనో! నాకర్మం కాలితే... అదేం పాపంమాటరా!!'

'నెత్తి బాదుకొంటే నేమి, గుండెలు బాదుకొంటే నేమి?'

'అమ్మమ్మా! నాకు గంగమ్మే దిక్కు- అవమానం భరించలేను. తెలిసిపోయింది... ఇం కెందుకూ!'

'నో రెత్తకు. ఉండు. గంగో గోదా వరో... తరువాత'

'అన లీపిల్ల యెవరో తెలిసే అంటు న్నావా? ... సరిగ్గా చూడు ... ఆతేళ్ల కిందట చూశావు, ఆనవాలు పట్టేవో లేదో!'

'అల్లా గంటా రేమిటి? ... ఏడాది కిందట చూశాను.'

'అమ్మయ్యో! అ దేమిటే అమ్మమ్మో!! నన్నే నన్నే?'

'అయ్యో! నడుం విఱిగి కూలబడి పోయిందిరా నాయనా! ... ఈ దెబ్బతో! తిన్నగా కూర్చో తల్లీ! ... ఎక్కడ చూచావు బాబూ? స్వప్నంలోనా?'

'మీరు చాలా తెలివిగలవారే కాని, ఇపుడు మీ పరిహాసాలు కట్టిపెట్టండి. నైమి శారణ్యంలో చూశాను, ఈ కళ్లతో నే... ఏడాది క్రిందట.'

'దైవమా! నే నరణ్యం పాలయినానా?'

'అయ్యో! అయ్యో! తల పగిలి పోతుందే!! ఈ అడవిలో దిక్కెవ్వరే? కట్ట కట్టుకొని గంగలో పడదాం లేవే!'

'నేను చెప్పానా అల్లరి వద్దని?... నేను పోతాను. ఇక మీకూ నాకూ సంబంధం లేదు.'

'మహారాజా! నన్నేలవద్దు గాని అప వాదంమాత్రం వేయకండి. మీ పాదాల తోడు: నే నేదోషం ఎఱగను. ఆ సూర్యుడు సాక్షి, ఈగంగ సాక్షి. మీకాళ్లకు మొక్కి గంగలో పడతాను. నమస్కారము, నమ స్కారము.'

'తాకవద్దు. అర్హత లేని పని చేయకు. అపవాదము కాదు, స్వయంకృతాపరాధము. అనుభవించవలసినదే.'

'తోసేసి వెళ్లిపోతావా? ఇదా నీచదు వుకు ఫలం? పతివ్రతను పరిత్యజించిన పాపం...'

'చెయ్యి విడవండి. ఎప్పటి కప్పుడే పతివ్రత.'

'దేవు డంటూ ఉన్నాడా? ఉంటే యీ మాట సహిస్తాడా?'

'పాపపుమాట లనేవానికి పశ్చాత్తాప పడేరోజు రాకపోదు.'

'పాపం చేసినవారికీ అంతే.'

'ఛే మయినమా టన్నావు. మాపాపం ఋజువు చేస్తావా?'

'దేవుడే చేశాడు ఋజువు. నాతో రాకండి. ఇపుడే వస్తాను.'

'ఎవరినో చూచి నే ననుకొని భ్రాంతి పడ్డా రనుకొంటా నే!'

'భ్రాంతీ లేదు గీంతీ లేదు. భంగు తాగడం అలవాటయింది కాబోలు! పైత్యం నెత్తి కెక్కింది, మతి చలించింది.'

'వస్తున్నారు, మాటలనకు. పెద్ద మాటతో బయలుదేరారే!'

'వచ్చావు నాయనా! మూ కెక్కడికి? మేము రామూ? కూచో...ను వెల్లాగంటి వంశంలో పుట్టావు, ఇ దెల్లాగంటి వంశంలో పుట్టిపెరిగింది! ఈపాపపుమాట లేమిట్రా !! పండితుడ వైనావు, పరిజ్ఞానం వద్దూ?'

'వృథా సంభాషణం వద్దు. పెద్దదాన వే కాని... నాతప్పు కూడా ఉన్న దనుకో! అయితేనేమి? లోకవిరుద్ధ మైన పని చేశావు. రజస్వలావివాహంపేరు చెప్పి దీన్ని బెంగుళూరిలో ఒకడికి కట్టిపెట్టావు.'

'అమ్మమ్మా! అమ్మమ్మా! శివశివా! గంగాభవానీ! విను విను.'

'అయ్యో నాప్రారబ్ధమా! మానాయన యజ్ఞం మన్నుపా లయిందా? మాతాత షైనం గోతిపాలే? డెబ్బయొయ్యాపడి వచ్చింది. వేలు మడిపించుకోకుండా బతికాను. సూరమ్మంటే అగ్నిహోత్రం. రజస్వలావివాహం పేరుచెప్పి మాటుమనువు చేశా నంటావా? అది నాలుకేనా?'

'నీది హృదయం కాదు కాని నాది నాలుకే.'

'అమ్మమ్మా! చెవులు బద్దలైనాయి, గుండె పగిలిపోయింది. రామా రామా!'

'అయ్యో తల్లీ! ... నురగలు కక్కుతోంది. ఏమిదిక్కు? పాపం పాపం.. కట్టుకొన్నదాన్ని గంగపాలు చేయకు... లేలే' అమ్మా! అసలే రెణ్ణాళ్లనుండి తిండి లేదు. పైగా పిడుగు మీద పడ్డది.'

'ఈదొంగవేషాల కేమి ? ... అక్కడ అసలుకుళ్లు బయలుపడ్డది. వేషం మార్చారు పొండి పొండి, వచ్చినదారినే.'

3

'అబ్బా! ఈవేళ స్నానాల రేవులో ఆ పూరి పేరు వినడ మేమిటి, మనస్సు పాడైపోవడ మేమిటి ? ఎపుడో పాతరేసిన పాత గొడవంతా పైకి పెల్లగించింది. ఉత్తరం వ్రాసినా, వెళ్లినా తప్పకుండా అవమానమే యెదురవుతుం దని నిశ్చయించుకొనే ఆ విచారం వదలుకొని అజ్ఞాతవాసం చేస్తున్నాను. తిరిగీ ఈ వేళ పాడుమనస్సు తిన్నగా పోక ఈవేళయిక్కడ ఆగినందుకు....'

'ఏమండీ మేష్టరుగారూ! కాశీలో అన్నీ చూచాము గాని, పెద్దపెద్ద పండితు లుంటారట, ఆ కాలేజీ చూడలేదండీ!'

'అదేనా? చూడాలంటే ఇంకా ఎన్నో ఉన్నాయి.'

'శాంతమ్మగారి అల్లుడు చదువుకొన్నదా కాలేజీలోనే కాబోలు!'

'అదేమో నాకు తెలియదు గాని, వాళ్లు డబ్బుకోసం వచ్చినప్పుడు 'నవద్వీపంలో ఉన్నాడు. అక్కడికి ఉత్తరం వ్రాయించా' మని చెప్పారు.'

'అపుడా తిణఖా దస్తావేజు వ్రాయించినావిడ యెవరు బాబూ! జ్ఞాపకంవచ్చిందీ?'

'శాంతమ్మగారి పినతల్లి సూరమ్మగారు.'

'ఆవిడ మా చెడ్డదండీ! పెద్దదే కాని వ్యవహారపు తెలివి యెక్కువుంది.'

'అబ్బో! ఆవి డెక్కడ? తలలు తీసి తలలుపెట్టే మనిషి! అంత పెత్తందారునీ టకటక లాడించింది జ్ఞాపకం లేదూ!'

'అందుకే బాబూ వాడకం బాపతు శాంతమ్మగారు బాకీవున్న పదమూడణాలూ అడగా లనుకొని మానేశాను.'

'విడిచిపెట్టేవాడవు కావే! ఎల్లా గూరు కొన్నావో! పోనీలే! రేపు సరయూ స్నానం చేసి శ్రీ రామార్పణమస్తని దోసెడు నీళ్లు విడిచిపెట్టు.'

'అది బాగుంది మేష్టరుగారూ! అయితే ఆ సొమ్ముతో అప్పుడు శుభకార్యం జరిగించారేమో!'

'ఏమో? మళ్లీ వచ్చినవా ళ్లెవరు, చెప్పినవా ళ్లెవరు?'

'ఆ సొమ్ము పట్టుకు వెళ్లి ఎన్నా ళ్లయిందంటారు?'

'ఎన్నాళ్లా? సంవత్సరన్న రయింది.'

'ఆ పిల్ల బంగారుబొమ్మండీ!'

'అందంమాట ఆలాగుంచు. మణిపూస'

'నిరుడు సంవత్సరాదికి నేను మా అత్త వారింటికి వెళ్లినప్పుడు, ఆ రోజే వచ్చింది భారతీపత్రిక. దానిలో 'బెంగుళూరు—యువతీ వివాహము' అన్న మాటకింద వధూవరుల ఫోటో లున్నాయి. ఆ పెళ్లికొమార్తెను చూచి నిజంగా శాంతమ్మగారి కూతు రను కొని కంగారుపడి—అచ్చంగా అదే రూపం. ఏమీ భేదం కనబడ లేదండీ!— మళ్లీ మళ్లీ చూచి, తటపటాయించి, ఎవరితోనూ అన లేదు సుమండీ. ఛీ! అల్లాగ జరుగుతుందా అని నాలో నేనే సర్దుకొన్నాను.'

'మనిషిని బోలిన మనుషు లుంటారులే'

'నేనూ అంతే అనుకొన్నానులెండి.'

'సరేలే. పడకొండు కావచ్చింది, పడు కొందాం.'

'పక్క సర్దుకోవాలండీ! ఆ గోడపక్క పడుకొన్నవా రెవరండీ!'

'ఎవరో? మనవంటివారే.'

౪

'అమ్మాయీ! ఎవడో మనకొంప తీశాడే!'

'ఏమిటే!! ఇల్లా తే!! ఏదో ఉత్తర మనుకొన్నాను. ఫోటోగ్రాఫా?'

'ఏచాటుగానో ఉండి నీబొమ్మ తీసి ఈకుఱ్ఱాడిబొమ్మతో కలిపి అచ్చువేసి వాడికి పంపించాడే! అందుకే...'

'నే నెక్కడికి వెళ్లానూ, నాబొమ్మె వరు తీశారూ?...ఔరా!! ఈ పాపాని కంతా మూల మిదా?'

'ఎక్కడికి వెళ్లాలీ!! కిట్టనివాళ్లకి...'

'మన మెవరి కేమి చేశామే ద్వేషానికి?'

'చేస్తే ఉండడం సహజమే. ఏమీ చేయక పోయినా అపవాదులు పుట్టిస్తారు. అందు లోనూ మొగుడు దగ్గఱ లేని పడుచుపిల్ల పుట్టింట చాలాకాల ముందా...'

'ఆమాట నిజమే కాని, ఇ దాయనకు పంపినది కాదు. భారతిపేపరుకు పంపినది. పెళ్లిఫోటో అని దొంగఫోటో దాని కెవరు పంపగలరు?'

'వాడు నమ్మడానికి పేరుకూడా సరిపో యిందా యేమిటే?'

'ఆఁ! అది కూడా నమ్మడానికి వీలు గానే ఉంది. బాలాత్రిపురసుందరి పేరు

గనుక, మార్చినట్లు కాకుండా అక్కడ బాలా అని పిలుస్తూఉంటే ఇక్కడ సుందరీ అని పిలిచేటట్టుగా కొంచెంమార్పు చూపించిం దనుకోవచ్చు'

'అయినా, తేడా యేమయినా ఉందేమో కనిపెట్టు.'

'అయితే ఉండు. అద్దంలో చూసుకొని చెపుతా... ఏమి టాశ్చర్యం!! అమ్మమ్మా! నుదురూ, కళ్లూ, చెవులూ—దుద్దుల రకాలు వేఱుకాని—చెక్కిళ్లూ, పెదవులూ అద్దంలో కనబడ్డట్టే అచ్చంగా ఈ బొమ్మ ముఖంలో కనబడుతున్నాయే! అందుకే...అయినా, ఈ బొమ్మ నాదని యెల్లాగనుకోము? మన మనుకోకపోయినా ఇతరు లనుకోకమానరు. మన స్నెన్ని విధాలనో పోతోంది.'

'అందు కేమంటావు?'

'బెంగుళూరు వెళ్లి, ఈ సుందరిని వెతకడం, సందేహం తీర్చడం. కాని మనం వెళ్లి లాభ మేమి? దాన్ని తీసుకొని రాగలమా?'

'ఇది పట్టుకొని మన కోణీతివాడ వచ్చినా తీరిపోను, బెంగుళూరు వెళ్లినా తీరిపోను. అల్లా చేయక ఈబొమ్మ పట్టుకు ఊరేగుతూ మనల్ని చంపే డెందుకో!'

'అల్లా గనకు. దీనిమోస్త రల్లా గుంది. నువ్వైనా సరే. దూర దేశంలో ఉండి ఈ ఫోటో చూస్తే ఈ సుందరి నేనే అనుకుంటావు. అంత నమ్మకం తోచబట్టే ఇది చూచుకొని నోరుమూసుకొనం డన్నట్లు మనకు పంపించారు.'

'ఇప్పుడు గ తేమిటి?'

'విశ్వేశ్వరుడే చూపించాలి.'

'అయితే నడు. వాడి స్నేహితు డెవడో ఉన్నాడట. అతన్ని పట్టుకొని ఆలోచింతాం'

౫

'అప్పటి కైదేళ్లకిందట చూచిన నేనే ఆనవాలు పడితే, అప్పటికప్పుడు రెణ్ణెల్లలో చూచిన ఆ కోరుపల్లికోమటి గుర్తుపట్టలేకపోతాడా? ఆ అయిదేళ్ల వ్యవధానములోనూ కొంతమార్పు వచ్చినమాట సత్యమే కాని, ఏమయినా సరే, ఆముఖం ఈముఖం ఒకటి కాదంటే, వివాహమైనప్పుడు సుమారు నెల రోజులు మేనుకలసిమెలసియున్న కాలములో దాని సహజరూపరేఖ లంటుకొన్న యీకళ్లు నాకళ్లు కావనవలసిన దే. అందుచే సాదృశ్య భ్రాంతి అనే మాట కవకాశము లేదు. కవల పిల్లలయెడ స్థూలదృష్టి కట్టిభ్రాంతి కలుగవచ్చునుగాని, ఆమాటకు వీలేలేదు. అయితే, అంతపరిచితురాలూ, అంతఅనుకూలురాలూ ఇంతపనిచేస్తుందా అని యెవరైనా అనవచ్చు. నిజానికైతే చేయవలసినది కాదు. కాని, చేసినది. అందుకు తగిన కారణాలూ ఉన్నాయి. అందు మొదటిది నాడుపేక. రెండోది సూరమ్మప్రోత్సాహం. మూడోది యౌవనధర్మం. నాలుగోది కాలమహిమ. ఇంక సందేహ మెందుకు? ఆమేష్ట రన్నట్లు ఆతలగోట్లమారి సూరమ్మముండ నాఆశ నిరాశ అని బోధించి దాని మనస్సు విఱిచి దేశంకానిదేశం తీసుకొనిపోయి రజస్వలా వివాహం పేరు చెప్పి ఆకుఱ్ఱాడికి కట్టి పెట్టింది. నే ననుకొన్నది నిజ మయినది. ఇంక ధర్మసందేహంకూడా అక్కఱలేదు. ఓదాని కొకటి అన్నీ సరిపడ్డాయి. సత్యం బయటపడకుండా పోతుందా? ఇం కెందుకు?

అది చూడడంతోనే వాళ్లే సిగ్గుపడి యింటికి పోయుంటారు.'

* * * *

* * * *

'ఆ మొట్టగుడ్డ కట్టుకొని పోతున్నాడు వాడు కాదుగదా!'

'సందేహ మేమిటి? ఆయనే, ఆయనే. శాటీ కాదుగదా!'

'బాబూ విశ్వనాథం!'

'అయ్యో కర్మమా! వీళ్లు వెనకకు పోయా రనుకొని యిక్కడ నాలుగురోజు లాగినందుకు...'

'ఉండరా నాయనా!... కొంప తీసి సన్యసించ లేదు గదా? పోసీ! నీఅమ్మకడుపు చల్లగా జుట్టూ, జందెం ఉన్నాయి'

'ఉండవే అమ్మమ్మ!...క్షమించండి. మీా కెదురు చెప్పినా సనుకోకండి. మూర్తులు వేలు. ముమ్మాటికీ వేలు. సత్యముతోడు నేనా సుందరిని గాను. మీారు బెంగుళూరు వచ్చి సరిగా నావలె నున్న ఆ సుందరిని చూడండి చాలు. నామీాద పడ్డ నింద తొలగిపోతుంది. అదే నాకు పదివేలు. మీా పాదాలు పట్టుకొని ప్రార్థిస్తున్నాను: నానింద తీసివేయండి'

'ఛీ పో! కుక్క ముట్టుకొన్న కూడు. ఛీ! నీ వేడాది కాపరం చేసిన బెంగుళూ రేమిటి, నేను రావడ మేమిటి!...నీకూ నాకూ సంబంధం లేదు. ఇంక నావెంట వస్తే మాట దక్కదు.'

'అమ్మమ్మా! అయిపోయింది...ఇంక కంటబడరు... వెళ్లిపోతున్నారు... అమ్మా! అమ్మా!'

'ఇల్లా నేలబడి దొర్లితే ఏ మవుతుంది? లే. ఆ యింట్లో దూరాడు. ఆ అరుగుమీాద కూర్చుందాం. వీణ్ణి విడిచిపెడతానా? పది మందిలోకీ యీడ్చి గడ్డి పెట్టించకుండా... లే లే.'

'నేను నడవలేనే?...ఆ మనస్సు నల్ల రాయి. ఇంక కరగదే!'

'కా దుక్కు కరుగుతుంది, రాయి కరగదూ! చివరకంటా చూడకుండా విడిచి పెడతానా? తిన్నగా నడు మరి!'

'అమ్మమ్మా! ఈ పెద్దతనంలో నా దుఃఖం నువ్వు చూడ లేవు. ఒక్కమా టేడ్చి పోదువు గాని రా!'

'అల్లాగే లే! వెడదాం. ఈయరుగుమీాద కూర్చో! ఈతడిగుడ్డ లాచూరుని తగలేసి...'

'పోసీ! మనమే వెళ్లి ఆ సుందరిని పట్టుకొని పతిభిక్ష పెట్టమ్మా అని తీసుకు వత్తా మంటే, ఈలోపల ఈయన యేమయి పోతారో! వేషమంతా సన్యాసానికి సిద్ధంగా ఉంది.'

౬

'అయ్యో పాపం! ఎంతపని చేశాడు? అనుమానం పడడానికి వీలున్న దనుకొందాం. అయితే నిజ మేమిటో తేల్చుకోకుండా తొందరపడతాడా? వెంట పడలేక పోయూరా? నలుగురూ విని బుద్ధిచెప్పి...'

'అయ్యో! మేము చూస్తూ ఉండగానే ఒకయింటిలోకి వెళ్లాడు. ఇవతలికి వస్తాడు గదా అనుకొన్నాము. ఆయింటివారి నడిగాము....మాయమై పోయాడు. మొన్నా

నిన్నా గుళ్లూ, సన్యాసు లుండే స్థలాలూ చూచాము. ఎక్కడా—'

'ఎల్లా గుంటాడు ?'

'ఎఱ్ఱని కుఱ్ఱాడు. దాదాపు పాతికేళ్లు. శాటీ కట్టాడు. పెద్దమూటా, తెల్లగొడుగూ, చెంబూ......'

'ఏమిటీ? ... అయ్యో, దాటిపోయినా డండీ! మొన్న సాయంకాలము బస్సులదగ్గఱ చూశా నండీ! విచారించకండి. వచ్చింది శ్రమ...కష్టపడి సాధించండి. నాకొకటి తోస్తోంది. అతను సన్యసించే ధోరణిలో ఉన్న మాట నిజమే. తెలుగు వాడు గనుక తెలుగుయతీశ్వరుల దగ్గఱకు వెళ్లడం సహజం. హృషీకేశం దగ్గఱ లక్ష్మణ ఝూలాలో జ్ఞానానందస్వాములవారని ఆంధ్ర యతీశ్వరు లున్నారట. వెంటనే బస్సెక్కి అక్కడికి వెళ్లండి.'

'దేవుడు మిమ్మల్ని చూపించాడు ... బాగుంది నాయనా!'

* * * *

'అమ్మమ్మా! ఆమాట కూడా నా చేతికిచ్చి బాగా అడుగెయ్యి'

'...........'

'ఏమండీ ! జ్ఞానానందస్వాములవారి ఆశ్రమ మెక్కడ?'

'స్వామీ జ్ఞానానంద్ ? ఊపర్ జావ్'

'ముందుకు వెళ్ల మంటున్నాడే.'

'అమ్మా, నీయిష్టదేవత సూర్యనారాయణమూర్తికి దండంపెట్టుకో!'

* * * *

'ఇదేనే అమ్మమ్మా!...ప్రొద్దు గ్రుంకకుండా చేరాము.'

ఆశ్రమము బహువిశాలమైనది. ముఖద్వారమున కిరువంకలా పూలతోనూ, పిందెలతోనూ రెండు మామిడిచెట్లు మనోహరముగా నున్నవి. ఆశ్రమమునడుమ నొక మఠమున్నది. దానిచుట్టూ పూలమొక్కలు, దానిమ్మచెట్లు, అరటిచెట్లు రమ్యముగా నున్నవి. మఠమునెదుట కొంచె మెత్తయిన తిన్నె. దానికి పదిగజముల దూరమున మూడు వైపులా తడికలు కట్టిన పెద్ద చావడి. అటు నిటు చూచుచు వాళ్లిద్దఱును లోపల ప్రవేశించుచుండ నొక సన్యాసి గంగకు పోవుటకు కాషాయాలు దండకమండలువులు చేత పట్టి ఎదురుగా వచ్చెను. ఇద్దఱును నమస్కరించిరి. ఆయన 'నారాయణ!' అని ముందుకు సాగెను.

'జ్ఞానానందస్వాములవారు తమరేనా?'

'నేను కాను. వారు గ్రామంలో లేరు.'

'అయ్యో! ఎక్కడికి దయచేశారండి ?'

'రుద్రప్రయాగకు.'

'ఎప్పుడు స్వామీ!'

'నిన్న మధ్యాహ్నము.'

'అది యెంతదూరము బాబూ!'

'అక్కడికి వెళ్లడంకోసమా ? వారు మళ్లీ ఆదివార ముదయమున వస్తారు. మీరు వెళ్లలేరు. ఆయనను చూడవలె నంటే అంతవఱకు హృషీకేశములో నుండండి. అక్కడ ధర్మశాల లున్నాయి.'

'తమరు నడుస్తూ ఉండండి. క్షమించండి, ఒక్కమాట. మొన్న సాయంకాలము తెలుగు వాడు విశ్వనాథ మనే యెఱ్ఱని పిల్లవాడు

శాటీ కట్టుకొన్నవాడు స్వాములవారి దర్శనానికి వచ్చాడా స్వామీ?'

'అతను మీ కేమయినా కావలసినవాడా?'

'చిత్తము. ఈ పిల్ల పెనిమిటి.'

'అల్లాగా? వచ్చినాడు.'

'ఏమయినా మాటలాడినారా?'

'నేను పూర్తిగా వినలేదు గాని, నీవు భ్రాంతిపడ్డావని మందలించుట విన్నాను. అతనిని తీసుకొనే వెళ్లినారు.'

'అక్కడ అతనికి సన్యాస మివ్వరుగదా?'

'అల్లాగంటి పని జరిగినా అక్కడ జరగదు. ఇక్కడ జరగవలసినదే.'

'చిత్తం స్వామీ! ఆమాట చాలు. తమ సెలవు ప్రకారము చేస్తాము. సెలవు.'

* * *

'బెంగుళూరికి వ్రాయించిన జాబు.'

'... ... ...'

'ఏదో గూఢముగానున్నది. లేకపోతే. రుద్రప్రయాగ...'

2

'జుట్టారవిస్వకుంటూ ఇక్కడ కూర్చువే, పళ్లూ పువ్వులూ పట్టుకొని యిపుడే వస్తానంటే, ఇంతలోనే భజన చూడడానికి వెడతావా మూట విడిచిపెట్టి?'

'అ దేమిటే అల్లా గంటావు?'

'మాటాడకు, నీ వేషాలూ నువ్వూ! పరాయూరు కదా?'

'......... '

'ఎవరూ లేకుండా ఒక్కర్తెవు ఆభజన దగ్గఱ కేమిటి?'

'అ దేమిటండీ మీరూ అల్లాగే అంటారు? బాగానే ఉంది ఈవేళ?'

'ఔనంటే పోదూ? కోప మెందుకూ? అతన్నీ నేనే అనమన్నానా?'

'చాలులే! ఆరేసిన కోక పట్టుకొని వస్తూ ఉంటే చూచి అల్లా గనుకొన్నారు కాబోలు!'

'పోనీలే. పొరుగూరు కనక జాగ్రత్త కోస మన్నాము.'

'నేను గుళ్లోకి వెళ్లి వస్తాను. తరవాత మీ రిద్దఱూ...'

'అయ్యో! ఇందాకా కొన్న తాంబూలపుమాత్రలసీసా రేవులో మఱచి పోయినానే.'

'చప్పున రండి. ఇంకా ఉంటుందా?'

* * *

'అత నేడే?'

'అదుగో!'

'ఆవి డెవరే? మాట్లాడుతూ ఆ సందులోకి మళ్లుతూ ఉండగా చూశాను. అల్లాగ సాగ నంపి యిల్లా వచ్చావా యేమిటి?'

'ఎప్పుడు? ఇప్పుడే?'

'... ... ...'

'ఆ నవ్వు లేమిటి? ఆవి డేమిటి? సాగ నంపడ మేమిటి?'

'అయితే, నేను నిన్నానవాలే పట్టలే దంటావా?'

'నే నిక్కడనుంచి కదలలేదుగదా! ఆ సందులోకి మళ్లడ మేమిటీ?'

'ను వ్వెఱిగినవా ళ్లెవరు కనబడ్డారే?'

'నోరు మూయనే.'

'పోనీలెండి. వచ్చిన ప్రమాద మేమీ లేదు కాని, దారి తప్పితే...'

'ఈ వేళ మీ యిద్దరివరసా కూడా బాగా లేదు. ఎవరినో చూచి నే ననుకొంటు న్నారు. మీ పుణ్యం కాని, ఈ వూరు దాటే దాకా, ఎవరో ఒకరు నన్ను విడిచి పెట్ట కుండా ఉండండి.'

'సరేలే! గుళ్లో కెళ్లి రండి. పోదాము'

'లేవండి. చాలు. సంతోషం.'

* * *

* * *

'ముందు నడు. చూస్తావేం? దారి తెలుసు గదా! బసలో ఉండు. పళ్లు కొను క్కొని వస్తాను.'

* * *

ప్రతిదినమును పగలు పన్నెండు గంటలకు హృషీకేశములోని కాళీకమలీవాలా ధర్మ సత్రము నావరణ మంతయు వందలకొలది సన్న్యాసులతోను, బైరాగులతోను కిటకిట లాడుచుండును. పంక్తులుగాతీరి నిలచియున్న వారినడుమ పెద్ద పెద్ద విసనకఱ్ఱలు పట్టుకొని విసరుచు కొందఱటునిటు తిరుగుచుందురు. ఒక్కొక్క పంక్తివారికిని గోధుమరొట్టెలు నేతిదొన్నెలు బెల్లపుముక్కలు పంచిపెట్టువా రొకరితరువాత నొకరు వరుసగా నడచు చుందురు. క్రొత్తగా వచ్చిన బైరాగులకు ప్రక్క నున్న కార్యాలయములో కొందఱు చీటీలు వ్రాసి యిచ్చుచుందురు. అన్నము తినువారికి పడమటి చావడిలో పంక్తులు తీర్చి వడ్డించుచుందురు. ఆ వినోదము చూచుటకు యాత్రికులు తూర్పుద్వారముచెంతను,ఉత్తర ద్వారముచెంతను నిలచియుందురు.

'అతనితో వెళ్లక చిత్రం చూస్తూను విక్కడ నుంచున్నావా? అల్లా చూస్తా వేమిటి వెఱ్ఱిచూపు?'

..........

'వస్తున్నావా? బసలోకి వెళ్లు. అమ్మ వారికి ఈ పళ్లిచ్చి వస్తాను.'

'ఎవరినో? నన్ననుకొన్నాను. నా కేసి చూచినట్లుంటే...'

'అ దేమిటే అమ్మాయీ! వెళ్ల లేదూ? ఇక్కడ చూస్తున్నావా? రా రా.'

'ఈవిడది కాకిచూపు కాబోలును!'

'ఈ వేళ ఆదివారం, మఱచిపోయావా?'

'ఆదివారం మఱచిపోతానా?'

..........

'అమ్మా! ఇల్లా రా. దారి తప్పితా వేమో అని యిక్కడుండి చూస్తున్నాను'

..........

'అమ్మమ్మా! ఇంత సేపున్నా వేమిటే?'

'ఏమి చోద్యమమ్మా! ఇప్పుడే కాదూ? నిన్న...అడ్డదారిని వచ్చావు కాబోలును!'

..........

## ౨

ఆశ్రమములోని చావడిలో దర్భాస నము, చిత్రాసనము పఱచిన పెద్దపీట. దాని కెదురుగా రెండుగజముల దూరమున వేఱుగా నిటునటు పెద్దచాపలు. పీఠమునకుప్రక్క వట్టి దర్భాసనము. జ్ఞానానందస్వాములవారు మఠమునుండివచ్చి యాపీటపై నధివసించి—

'చిదానందం!'

'చిత్తం చిత్తం! వర్తమానం చేసి నాను. అతను కూడా తమసెలవుప్రకారము

చేస్తాడు. ఇదేమి టని కొంచెం అనుమానించినాడు కాని... '

' సరే, సమయమే అనుకొంటాను.'

'అడుగో వారు బెంగుళూరివారే అనుకొంటాను, ముగ్గురు. ...'

' స్వామీ ! వందనం. '

' నారాయణ ! చంద్రమ్మగారూ ! వచ్చారా ? కూర్చోండి. శ్రమ అనుకోకుండా వచ్చారు, సంతోషం. '

' శ్రమా స్వామీ ? తమవంటి మహాత్ముల దర్శనం స్వయంగానే చేయవలసినదిగదా! సెలవయిన తరువాత...తమ పేరు వింటున్నానండి. దర్శనంచేసినతరువాత...'

' కూతురూ, అల్లుడూనా ? '

' చిత్తం చిత్తం. తమ అనుగ్రహం.'

' స్వామీ! క్రిందటి ఆదివారమువచ్చిన యిద్దఱూ వస్తున్నారు. '

' మహానుభావా! ఆపద్బాంధవా! నమస్కారము నమస్కారము.'

'నారాయణ! సూరమ్మగారూ! మనమరాలా ? శ్రమపడుతున్నారు, కూర్చోండి. '

' స్వామిదర్శనమైనది. మాకష్టం గట్టెక్కుతుందని ఆశ. మహాకష్టంలో ఉన్నాము. మనవి చేస్తా... '

' ఏమీ భయములేదు. కూర్చోండి '

* * *

' బెంగుళూరా ! సుందరివా ? రక్షించావు ? ' (బాల సుందరిని కౌగిలించును)

'సంతోషం పట్టలేకున్నాను. అక్కవో చెల్లెలవో ? '

సుందరి బాలను కౌగిలించుకొనును.

' మా పిల్లకాపరం నిలిపావు తల్లీ ! '

సూరమ్మ సుందరిని కౌగిలించుకొనును. చంద్రమ్మ శంకరరావులు నిశ్చేష్టులై బాలను చూతురు.

'అందఱూ కూర్చోండి. '

' చిత్తం చిత్తం '

సుందరీబాల లొకచోట, సూరమ్మ చంద్రమ్మ లొకచోట, శంకరరా వొకచోట కూర్చుందురు.

' విశ్వనాథం శాంతమ్మకు మేనల్లుడా?'

' చిత్తం స్వామీ ! '

' ఏదో ! మానవులకు కష్టం వస్తూ ఉంటుంది. '

'మాది సామాన్యకష్టంకాదు స్వామీ! దిక్కు లేని పక్షి. దిక్కు లేనివారికి దైవమే దిక్కు. మా పాలిటి దైవము తమరే. '

' విచారించ కమ్మాయీ ! భయం లేదు. '

' స్వామీ ! అడుగో అతను వస్తున్నాడు. '

' రావోయి విశ్వనాథం !'

బాలతో సుందరియు లేచినది.

' యో వేదాదౌ స్వరః ప్రోక్తో
వేదాంతే చ ప్రతిష్ఠితః,
తస్య ప్రకృతిలీనస్య
యః పర స్స మహేశ్వరః.'

' నారాయణ ! లే. క్రింద చూస్తావేమి ? ఆ పిల్లల వైపు చూడు. '

' చిత్తం చిత్తం. '

'చూచావా ? నీవు నైమిశారణ్యములో చూచిన పిల్ల యెవరు ?'

'భ్రాంతుడను, మూఢుడను. క్షమింపుడు.'

'నాయెడ నీ వేమీ తప్పుచేయలేదే ? లేచి వాళ్లను చూడు.'

'చిత్తము చిత్తము.' (అని బాలాసుందరుల పాదములచెంత వ్రాలును)

'అపచారము అపచారము' (బాలమగనిని లేవనెత్తి పాదములు స్పృశించును)

'స్వామీ! విషయ మంతా విశదమైనది. కాని మూలము వినగోరెదను.'

'శంకరం! అదీ తెలియునులే.... చిదానందం!' (స్వాములవారు లేచిరి. అందఱును లేచిరి.)

'ఈ చిరంజీవినులు సౌభాగ్యవతులు నైన బాలాత్రిపురసుందరు లిద్దఱు నొక్క యిల్లాలి కడుపున బుట్టినవారు, శ్రీ స్వాములవారి పూర్వాశ్రమమునకు సంబంధించిన కవల పిల్లలు.'

ఆమాట వినీ వినడములో పిల్ల లిద్దఱు నొక్కమా ఱొక్కగంతులో 'నాన్నగారే నాన్నగారే' యనుచు వచ్చి స్వాములవారి పాదముల కానందబాష్పధారల నభిషేకము గావించిరి. తక్కినవారి హర్షధ్వనికి హద్దు లేదు. స్వాములవారు బాలాసుందరులను లేవనెత్తి యిరుగేల నిరువురి శిరస్సులు నిమురుచు 'బాలా! జన్మక్రమమున నీవు పెద్దదానవు. ఇది నీముద్దుచెల్లెలు. సుందరీ! ఇది నీకు భక్తిపాత్ర మైన అక్క. మీరు సకల సంపదలతో వర్ధిల్లు' డనుచు వారి రెండు తలలు చేర్చి యొక్కమా ఱాఘ్రాణించిరి. అపుడు వారి నయనాంబుజములనుండి రెండమృత బిందువులు పిల్లల శిరస్సులపై బడినవి. సభవా రందఱును పరమానందపరవశు లైరి.

'శంకరం! విన్నావుగదా ? విశ్వనాథం! విదిత మైనదా ?'

'చిత్తం చిత్తం, మహాత్మా ! వందనములు. ధన్యులము.'

'చిదానందం! మేము రుద్రప్రయాగనుండి తెచ్చిన చిన్న వ్రాతపుస్తకము విశ్వనాథము చేతి కిమ్ము.'

'చిత్తం'

'విశ్వనాథం! పై నే మున్నది?'

'ఆత్మకథ.'

'తరువాత నిది చదివి వీరి కందఱికిని వినిపింపుము.'

'చిత్తం చిత్తం.'

శ్రీజ్ఞానానందస్వామికి జయము జయము.

---

# సనాతనత్వము

శ్రీ కొత్త సత్యనారాయణచౌదరి

ప్రాఁత దని సర్వమును రోఁతపడుట తగదు
క్రొత్త దని యంతయును దీసికొనఁగరాదు,
క్రొత్త ప్రాఁతల కలయిక కొంత మధుర
మగును; జీవితమునఁ జూడఁదగును దీని.

తాత త్రవ్వించినదియగు నూతిలోని
నీరు మారిన, వానినే నీవు త్రావ
వలయు ననుమాట లౌకికవార్త కాదు,
లోకధర్మ ప్రవృత్తికి లొంగవలయు.

శాస్త్రములుకూడ దేశంబు సమయ మెఱిఁగి
లోకవృత్తికి నెదురీఁత లేక నడచు,
దానిఁ గాదని యందురువాని బ్రదుకు
చవియు సారంబు చచ్చిన శాక మగును.

శాస్త్రములలోని రాజు లస్త్రములు విడిచి
లోకమే దాఁటిపోయిరి; నీకు నేఁడు
పాలకులు నెవ్వరో చూడు చాలు—శాస్త్ర
వాద మని ఖేదమే తరువాయి నీకు.

భవ్యవైదికమార్గ సంపత్తియందు
జ్ఞానలవదుర్విదగ్ధులౌ మానవులకు
బోధసేయంగ 'బుద్ధుఁడే' పుట్టవలయు,
నపుడె కల్గును లోకకల్యాణములును.

---






POND'S
POND'S



# రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ- ఆయన రచనలు

= శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు =

పచ్చని నిమ్మపండువంటి శరీరము; బక్కపలుచని యాకృతి; విశాలమగు ఫాలము; కళాలాలిత్యమును గ్రుమ్మరించు పచ్చికన్నులు; పెదవిపై చిరునవ్వు; సరసత్వమునకు రసికత్వమును చేర్చు మాటలు; మనోహరమగు కంఠధ్వని—వారే రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు.

ఆంతరికమగు మనోవృత్తికిఁ దగినట్లు వేషమును దీర్చ యత్నించువారిలో నేను జూచినంతవఱకు శర్మగారే యగ్రగణ్యులు.

తెల్లని తలపాగ, మంగులుదీర్చి మడికచ్చెలతోఁ గట్టిన ధోవతి, మైసూరివారి కోటు ధరించి "రూపాంతరాపన్నులగు వ్యాసుల" వలె సభవైపు చూచి నిర్లక్ష్యముగా వా రుపన్యాసమును జరుపుచున్నప్పుడు ప్రేక్షకుల కందఱకును "ఇది స్వప్నము కాదు గదా" అని యనుమానము కలుగుచుండును. చూచిన వెంటనే — బహిరాకృతితోఁ జేరుమొదటివారి మనసును లోఁగొను విచిత్రశక్తి పండితులలో నొక్క శర్మగారికే కలదు. సుఖజీవి. తలఁపులకుఁ దగినట్లు శాంతిమయమగు జీవితము నడిపిన రేఖాశాలి. నడిపిన జీవితమును కబురులతో వ్యర్థము సేయక కళోపాసనకై వినియోగించి, కళలో తన్మయతనొంది, శాంతిని సాధించిన మహనీయుఁడు. అతఁ డొక 'రాజయోగి'. తన హృదయసమాధికై కళా తపస్సునకుఁ బూనుకొన్నాఁడు; సాధించినాఁడు. జీవితము పునీతమైనది. ఇతరు లానుషంగికముగ నానందపడవలసినదే కాని యొకరి మెప్పునకై తన యభిప్రాయములఁ జంపుకొను వెఱ్ఱి గాఁడు.

శర్మగారు సంస్కృతమున గొప్ప పండితులు. తెనుఁగుతనమునకు వలచినవాఁడు. కన్నడమున చక్కని కవన మల్లఁగలవాఁడు. ఆంగ్లమును, డిగ్రీలతోఁ గాక దాహముతో, "మాకు రాదా" యను పట్టుదలతో నేర్చినాఁడు; సాధించినాఁడు. కృష్ణశర్మగా రాంగ్లమున మాటలాడుచున్నపుడు కంఠపుష్టిగల వారి భాషను జూచి "ఇతఁడు తెనుఁగుపండితుఁడా" యని యాశ్చర్యపడుదుము. ప్రాకృతగ్రంథములను మూలమట్టముగ శోధించినాఁడు. చదివిన ప్రతిభాషయును గూలంకషముగఁ జదివినాఁడే కాని 'పల్లవగ్రాహి' పాండిత్యముతోఁ దృప్తిపడలేదు. ఇతరుల మెప్పునకుఁ గాక స్వీయానందమునకు భాషాసవిత్రుల నుపాసించినాఁడు. అనితరసాధారణమగు సంస్కారము భగవంతుఁడొసఁగిన దివ్యాశీరూపముగాఁ గుదురుకొన్నది. తార్కికత్వ మన్న శర్మగారికి కంటగింపు. కాని వారికిఁ దెలియకనే యాతీక్ష్ణత భావదృష్టిలో లగించి పోయినది. శర్మగారి పరిశీలన సౌందర్యము లోఁతులు వెదకునది. బర్కు మహాశయుఁ డన్నట్లు కేవలము **Beauty** తోనే తృప్తిపడక **Sublimity** వఱకు దూకి యా

చీకటిగుహాలలో — ఆ గభీరతలో తన కందరాని యేదో ప్రభాతారుణమధురము — నిత్యవర్చస్వియగు తపఃఫలమున కాయన ప్రాకులాడుచుండును. సంస్కారము కుంచెమువిప్పి వర్షాకాలమువందలి ముగ్ధమయూరమువలె కృష్ణశర్మగారి ప్రతిపదమునను నాట్యమాడుచుండును. ఆయన తలఁపులు శిరీషకుసుమ పేశలములు. ఆయన చదువు పుస్తకపఠనము గాదు; మఱి భావతపస్సు. చదువు వ్యాసంగము గాదు; మఱి యుపాసన. జీవితము ఒక జడప్రాయము గాదు; రాత్రింబవళ్ళవంటి సుఖదుఃఖముల కద్వైతభావమును గల్పించి క్రమనిబద్ధములగు మూర్ఛనలతో భగవంతుని కర్పించిన యొక మధురగానము. నిజముగా శర్మ యొక యద్భుతవ్యక్తి.

అనంతకృష్ణశర్మ గానవిశారదుఁడు. పేరుమ్రోసిన 'హఠయోగి' బిడారము కృష్ణప్పగారి శిష్యుఁడు. ఆ 'హఠయోగి' శిక్షణమున నీ 'రాజయోగి' తయారయి కర్ణాటాంధ్రదేశముల విహారభూములుగాఁ దీపిల్లినాఁడు. కర్ణాటదేశమున శర్మగారికి సంస్కృతపండితుఁడుగా, విమర్శకుఁడుగా, కవిగా నెక్కువ పేరు లేదు. వారి కక్కడ గాయకుఁడుగా గొప్ప ప్రఖ్యాతి యుండుటను జూచి నే నాశ్చర్యపడితిని. శర్మగారి సంగీత మొక యమృతఖండమువంటిది. ఆపాదమస్తకము 'సాత్త్వికావేశము'న వారి రచన మూఁగాడుచుండును. విపరీతములగు స్వరములఁ గల్పింపఁడు. తెగబారెఁడు సేపు స్వరములఁ దెంచి పాండిత్యమును గుమ్మరింపఁడు. విషమరీతులతో గతుల నడపించి నడుమ తాళమును జూపుచు నార్భాటము సేయఁడు. ప్రక్కవాద్యములపైకి విజృంభింపఁడు. రాగాలాపనలో శరీరము నలయించుకొని అమితములగు నకారములు సృష్టించి పిల్లి యెలుకనువలె రాగమును విదళించి వేయఁడు. శ్రోతల నావేశోన్మాదమున ఏకస్రోతముగ ముంచియెత్తఁడు. తెలివితో వంచనివ్వఁడు. రసవాహికలను లలితలలితముగ తాఁకితాఁకి పోవుచుండును.

శర్మగారితో మాటలాడుటయన్న, సాహితీపిపాసుల కొక విందు. ప్రాచీన పండితులయొద్ద నొక దురభ్యాస మున్నది. ఎదుటివారిని తమ వైదుష్యవిశేషముచే ముగ్ధులఁ గావింపవలెనని వారి యాశ. వినువారు దొరకినవెంటనే, తమ మెదడునందున్న పుస్తకముల నన్నిటిని కళ్లములోని జొన్నలవలెఁ జల్లపోయ నారంభింతురు. కాని వీరి కా చెడ్డయలవాటు లేదు. శర్మసంభాషణము — అది యొక కళ. ప్రత్యూషవిచికిల మధుర సరోజమువలె సుందరము. కవిభావనవలె గంభీరము. పతివ్రతల యనురాగమువలె పవిత్రము. ముగ్ధములగు శరత్తుల సముద్రమధ్యమున నవతీర్ణయగు నవసుందరివలె శర్మగారి సంభాషణము నాలుగువైపులను సమానముగా కుంచెవిప్పి నడచును. రాత్రులలోని రమణీయకత సంభాషణలలో నేమాత్రమును డింపు పడదు. గద్యమున నాతఁడు గుదిరించు నాయంత్యప్రాసలే — ఆ యతులలోని యతులే — ముత్తెములవంటి సత్తెములగు నా పదములే ప్రత్యక్షమగుచుండును. గంటలకొలఁది మాటలాడినను విసుగనిపించదు. అరుచి కనిపించదు. ఎదుటివారిని నొప్పింపఁడు. బహిరంగముగా ఖండింపఁడు. తాను గూడ సానుభూతితో వారివెంటనే నడచివచ్చినటులుండును. కాని యొక్క నిముసములో — అశక్తి యేమోగాని — మన మనసును లోఁగొని అతఁడు చెప్పవలసినవన్నియు మూఁకొట్టునట్లు సేయును. ప్రతి పదమును చక్కని యభినయముతో, సంగీతజ్ఞానపరిష్కృతమగు చల్లని కంఠధ్వనితో గడ్డువచ్చినపుడు మనకుఁ దెలియకనే శర్మగారికి వశులమై పోదుము. శర్మకనుబొమ్మలకు నిలుకడ లేదు. చేతులయందు ప్రకరీ, పతాకా, త్రిపతాకాది హస్తముద్రలు నిర్వ్యత్యూహముగ నెన్నియో మారులు తిరిగిపోవుచుండును. శర్మగారి కనుబొమ్మ యొక్కసారి చలించిన భావవృక్షమున నొక్క యాకు గదలాడును. మాటకును అభినయమునకును గల ఈయూహామహిమను గాంచినపుడు "పూర్వజన్మమున నీతఁడు భరతాచార్యుఁడా" యనిపించును. శర్మగా రుద్ఘాటించు విషయమునకన్నను దానిని వెలువరచు పద్ధతిలో నున్నది 'తమాషా'.

శర్మగారు శకమునిలిపిన గద్యరచయిత. ఆయన పేరిట నిజముగా నాంధ్రమున శకాబ్ద మేర్పడును. కందుకూరివారితో నారంభమైన వచనరచనకు కృష్ణ

శర్మకలము భరతవాక్యమును పాడినది. నూతనపరికరములతో, నూత్న వస్తువులతో నూత్నతరమగు శైలి నారంభించినాఁడు. ఆ యంత్యప్రాసలలో, ఆ యతుల సౌభాగ్యములో పదజాలము నడచిపోవుచున్నప్పు 'పచ్చముగఁ' బూలతేరే కదలివచ్చినటు లుండును. తెనుఁగునందలి యంగమచ్చము లెఱిఁగినాఁడు. తిక్కనను తనివిదీర నుపాసించినాఁడు. భవికవుల రచనలకన్నను శివకవుల రచనల నెక్కువ యాదరించినాఁడు. "తెనుఁగునకు ప్రత్యేకమగు నునికియే లేదా! ఉన్నచో తెనుఁగువారమగు మనము గీర్వాణమునుపంచ నెందుకుఁ జేరవలె" నను దుఃఖ మారంభమైనది. ఆ ప్రతినతో కలము నడపినాఁడు; నెగ్గించుకొన్నాఁడు పట్టుదలను. పాలకురికి సోమనాథుఁడు, తిక్కన వేమనలు రచనలలో తొంగిచూచినారు. ప్రేమచంద్రుఁడు హిందీ యందువలె కృష్ణశర్మ నిజముగా తెనుఁగువాఁడు.

శర్మగారి వచనరచన కిసలయపేశలము. ఒక్క యక్షరము కటువుగా నుండిన వాతినికి గిట్టదు. ప్రాకృతమువలె, పెదవిగదలింపకయే రచన సాగిపోవలెను. ఇఁక నాతఁడు శైలిలో ప్రవేశపెట్టినవి ముఖ్యముగా నంత్యప్రాసలు. వానిలో మధురత గావలెను. జయదేవుని లోని సౌలభ్యమును వెదకికొని దానిని తెనుఁగునకు దించినాఁడు. వారి యంత్యప్రాసము లిట్టివి:

"మాకు రక్తి లేకపోలేదు గాని శక్తి చాలదు."
(గానము)

"అతనికి చాలనిది నేర్పు గాదు, మరి ఓర్పు."
(తెనాలివాని వ్యాసము)

"అసలు తక్కువైననే అతిశయోక్తికి దారి"
(యతులు)

"జావళ్లకును, జట్కాసాహేబుల వరుసలకును"
(నాటకోపన్యాసములు)

యతులను తెనుఁగున గద్యమున వాడు పద్ధతి వేరుగా క్రొత్తది. అది వా రెటుల గ్రహించిరో తెలియదు. అంత్యప్రాసలను తెనుఁగుకవులు పద్యరచనలలో వాడిరి కాని చాలవఱకు మధురములు గావు. తెనుఁగు కవులకన్నను వ్రజభాషాకవు లంత్యప్రాసమును మధురముగా, జీవలక్షణముగా వాడుకొనిరి. ఆ 'తుక్‌బందీ' లేనిది వారికి రచనయే లేదు. వ్రజభాషాకవులగు తులసీ, సూరులయందును, రీతికవులగు రహీము, బిహారీల యందును నీ యంత్యప్రాసలు మాతృహస్తమువలె మిక్కిలి చల్లగా సాగిపోవును.

మరి శర్మగా రీరచనాపద్ధతి నెక్కడనుండి కొనితెచ్చిరో వారినే యడుగవలసియున్నది. వారి వాక్యములు పూలరేకులవంటివి. ఒత్తుగా, పరపుగా, మట్టసముగా నుండును. సాధారణముగా కొంచెము పెద్దవాక్యములు వ్రాయనే వ్రాయరు. వ్రాసినచో భావమున నొక ప్రత్యేకత యుండియే తీరవలెను.

అచ్చముగ, నుత్తముగ, మదనచేతులు మొదలగు చల్లని దేశ్యములును, హాజరు, తయారువంటి యన్యదేశ్యములును వారి రచనలో కుప్పలుతిప్పలుగా నుండును. లాక్షణికతకన్నను సౌందర్యపిపాస, రసలోలుపత యెక్కువ. గాథాసప్తశతిలో నొకచోట 'పంకు' అని గ్రాంథికరూపమువున్నను 'పెంకు' అనియే తెనిఁగించిరి. అవియు యతిస్థానమునవే వాడిరి. అది దాని వ్యవహారదక్షతకు మురిసియే కాని వేరుగాదు.

ఇంకను జెప్పినచో కృష్ణశర్మగారి ప్రతివాక్యమును నొక పల్లవివంటిది. ఆతని వచనమునకు సంగీతము ప్రాణము. ప్రతివ్యాసము నతఁడు సుమా రొక పది సారులైనను దిద్దివ్రాయును. భావము బాగులేదని యొకమారును, నడక సుదురలేదని యొకమారును, శ్రవణసుఖము లేదని యొకమారును దిద్దిదిద్ది వ్రాయుచుండును. ప్రతివాక్యమును నొక యప్సరసగాఁ దయారుసేయవలె నని యతని యాశ.

శర్మగారి రచనలకు స్వతంత్రత యొక గొప్ప యలంకారము. లోకమంతయు నెదురుతిరిగినను దన భావమును మార్పఁడు, జంకఁడు. నాచనసోమనాథుని 'నవీనగుణసనాథు' బిరుద మాతనిభావనకే కాని భావములకుఁ జెందినది గా దన్నాఁడు. ఆంధ్రదేశమంతయును నీవాదముతో గింగురువోయినది. పిఠాపురపు పండితులు నడకుదుటి వీరరాజుగారు హుంకరించి మీఁదఁబడినారు. శర్మగారు చలింపలేదు, మాటను

మార్పులేదు. వాదోపవాదములు కొల్లలుగా జరిగినవి. ఇంతలో వీరరాజుగారు గతించిరిగదా! మొన్న మొన్నట బళ్లారిలో జరిగిన 'సాహితీసభ'లకు శర్మగారధ్యక్షులు. అప్పుడు వారు "స్త్రీపాత్రములను బురుషులుగూడ నటియింపవచ్చు"నని సమర్థించినారు. నటచక్రవర్తి రాఘవాచార్యులుగా రడ్డుదగలఁగా వారికి "నాకుఁ దోఁచిన దిది" యను జంకుగొంకులేని యుత్తర మొసఁగినారు. వారి 'గానము' అను నుపన్యాసమునకు విశ్వదాత మురిసిపోయినాఁడు. కట్టమంచి రామలింగారెడ్డివంటి సాహితీవల్లభుని కతని రచనలు పట్టపురాణు లైనవి. రెడ్డిగా రతని కవితలకు మోఁకరిల్లినాఁడు. 'నాటకోపన్యాసముల'లో శర్మగారు విశదీకరించిన 'లయ' విచారము చాల పరినిష్ఠితమైనది. 'రాయలనాఁటి రసికత' యను నుపన్యాస మాతని సరసత్వమున కుదాహరణము. 'గాన' మాతని సంగీత పాండితి కనుప్రాసము. 'నాచన సోముని' యుపన్యాసము లాతని సాహితీపటిష్ఠత కన్వాకేశము. 'నాటకోపన్యాసము' లాయనపరీక్షణదృష్టికి, కర్కశ తార్కికదృష్టికి నిక్షేపములు. 'వేమన' యాతని సర్వస్వము. గద్యరచనలో శర్మగారిని మించినవా రాంధ్రదేశమున లేరు.

శర్మగారికి లలితహాస్యమన్న నెక్కువ మక్కువ. వారి భావములవలెనే హాస్యమును ప్రౌఢమధురము. వారి దట్టహాసము గాదు, హాసముగాదు; మరి మందస్మితము. పానుగంటివారివలె యూఁక దెబ్బలఁగొట్టి యట్టహాసము సేయఁడు. భమిడిపాటివారివలె Sarcastic Smile నుపయోగింపఁడు. విశ్వనాథవారివలె తల జిల్లదిరుగఁ జేయఁడు. చిలకమర్తివారివలె తేలఁబలుకఁడు. హాస్యము నొక మధురకళగా నభ్యసించినాఁడు శర్మ. గిచ్చినను రక్తము రాక, గాయ మేర్పడక గిచ్చు చిత్రవిద్య యాతనిది. మనకుఁ దెలియకనే హృదయమునఁ బ్రవేశించి పెదవుల వికసింపఁజేయును. అది మధురతమమగు సృష్టి!

అనంతకృష్ణశర్మ రచనలో మహావశి. హద్దుదాఁటి యే మాత్రమును ముందుకు జరుగఁడు. చెప్పవలసినదానిని విడువఁడు. ఒకదానిని ఎట్లు చెప్పవలయునో, ఎంత చెప్పవలెనో అను విషయ మాతనికిఁ దెలిసినంత యెవ్వరికిని దెలియదు. ఒక విషయమును చెప్పుచున్నపు "డింకను కొంచెము చెప్పిన బాగుండదా" యనిపించుచుండును. అనఁగా రసలోలుపతచే హద్దుదాఁటిపోవువారు శ్రోతలేగాని యాతఁడు గాఁడు.

ఏదైనవిషయము నెత్తిచెప్పుటలో శర్మగారిలో గొప్ప విశేష మున్నది. ఆయనరచన యొక వ్యూహమువంటిది. సరియైన పద్ధతిలో కదనుదప్పక సక్రమముగా నడచును. ఒకదానిని పొడిగించుట, యొకదానిని తగ్గించుట యాతఁ డెన్నఁడును జేసియుండఁడు. సలక్షణముగా, అవసరమగు దాబుతో నాతని రచన నడచును. అతని పదములు నెరవిచ్చిన పూవులు గాదు, కసిమొగ్గలు గాదు; మరి యరవిచ్చిన మల్లెలు. ముగ్ధహృదయమున దాఁగి దాఁగక పెనఁగులాడు మనోరథములవంటివి. ధ్వని వానికి ప్రాణము. స్వరము దుస్తు. వ్యాసమంతయుఁ జదివినను నొక్క శ్రుతికటువగు పదమును వాడక వ్రాయఁగలవారు శర్మగారుగాక యాంధ్రదేశమున నెవ్వరు గలరు?

ఇతరవిమర్శకులకు లేని యెన్నియో సుగుణము లాతని కున్నవి. విమర్శకులకు సాధారణముగా నభినివేశ మెక్కువ. చెప్పు విషయమునకన్నను నార్భాటమే మిక్కుటముగా నుండును. ఎదుటివారి నొక చీమగానో, తృణముగానో యెంచి గద్దింతురు. ఆ యావేశోన్మాదమున నొడలుమఱచి చెప్పవలసినదానిని చెప్పకయు, మఱియొకరీతిగా చెప్పియు తికమకలాడుట గలదు. శర్మ శాంత్యుపాసకుఁడు, తన విమర్శనముల, నుపన్యాసముల నతఁడు నిలుకడతో చిత్రించును. ఎదుటివా రెంతగా విజృంభించినను, కడకు తన వ్యక్తిత్వమునకే యాఘాతము గలిగినను దాని నంతయు జీర్ణించుకొని యేమియు నెఱుఁగనివానివలెనే నిత్యనూతనమగు శాంతితో కలము నడపును. తా నెప్పటికిని పెద్దమనుష్యుఁడే. సాహితీసింహాసనమునుండి యొక్కయడుగు గూడ క్రిందికి జార్చఁడు. తనపై ప్రతిపక్షులు సరియయు నిందలకు హాసమ్ముఖుఁడై, అదే సంగీతకళాపరిణతమగు మనసుతో, సాహిత్యనిష్ణాతములగు తలఁపులతో బదులొసఁగుచుండును. పత్రికాలోకమునకుఁ దన ప్రతిపక్షులలోని

యువగుణములను దన శాంతితోనే చక్కఁగా ఋజువు సేయుచుండును. నిజముగా నీవిషయమున చాల మోస గాఁడు శర్మ.

శర్మరచన లన్నియు వ్రాసి చదివినవే. ఒక్క సారియైనను స్వతంత్రముగా సభావేదికపై నిలిచి మాట లాడుట నే నెఱుఁగను. పదములను దిద్దుటలో, వాడు టలో నతఁడు మహోలోభి. విషయములను వెల్లడించు టలో చాల జంకు—గాదు గాని, యవధానాత్మకము—గల వాఁడు. నిలువఁబడి మాటలాడినచో తనకు విరుద్ధముగ, సౌందర్యవిహీనముగ నేపదము 'దొర్లునో', ఏభావము సరిగా రుచింపఁబడదో యని శర్మకు భయము. ఒక్క పదము మధురము గానిది చెవినిబడిన నాప్రాణి యూరక తల్లడిల్లును. వీణాతంత్రివంటి దాతని మనసు. ముట్టిన వెంటనే రింగుమని మ్రోఁగును. తలఁపులతో జీవితము, జీవితముతో తలఁపులు పరిష్కృతములై యాతని నొక స్వప్నమూర్తిగా మార్చివేసినవి. ఆంగ్లమున E. V. లూకాస్ వంటి గద్యరచయిత యాయన. నిరంతరము నిరజాజులతో గుబాళించు రమణీయములగు సౌందర్య లోకముల క్రీడింపఁగలెనని యాతని యాశ. రాసిటీకంటె మధురభావుకుఁ డాయన. మాక్షీకపులవలె ప్రేమా పాసి యాయన. గ్రేకవి వంటి పదలుబ్ధుఁ డాయన. సుఖదుఃఖములతో కుమిలిపోవుచుండు నీయాంధ్రలోక మున కమృతమును బంచు మోహినీమూర్తి యాయన గాక మరెవ్వరు?

అనంతకృష్ణశర్మ చిక్కని కవి. వ్రాసిన దొక్కటే కావ్యము. అదియును నాంధ్రీకరణము. కాని ఒక్కటియైననేమి, రత్నమువంటి కావ్యము. అద్వితీయమగు నాగ్రంథముతోనే 'మహాకవి' బిరుదమును సంపాదించుకొన్నాఁడు. భాషాంతరీకరణమును సర్వవిధముల స్వతంత్రి మనిపించినాఁడు. మధురములగు నాతని రచనలో దేశ్యములు 'సెలవివారి' నవ్వినవి. భావము లరవిచ్చినవి. భాష పండినది. ఆశ్రయములు లేక కుములుచుండిన యెన్నియో పూలగుత్తులవంటి తెనుఁగుపదములకు వసంతమనోహరమగు తన కవితలో తా వొసఁగి లాలించినాఁడు. ఒక్కొక్క 'గాథ' ననేక సారులు మననముగావించి "భావం బుపలక్షించియు, ననౌచిత్యంబుఁ బరిహరించియు" లలితలలితముగా ననువదించినాఁడు. ధ్వనియు, రసమును మెడలుమలఁచి పుంజుకొన్నవి. పెద్దవృత్తముల నాతఁడు వ్రాయలేదు, ఇఁక వ్రాయఁడు. "అవి బృహత్కుక్షులు. వానికిఁ దగినంత తిండిని మనము పెట్టలే" మని యొకసారి నాతో నన్నాఁడు.

నూత్నపదములను సృష్టించుటలో నతఁడు చాల గడుసరి.[1] కృష్ణశర్మ కున్న నిలుకడ, సమయస్ఫూర్తి యపారము. వారి వ్రాఁత లావేశమున దొరలివచ్చిన ప్రవాహములు గావు; మరి, నిలుకడతో సర్వాంగీణ సుందరముగా "దిద్దితీర్చిన" చిత్రములు. "శాంతి యన పోఁబరితనము గాదు. నిలుకడతో సమగ్రముగ సాధించుట" యని తన కవితకుఁ దానే వ్యాఖ్యానము గావించుకొన్నాఁడు. పదముల నాతఁడు తఱచితఱచి వాడును. భావముల నాతఁడు తీర్చితీర్చి దిద్దును. మొన్న వేసంగులలో నేమైసూరుపురమున సేతుబంధము లోని

"పజ్జత్తసలిలధోరేం
దూరాలోక్కంతణిమ్మలేగఅణఅలే
అచ్ఛాసణ్ణంవతిఅం
విముక్కపరభాఅపాఅడం ససిబింబం"[2]

అను గాథను ఆంధ్రీకరింప నారంభించితిమి. వారు "తరచు నీరుఁ గడిగినకరణి" తమ తెనుఁగు నుడికారముతో తిన్నగా నారంభించిరి. "దూరదృశ్య మానము" అని నే నందుకొంటిని. ఆ సాంస్కృతికము చెవిని బడినంతనే శర్మగారు "వేపకాయదిన్నట్లు" తల్లడిల్లిపోయిరి. అంతతో నేను మౌనవ్రతమును బూని తిని. వరుసగా మూఁడుదినములు 'తెనుఁగునేఁతకు'

1. మగనేఁత, పరువమైన వయసు, వలపువేడి, ప్రేమంపుచవులు, సిగ్గుదెగినవాఁడు, మగఁదూరలేని దాన.

2. "పర్యాప్తసలిలధౌతే
దూరాలోక్యమాన నిర్మలే గగనతలే,
అత్యాసన్నమివ స్థితం
విముక్తపరభాగప్రకటం శశిబింబం".

యత్నములు జరిగెను. పద్యము ముగియఁజేసెరు. నేఁటికిని ముగియలేదేమో! అనఁగా నది వారి యశక్తత గాదు; మరి వారి కళాస్వభావ మట్టిది. ఒక్క పద్యమును వారు దాదాపొక నెలదైనను వ్రాయుదురు. వ్రాసినది కేవలరత్నముగాఁ గాదు—'జాతిరత్నము' గాఁ దయారు సేయుదురు.

"నేను చేసిన దంతయు నాయేఁడుసూర్లలో నాయభిరుచికి వచ్చినవాని నేరుకొనుట, మూలభావమును చెడనీయక తెలుఁగులోఁ బెట్ట ప్రయత్నించుట — ఇంతే" (గాథా సప్తశతి — ప్రస్తావన) అని తమ గ్రంథమునఁ దమ పరిశ్రమవిషయమై యభిప్రాయ మిచ్చుకొనిరి. దీనిచే వారి సుగుణసంపత్తికి మెఱుఁగే యేర్పడినది. కాని తెల్పిన సిద్ధాంతము మాత్రము వాస్తవముగా నసత్యము. కొన్నియెడల శర్మగారు సరికి సరిగా వారు పైన చెప్పుకొన్నట్టులే యనువదించిరి. కొన్నియెడల రూపమునే మార్చి వేరొక రమణీయమనోహరమగు రూపము నొసఁగిరి. ప్రాకృతములోని జాతీయములు చూచి "మా తెనుఁగులో మాత్ర మివి లేవా" యని పంతము చేసికొని కొన్ని జాతీయములను వెదకి తెచ్చి వానికి ప్రాణప్రతిష్ఠ చేసిరి. చూడుఁడు:

౧ అళియపసుత్త = దొంగనిద్దురవాఁడ
౨ ఖరహియయో = రాతిమనసువాఁడ
౩ ణిఉణిరే = నెఱజాణ
౪ హాలహాలియో = వలపుకేడి
౫ చత్తరో = పెద్దవీథి.[3]

ఇట్టి ప్రయోగములే వెదకుకొలఁదియుఁ గానపించుచుండును.

సరికిసరిగా ననువదించినవి:

"కిం రుఅసి ఓణయముహీ
ధవలాయంతేసు సాలిఛేత్తేసు,
హరిఆలమండిఅముహీ
ణడివ్వ సణవాడిఆ జాఆ."[4]

తెనుఁగు—

ఆ. "పండి తెల్లవారు వరిచేనులను చూచి
యేల మొగము వంచి యేడ్చెదమ్మ!
చూడు! జనుపచేను సొగసరొయ్య నరవళిం
బలఁదుకొన్న యాటవెలఁది వోలె."

"చత్తరఘరిణీ పిఅదంసణా అ
తరుణీ పఉత్థవఇఆ అ,
అసఈ సఇజ్జిఆ
దుగ్గఆ అ ణహు ఖండిఅం సీలం"[5]

తెనుఁగు—

ఆ. "రమ్యమైన రూపు, రమణుఁ డూరను లేఁడు,
పేదరికము, పెద్దవీథి నిల్లు,
పరువమైన వయసు, పొరుగింటి చెలి జార
యైన నార! చెనటు చాన చూడు."

పైయనువాదములఁ గాంచినవారు 'తెనుఁగుసేఁత' లో శర్మగారి దృష్టి యెంత నిశితమైనదో గమనింపఁగలరు. ప్రాకృతమునందలి భావమును తెనుఁగునకుఁ దీసికొనివచ్చుటలో నెంత 'నాజూకుతనము', జాగ్రత్త గావలెనో యంతకన్న నెక్కుడయే స్ఫురించుచున్నది.

మొదటిపద్యమున 'చూడు' అను పదముచే Dramatic effect (నాటకీయ ప్రయోజనము) సాధింపఁబడినది. 'మండిత' శబ్దమునకు 'సొగసు' అను తెనిఁగింపు చాల సొగసుగానున్నది. 'నటీ' యనుదాని 'కాటవెలఁది' యని తెనుఁగుసేఁత. ఆటవెలఁదిపద్యమున నాపదమునే యుద్ఘాటించుటచేఁ గలుగు

3. (౧) అళీకప్రసుప్త, (౨) ఖరహృదయో, (౩) నిపుణికే, (౪) హాలహాల, (౫) చత్వరః.

4. "కిం కోదివ్య స్వపనతముఖీ
ధవళాయమానేషు శాలిక్షేత్రేషు
హరితాళమండితముఖీ
నటీవ శణవాటికా జాతా."

5. "చత్వరగృహిణీ, ప్రియదర్శనా చ,
తరుణీ ప్రోషితపతికా చ,
అసతీ ప్రతివేశినీ దుర్గతా చ,
నఖలు ఖండితం శీలం"

సాంకేతికమగు స్వారస్యమటు లుండఁగా 'పటో'శబ్దమున కనురూపమగు నాచ్ఛిక మంతకన్నను దొరకదు. "మండితముఖీ శణవాటికా" అనువానిలో నున్న స్త్రీలింగస్వారస్యము తెనుఁగున నంతస్పష్టముగా రాకపోవుటలోని తప్పు ఆచ్ఛికపదములదే గాని శర్మగారిది గాదు. అక్కడికిని వారు 'చేను' అను స్త్రీసమముచే వాడి తమ ధ్వన్యాచార్యబిరుదమును నిలుపుకొనిరి.

ఈ రెండు పద్యములయందును మూలముల ననుసరించియే పదములు కుదిరినవి. మొదటిదానియందు మాతృకలోవలెనే భావమును, పదములును పాదాంతము వఱకు నిలువక నడచినవి. రెండవదానిలో ప్రాకృతగాథలోవలెనే పదములు మట్టసముగా కుదిరినవి. శైలి ననుసరించుటలో నెంత తీక్ష్ణమగు దృష్టిని సాధించినారు! ఇంతకన్నను గంభీరముగా ననువదించు రసికు లున్నారా యని ధైర్యముగా నడుగుచున్నాను.

మూలమునకు నొక్కులుదీర్చిన చోటులు:

"పసువయిణో రోసారుణ
పడిమాసంకంతగోరి ముహయందం"6

గీ. "అలుకమెయి కేవురించిన యాదిశక్తి
మోముచందురునీడ"

మూలమునందలి 'గౌరి' శబ్దమునకన్నను తెనుఁగులోని 'యాదిశక్తి' పదము చక్కఁగాఁ గుదిరినది. అలుకగొన్న పార్వతి యాదిశక్తి యగునుగాని గౌరి గాదు.

'అరుణ' శబ్దమునకు 'కేవురించు' అని తెనుఁగు. రెంటికిని అర్థము సమానముగనే యున్నది. కాని 'కేవురించు' అను పదోచ్చారణములోనే యొకవిధమగు భావస్ఫోరకత్వ మున్నది. ఆస్వారస్య 'మరుణ' శబ్దమునకు లేదు.

మూలమునకు మెఱుఁగిచ్చిన చోటు:

"అసమత్తమండణావిఅ
వచ్చఘరం సే సకోఉహల్లస్స"7

తెనుఁగు—

"ముగియకున్న నేమి సొగసులు బొమ్మకొల్పె,
వలచి వేచియున్న వానికడకు"

మూలమునందు "అసమత్తమండణావిఅ" అను పద విధేయవిశేషణము. దానిని తెనుఁగున చక్కని జాతీయముగా మార్చినారు శర్మగారు.

మూలమునకన్నను వాడిగా చెప్పిన చోటులు:

"అమజరో మేమందో
అహవ ణమందో జణస్స కా తంతీ"8

తెనుఁగు—

"తగ్గియున్నదో తగ్గదో దారిపోవు
వారికందరి కేల నాజ్వరముచింత"

"హిఅయం పలీవియవి
అణుసరేణ పుట్ఠింపలీవేసి"9

తెనుఁగు—

"మొదల వగలబెట్టి యెదగాల్చినదిగాక
యేల వీపుగాల్చె దిపుడు పోర"

తెనుఁగునందలి వాడి మూలములందు లేదని సహృదయులు తెలియఁగలరు.

మూలరూపమునే మార్చిన చోటులు:

"జయి చిక్కల్లభ ఉప్పఅ,
పయమిణ మలసాయి, తుహపదే దిణ్ణం
తా సుహఅ కంటకిజ్జం
తమంగమే ణ్హిం కీసో వహసి."10

తెనుఁగు—

"నడువలేని మగువ యడుగును దాటనా
యడుగులందు నడుగ లిడిన దంతె—

---

6. పశుపతేః రోషారుణప్రతిమాసంక్రాంత గౌరీ ముఖచంద్రం.

7. "ఆసమాప్తమండనైవ
వ్రజ గృహం తస్య సకౌతూహలస్య"

8. "అమజ్వరో మే మందో
అథవా నమందో జనస్య కా చింతా"

9. హృదయం ప్రదీప్యాప్యమళయేన, పృష్ఠం ప్రదీపయసి.

10. యది కర్దమభరోత్పూరితపద మిద మలసయా తవపదే దత్తం, తత్పునీధగ కంటకిత ఘంగమిదానీం క్షిమిథి వహసి.

"యనెద వందకొఁడ — యటులైన నీదు మే
నెల్ల నిట్లు పులకరింపనేల"

మూలమునం దీభావము సంభావనరూపమున లేదు. నాయకుఁ డింతకుముందే సమాధాన మిచ్చి యున్నాఁడు.

ఆ సంభావనము నందుకొని నాయికయో మరె వ్వతెయో సోపాలంభముగాఁ బలుకుచున్నది. ఒకవేళ మూలమునందుఁగూడ నాయకుని మాట లనువదింపఁ బడియే యున్న వని యతిక్లిష్టముగా సాధించినను సౌలభ్యము మాత్రము లేదని యెవ్వరైనను అంగీకరింప వలసినదే! అట్లుగాక తెనుఁగుపద్య ముత్తర ప్రత్యుత్త రములతో స్పష్టముగా నున్నది. 'అనెదవు' అనెడు పద మీ రెంటికిని అందియిచ్చినట్లు సంబంధమును గలుపుచున్నది. ఈ స్పష్టమగు సంభావన రూప రచనా విధానముచే శర్మగారు 'భావచిత్రము' నకు ప్రాణప్రతిష్ఠ చేసినారు.

ఇట్టిదే మఱియొకటి:
11 "సిహిపిచ్ఛలులియకేశే,
వేవంతోరు, విణిమీలియద్ధచ్ఛి
దరపురిసాయిరి వీసమరి
జాణసుపురిసాణజం దుఃఖం"

"నెమలిపించియవోలె పెన్నెరులు సెదరె,
కనులు మూఁతలుపడియె, ముంగాళ్లు సెదరె,
ఇంతమగసేతకే యింతవంత లైన
నెంతకష్టమొ, మగవారి దెంచి చూడు."12

మూలమునం దన్నియు విధేయ విశేషణములు. తెనుఁగునం దట్లుగాక అన్నియు తత్కాలస్థితికథన మాత్ర విశ్రాంతములుగా కూర్పఁబడినవి. 'రతిసమ యమున ప్రత్యక్షసంబోధనము, అందునను మూలము నందలి వంటివి నాయికలకు లజ్జాజనకములు, రసాభాసకారణములుగూడ. ప్రకరణాది పర్యాలోచ నమునను, విశేషణముల పౌర్వాపర్యముచేతను నాయిక మధ్య యగునుగాని ప్రౌఢమాత్రము గానేరదు. ఇవి యన్నియు నాలోచించియే రసజ్ఞులగు శర్మగారు తమ రసవాదవిద్యచే మూలభావమును తెనుఁగున సువర్ణముగా మార్చివేసిరి. దీనిచే భావికాలంకారము సుదిరి, దృశ్య మింకను స్పష్టముగా, ప్రకాశమయముగా, మనోహర ముగాఁ గన్నులకుఁ గట్టినది. ఇట్టివి వెదకి యుదాహరింపఁ బూనుకొన్నచో వారి గ్రంథమునంతయు నాపాదమూల ముదాహరింపవలసి వచ్చును. ఇంతకును నొక విషయము మాత్రము పరమసత్యము. ఆంధ్రీకృతమగు ప్రతిపద్యము నందును శర్మగారి యమృతహస్త మున్నది. ప్రాకృతము నందలి లలితభావములును, శర్మగారి లలితతరమగు రచనయుఁ జేరి యాంధ్రులమగు మన భాగ్యవశమున పీయూషభాండముగా, అదృష్టనిక్షేపముగా దొరకినది.

సాధారణముగాఁ దెనుఁగుపండితులలో నొక దౌర్బల్య మున్నది. గీర్వాణమును వాడనిది తెనుఁగునకు వాఁడియు వేఁడియు రాదని వారి నమ్మకము. అట్టి వాదమునకు శర్మగారి రచన నేరుగా నెదురుతిరిగిన నడత. విధి లేకున్న నేతప్ప సాధారణముగా వారు సాంస్కృతికములను వాడనేవాడరు. 'జాను తెనుఁగు'లోనే చిక్కని సౌందర్యమును దీసికొనిరావలెనని వారి యాశ. అచ్చికములు దొరకనప్పు డన్యదేశ్యములైనను వాడి తృప్తి పడుదురు. "సాంస్కృతికములకన్నను అన్యదేశ్యముల వాడుటయే తెనుఁగువారమగు మనకు మర్యాద" యను నంతవఱ కాయన యభిప్రాయము. ఉన్నవానిలో మంచి 'పదకము'వంటి పదముల సృష్టించు శక్తి యున్నది. లేనివానిని సృష్టించుకొను నిర్మాణచాతురి యున్నది. ఆంధ్రుల జీవితములోని కొంతవఱకైనను చొచ్చుకొనిపోవు ననుభవ మున్నది.

అతని కేమి తక్కువ! ఆయనరచనలో నన్ని కవితాలక్షణములును అందరుకులు లేక సంపూర్ణముగాఁ గుదురుకొన్నవి. రసప్రవాహము శరత్కాలమద

---

11. "శిఖిపింఛలులితకేశే,
వేపమానోరు, వినిమీలితార్ధాక్షి
ఈ పత్పురుషాయితే విశ్రామశీలే,
జానీహి పురుషాణాం యద్దుఃఖం"

12. ఈచాటువు ముద్రితముగాదు. దీనిని వేసవిలో వారిదగ్గఱ చూచితిని. జ్ఞాపక ముంచుకొని యుదాహరించితిని. ఈస్వాతంత్ర్యమునకు వారు క్షమింతు రనుకొందును.

ఘూర్ణితమై ప్రవహించినది. 'ధ్వనికన్య' కన్నుల నవ నీహారమధురములగు చూపులు రాల్చి సర్పనాట్యములు గావించినది. అతని రచన మహాకావ్యము గాదు; మరి ముత్యములవంటి ముక్తకములు. ప్రాచీనాధునాతనములగు మహావాక్యములు చదివి యీ యెరవడిలోఁ గొట్టుకొనిపోవుచు వేసారిన మనము శర్మగారి గాథల చదివి క్షణకాల మానందముగ కన్నులు మూయవచ్చును. పెనుగొండలోని ద్రాక్షాగుళుచ్ఛములవంటి వాతని ముక్తకములు. శర్మగారు మహాకావ్యముల వ్రాయలేరు; వ్రాసినవాని నాంధ్రులు మరువలేరు. క్రిందటి సంవత్సరము నవ్యసాహిత్యపరిషత్తులో విశ్వనాథ సత్యనారాయణగారు "ఆంధ్రదేశమున శర్మగారి రచనలు చావ"వని చెప్పినారు. చావవు. ఆంధ్రులకు రసమును గ్రహించు జీవనాళిక లున్నంతవరకు శర్మరచనలు తారలవలె నిత్యనూతనప్రభలతో నితరుల కందరాని యంతరిక్షమున వెలుఁగుచునేయుండును. మామిడిపూఁత వంటి యాంధ్రకవుల రచనల సేకరించిన యాంధ్రభూపతియగు హాలుఁడును, వాని నాంధ్రీకరించిన యాంధ్రుఁడగు శర్మగారును ధన్యులు. ఈ రెంటిని జదివి యానందపడు మనమో! ధన్యతరులము గామా ?

శర్మగారి గీర్వాణకవితగూడ వారి 'తెనుఁగు' వలెనే మనోహరమైనది. సంస్కృతమున చిక్కని కండ దేరిన సాహిత్యముతో కలము నడపి యాలంకారికులలో మత్తము లనిపించుకొన్న కృష్ణబ్రహ్మతంత్రుల వారి శిష్యుఁ డాయన. వారివలెనే హాయవదనకరుణా కటాక్ష వీక్షా దీక్షాసాదితాఖండ సాహితీరసికుఁడు. కాని గురుశిష్యుల కొక భేదము మాత్రముగలదు. అంతవారి శిష్యుఁడైనను ఆ పాండిత్యపు ఖర్తులుగాని, యాశాస్త్రీయపు పంథలుగాని యలవరచుకొనలేదు. "చిలికిన పాల మీగఁడల"వంటి భావమునే యుపాసించినాఁడు. కవికుల గురువగు కాళిదాసును ప్రేమించినాఁడు. వాగ్దేవీవల్లభుఁడగు భవభూతి నుపాసించినాఁడు. విభిన్నములగు నీ రెండుమనోభావములను జోడించుకొని శబలితమగు సంస్కారము బారలు సాఁచినది. సవ్యసాచి వలె సాహిత్యరథమున నుపవిష్టుఁడైనాఁడు. అతని కవితలో సుఖమున్నది. దుఃఖమున్నది. సుఖదుఃఖముల లగించుకొన్న 'మధురదుఃఖ'మున్నది. ప్రపంచవాతావరణమునే బొత్తిగా వదలి యాకాశవీథులలో, నాదర్శభూములలోఁ దిరుగఁడు. ఆదర్శములను సంపూర్తిగాఁ దిరస్కరించి అన్నమయకోశమునే యంటిపెట్టుకొనఁడు. మరి యాతని కవితకు ప్రాపంచికాదర్శములు జీవభూతములు. ఆదర్శములను త్రోసివేయని ప్రపంచ వస్తువు. మానవునకు దయాపరుఁడగు భగవంతుఁ డొసఁగిన మితములగు ననుకూలములలోనే చల్లని శాంతిని సాధింపవలెనని శర్మనీతి. నిరంతరము విపరీతదుఃఖములతో క్రుంగి కృశించిపోవుచు "అయ్యో భగవంతుఁడా" యని చావురాగములు దీయుటకంటె ఆత్మతృప్తితో, తృప్తికోలఁకు కన్నులతో, కన్నులనిండుకొన్న మధుర బాష్పములతో జీవితము నొక నవవిచికిలమగు పువ్వువలె భగవంతున కర్పించుటే మనము చేయఁదగిన నిజమైన పూజయని యాతని యభిప్రాయము.

సంస్కృతమునందు చల్లని జాతీయములకు, పూలగుత్తులవంటి పదములను చేరిపెట్టుకొన్నాఁడు. ఆ పదములలో ఆ రమణీయమగు భావమును బొదిగి ఆతఁడే ఆ చల్లని కంఠముతోఁ బాడినపుడు మన మేమి భాషాదేవియే పులకించును. అతని చాటువులలో నొక దానిని చూడుఁడు. ఒక గేస్తురాలి సాంసారికానుభవము :

"రదనముకుళై ర్ద్విత్రై ర్మాతో ర్దగ్ధమాత్రి యదంశనైః
సపది శిశునా మాతా దష్టస్తనీ కృతసీత్కృతిః,
కిమితి సహసా పృష్టా పత్యా నకించి దితీక్షణే
నమయతి ముఖా గోష్ఠీప్రాంతస్ఖలన్మధురస్మితా."

భావమును, భామయును పందెములు వేసికొని నడచిన ట్లుండలేదా ? కాళిదాసు పద్యమధ్యములనుండి హాసన్ముఖుఁడై తొంగిచూచుచున్నాఁడు. "నకించి దితీక్షణే నమయతి ముఖాక్" అనుచోట చల్లని వ్యాకరణహారికము సుదిరినది. 'స్ఖలన్మధురస్మితా' అనుచోట 'స్ఖలత్' అనుశబ్దము పరమోదితముగా, ధ్వనిపుష్టముగా నదికినది. ఇంకెవఁడైన నైనచో జోరుగా 'ఉచ్ఛలత్' అని వాడియుండును. చల్లని శృంగారము. వెర్రి వెర్రిగాఁ జెప్పి కొందరివలె శృంగారమును బీభత్సముగా మార్చలేదు. రసమున కనురూపముగా ముత్తెములవలె

గుప్తముగా నదుకుకొన్న వ్యస్తపదములు "మమ్ముఁ జూడలేదా" యని కనుసన్న చేయుచున్నవి. మధురమగు భావన, మధురతరమగు రచన. ఇట్టిదే మఱి యొకటి :

"నిషిద్ధాన్యై వాసో పరిమృశతి వస్త్రాని నచ తైః,
అథగ్నిం స్పృంతుమ్య త్యథ హసతి తజ్జ్ఞాసుబహులం,
కథం నిర్వోఢవ్యో గృహవిధి రనేనేతి వివశాం
శిశో పత్నీం పశ్యన్ వికసితముఖో నందతి పతిః"

ఈ భావము నవవికసన్నీ రేజమధుర సుందరము గాదా ? ఇట్టి చాటువు లనేకములున్నవి. వారి ప్రతి ముక్తకమును నొక రత్నమే. సాధారణముగా సంస్కృత వాఙ్మయమున చరమకాలమునఁ బుట్టిన వన్నియుఁ బదకవిత్వములే. అందునను 'శ్రీ వైష్ణవకవులకు' భాషను నడపుటలో మరెవ్వరికిని లేనంత చాపల్యము. సంస్కృతపండితులలో 'శ్రీవైష్ణవ కవిత్వ' మని యొక వ్యవహారమే పాదుకొనిపోయినది. కాని కృష్ణశర్మగారి కీపరిపాటి యంటలేదు. తప్పించుకొన్నాఁడు. భావుకచక్రవర్తి, అదృష్టవంతుఁడు. తెనుఁగునను, సంస్కృతమునను నీరీతి సమానమగు శక్తితో కలమునడుపువారు మనలో తక్కువ. అందునను ఫుల్లమల్లీ మధురమగు నిట్టి సంస్కార ముండుట మిక్కిలి తక్కువ. ఇంకేమి కొదువ యాతనికి ! ఒకటిమాత్రము కొదువ. అనర్ఘములగు నిట్టి చాటువు లన్నియు వారి బీరువాలోఁబడి యూపిరాడక యవస్థ బడుచున్నవి. వాని నాచీఁకటికొట్టులోనుండి గడ్డకు తెచ్చి చక్కఁగా ముద్రించి యాంధ్రులకుఁ బంచవలసిన బాధ్యత వారి పైన నున్నది. వాని నాదరింపవలసిన బాధ్యత మనది గాదా ?

కృష్ణశర్మ మహాభాగ్యశాలి. సంగీత సాహిత్యము లాతని వలచివచ్చినవి. శర్మకవిత యొక్క సంగీతము, సంగీత మొక్క కవిత. ఈ రెంటి నిత్య సంబంధముతో నాతని జీవితమే గానముగా, కవితగా మారిపోయినది. ఎన్నో భాషలు చదివినాఁడు. ఎంతయో విజ్ఞానము నార్జించినాఁడు. చల్లని కవిత లల్లినాఁడు. గద్యమున నొక శకమే నిలిపినాఁడు. గద్యపద్యములు రెంటిలోను సంస్కారమును కుప్పవోసినాఁడు. అన్నిటికిని చేయివేసి అవకతవకపనులు చేయలేదు. ప్రారంభించినది 'సరసముగా' రచింపక మానలేదు. పండితులకు, పామరులకు కృష్ణశర్మ పేరు మంత్రదండమైనది. ఆ నోటినుండి యే పలుకు జాఱినను అమృతమధురమే. ఆ కలమునుండి యే పదము దొరలినను ముత్యాల జల్లే. నేఁటికాలమునందలి సాహితీధురీణులలో శర్మ జనకుని వంటి 'రాజయోగి.'

ఆ సంగీతనిష్ణాతునకు — సాహితీరసికునకు — రసకవికి — భావుకపండితునకు ఆంధ్రులమగు మన మొసఁగు సత్కార మేమి ? మన సత్కార మొక్క మనఃపూర్వకమగు నమస్కారమే.





# కావ్య జగత్తు

= శ్రీ జి. వి. కృష్ణరావు =

కింకవేస్తస్య కావ్యేన కిం కాండేన ధనుష్మతః,
పరస్య హృదయే లగ్నం న ఘూర్ణయతి యచ్ఛిరః.

కావ్యజగత్తు నిత్యనూతనం, నిత్యసుందరం; ఎప్పటి కప్పుడపూర్వం. మనీషకు అందినట్లుంటుంది కాని అందదు. హృదయానికి తగులుతూ వుంటుంది. బుద్ధికి చిక్కదు; తప్పించుకు పోతూనే వుంటుంది. ఇలాంటి కావ్యజగత్తుకి కొందరు అలంకారము ఏలిక అన్నారు; కొందరు రీతి అన్నారు; కొందరు గుణమన్నారు; కొందరు రసమన్నారు; కొందరు ధ్వని అన్నారు; కొందరు వక్రోక్తి అన్నారు; కొందరు భక్తి అన్నారు; కొందరు 'స్వచ్ఛందభావాలు[1]' అన్ను-తమూ నన్నారు.[2] ఎవ్వరేమి చెప్పినా ఆనందం[3] ఏలికంటే ఎవరికీ అభ్యంతర ముండ దనుకుంటాను.

అయితే కావ్యజగత్తులోని ఆనందం సమాజంలో సర్వసాధారణంగా యథాతథంగా కనిపించకపోవటం వల్ల విస్తుపోవటం సంభవిస్తూవుంది. సంస్కృతాన్నుంచి అపభ్రంశాలు బయలుదేరినట్లుగానే, కావ్యజగత్తునుంచి అపభ్రంశరూపంగా సామాజికజగత్తు వచ్చిందని కొంద రభిప్రాయపడుతున్నారు. ఈ మతంప్రకారం కావ్యజగత్తు సత్యం – సామాజికజగత్తు మిథ్య.[4] కాని యీమతం కేవలం భ్రమపూర్వకమైన దనటంలో సాహసం ఏమాత్రం లేదు. కావ్యజగత్తువల్ల కలుగుతున్న ఆనందంవల్ల వివశులై జ్ఞానాన్ని విసర్జిస్తున్నారు; కాక ఆధునికశాస్త్రాలు పరిశోధించి కనుగొన్న విషయాలను అవగతం చేసికోవడం లేదు. ఒకవేళ చేసికొంటే, విస్మరిస్తున్నారు. కావ్యజగత్తుకి శాస్త్రాలు సంపూర్ణవ్యాఖ్యానం వ్రాయలేకపోవచ్చును. అంతమాత్రంచేతనే యీ కావ్యజగత్తు సామాజికజగత్తు కతీతమైనదనికాని, కావ్యజగత్తులోనుంచి సామాజికజగత్తు వచ్చిందనికాని చెప్పటం కేవలం మూఢత్వమే నని చెప్పాలి. సామాజికజగత్తునుంచి కావ్యజగత్తు వచ్చింది. అయితే యిలా వచ్చిన కావ్యజగత్తు సామాజిక జగత్తును స్వల్పంగా మార్చవచ్చును.[5] ఈవిషయం ఎలా తేలిందన్న ప్రశ్న వస్తుంది.

---

1. *Free Associations.*
2. ఈ మతం అతివాస్తవికులది.
3. సంతోషానికి పర్యాయపదం కాదు. నిర్లిప్త సౌఖ్యం.
4. క్రోచే తన ***Aesthetics*** లో అంటాడు.
5. దీనికి *Mechanical Materialists* మార్క్సును సరిగ్గా అర్థం చేసికోని బుఖారిన్ లాంటివారు ఒప్పుకోరు. పారస్పర్యంవల్ల మార్పుకలగదు; ఒక్క ఉత్పత్తిసాధనాలే అన్నిమార్పులకు కారణమని తన *'Historical Materialism'*లో బుఖారిన్ వ్రాస్తాడు.

కావ్యం శబ్దాలతో నిర్మింపబడుతుంది. సాంకేతికవాదుల్లో[6] అతివాదులు నాదంతో నిర్మింపబడుతుంది అంటారు. వీరికి శబ్దగత అర్థం ప్రధానం కాదు; శబ్దగతనాదం ముఖ్యం.[7] ఈవాదాన్ని అంగీకరించటానికి వీల్లేదు. ఆదరించేపక్షంలో కవిత్వానికీ, సంగీతానికీ భేదమే ఉండదు. అందువల్ల కావ్యజగత్తు శబ్దాలతో నిర్మింపబడుతుంది. అందుకనే జగన్నాథపండితుడు కవిత్వాన్ని 'రమణీయార్థప్రతిపాదకః శబ్దః' అని నిర్వచించాడు.

అయితే యీశబ్దంసంగ తేమిటి? ఈశబ్దం లౌకికమా, అలౌకికమా? ఈశబ్దం ఎలా వస్తున్నది? శబ్దం ఏమిచేయకలుగుతుంది? ఈప్రశ్నలకు సమాధానం చెప్పుకుంటే మనకు ప్రస్తుతమైన విషయం కొంతవరకు తేలుతుంది.

శబ్దం అర్థవంతం. శబ్దానికి అర్థమంటే ఏమిటి అని ప్రశ్నించి ఇతరులను కలవరపరచటం, తమకుతాము కలవరపడటం జరుగుతున్నది.[8] మనస్సులో శబ్దంవల్ల ఏది గోచరిస్తుందో, ఈ గోచరించినదానివల్ల ఏవేదనం కలుగుతుందో, దాన్ని అర్థ మందాము. అయితే శబ్దానికి ఈశక్తి ఎలా వచ్చింది? శబ్దంలోనే వుందా? ఈవిషయం తేల్చుకోవాలంటే పెద్దరగడలోకి దిగవలసివస్తుంది. పదిరూపాయలనోటు కున్నశక్తి ఎక్కడినుంచి వచ్చింది అని ప్రశ్నిస్తే, ఆర్థికశాస్త్రమంతా అవలోడించి చెప్పవలసిన స్థితి ఏర్పడుతుంది. తర్కించిం తరువాత పదిరూపాయల నోటువిలువ దాని కాగితంలోకాని, బొమ్మలోకాని, రంగులోకాని, సైజులోకాని లేక, సమాజంలోని మారకాన్ని పట్టి ఏర్పడునట్లే శబ్దానికి అర్థం లోకవ్యవహారంవల్ల ఏర్పడుతున్నది. అందుకనే శబ్దశాసనుడు 'సిద్ధిర్లోకాద్ద్రుత్యా లోకోఽనవ్యాదృశబ్దే నిత్యశబ్దే'[9] అన్నాడు.

శబ్దం జాతి గుణ ద్రవ్య క్రియాచ్ఛాయలకు సంకేతం. ఇంతటితోనే శబ్దంపని అయిపోదు. సమాజంలో ఈజాతిగుణద్రవ్యక్రియలవల్ల మానవునికి సాధారణంగా పొడమే వేదనలకుకూడ సంకేతం; అంటే యీ మనోవికృతులను కలిగిస్తుంది. స్నేహితునితో మాట్లాడుతూ పాము, పాము అంటూ అనండి. అతడు ఉలిక్కిపడతాడు. ఎందువల్ల? పాము అనే శబ్దం విన్నవాని మనసులో అణగివున్న విషజాతిప్రాణి రూపచ్ఛాయను తెచ్చి పెట్టింది. అంతేకాక లోకంలో పాము అనేదాన్ని చూస్తే ఏ వేదనలు కలుగుతాయో వాటిని కలిగించింది. అందువల్ల శబ్దానికి ప్రత్యక్షాంశాలను, వేదనలను కలిగించే శక్తిఉంది. అయితే శబ్దాన్నుంచి యీ ప్రత్యక్షాంశవేదనల రెంటిలో ఏ ఒకదానినీ విడదీయటానికి వీల్లేదు. ఈ రెంటికీ శబ్దానికీ అవినాభావసంబంధ ముంది. అంతేకాని ప్రత్యక్షాంశాలను సూచించటానికి ఒకశబ్దం, ఆ ప్రత్యక్షాంశంవల్ల కలిగే వేదనలను కలిగించటానికి వేరొకశబ్దం ఎందుకు సృష్టించుకోగూడదు అనే ప్రశ్నవస్తుంది. జీవితంలో ఒకవస్తువు, ఆ వస్తువువల్ల కలిగే వేదన కలసిఉంటున్నట్లే శబ్దంలో ప్రత్యక్షాంశసంకేతం, దీనివల్ల కలిగే వేదన కలసిఉంటున్నాయి. వేదనలను తెలిపే భీతి, దుఃఖంలాంటి శబ్దా లున్నాయి. అయితే యీ రెండు శబ్దాలూ దృశ్యములైన అవస్థలను, ఈ అవస్థలను చూచినట్లైతే కలిగే వేదనలను కలిగిస్తున్నాయికాని, నిజంగా, వినేవాడిలో కాని, చెప్పేవాడిలో కాని, చదివే వాడిలోకాని భీతిని, దుఃఖాన్ని కలిగించటం లేదు.[10]

---

6. *Symbolists.*

7. ఈ వాదాన్ని '*pure poetry* వాద' మంటారు. ఈ సిద్ధాంతాన్ని హెన్రీ-బ్రిమాండ్ తన '*Prayer & Poetry*' అనే పుస్తకంలో చిత్రించాడు.

8. *The Meaning of Meaning* by *Ogden and Richards.*

9. ఆంధ్రశబ్దచింతామణి.

10. ఈ విషయాన్ని కాడ్వెల్ ఇలాచెప్పాడు:

"*The word refers to this shadow world of thought and conjures up portions of it in a man's head. The common perceptual world, with all the condensations, organisations and displacement it has undergone, refers to and symbolises outer reality. It is all the quality mobilised for action. It is the compendium of what happens to percepts when the underlying reality is affected. The word symbolizes this shadow world which it has happened to create, and is therefore the symbol of a symbol.*" —*Illusion and Reality 161—2.*

శబ్దం నాదరూపకం. అందువల్ల అర్థంకంటే భిన్నమైన శక్తికూడ ఒకటిఉంది. ఈ శక్తి ఒక్కపద్య కవిత్వంలోనే కనిపిస్తుంది. ఇది "Break, Break" అనే టెన్నిసన్ పద్యంలోను, పో వ్రాసిన The Bells అనే శీర్షికగల పద్యాల్లోను, తిక్కనపద్యాల్లోను, గీతగోవిందంలోను చక్కగా కనిపిస్తుంది. ఇప్పటి సర్రియలిస్టులు, అంటే అతివాస్తవికులు తమవచనంలో కూడ ఈ నాదశక్తిని వాడుతున్నారు. ఈ నాదశక్తికూడ లౌకికమేనని శాస్త్రాలు పరిశోధించి చెబుతున్నాయి.[11]

ఇవికాక మన ఆలంకారికులు–ముఖ్యంగా అభినవగుప్తాదులు–రసచర్చల్లో వివక్షించిన విలక్షణజ్ఞానం, అంటే సమ్యక్ప్రతీతి, మిథ్యాప్రతీతి, సంశయప్రతీతి, సాదృశ్యప్రతీతికంటే విలక్షణమైన జ్ఞానంకూడ శబ్దంవల్ల కలిగేదే.

ఇంతేకూ శబ్దం సమాజసిద్ధమనీ, ప్రత్యక్షాంశాలను, వేదనలను తెలుపుతుందనీ, కలిగిస్తుందనీ తేల్చుకున్నాం. అయితే సామాజికజగత్తు అనంతంగా ఉండగదా, శబ్దాలు ఇలాంటి ప్రత్యక్షాంశాలన్నిటినీ చెప్పగలదా అన్న ప్రశ్న రావచ్చును. సమాజంచే సృష్టింపబడిన శబ్దంకూడ మారుతుంది. కొన్ని శబ్దాలు పోతాయి, కొన్ని కొత్తశబ్దాలు వస్తాయి. కొన్ని శబ్దాల అర్థం మారుతుంది. స్ఫోటవాదం శబ్దం నశించదని చెబుతూవుంది. దీన్ని సమర్థించటానికి వీల్లేదు. తెలుగుభాషలో ఎన్ని శబ్దాలు నశించలేదు? ఒకవేళ నశించకుండా ఏ శాసనంలోనో, ఏమూలనో, ఎచ్చటనో నిల్చిఉందనుకుందాము. ఉంటే? ఆంధ్రరాజుల నాణెములు ఒకటీ అరా ఉన్నాయి. మారకంలేనప్పుడు ప్రయోజనమేముంది?

అయితే ప్రపంచంలో ఎన్ని వస్తువులున్నాయో అన్ని శబ్దాలు లేనిమాట వాస్తవం. అంతమాత్రంచేతనే శబ్దవ్యాపారం నియతమని చెప్పటానికి వీల్లేదు. విశ్వనాథుడు చెప్పినట్లు శబ్దశక్తి అనంతంగా ఉంది.[12]

యాబర్‌క్రోంబీ అనే ఆంగ్లేయవిమర్శకుడు శబ్దశక్తి నియతమనీ, భావాలు అనంతంగా ఉంటాయనీ, కాబట్టి వీటినన్నిటినీ వ్యక్తంచెయ్యటానికి కవికి సాధ్యపడదనీ, అందువల్ల పాఠకుడు సానుభూతి కలిగి ఊహించుకోవాలనీ అంటాడు.[13] శబ్దశక్తి నియతమవ్వటంవల్ల కవి దిక్కున పడటంలేదు. ఇతరభాషాశబ్దాల్లోనో, 'రిథిమ్'లోనో భావించటంవల్ల భావప్రకటన సాధ్యం కావటంలేదు. కవియైనవాడు సామాజికశబ్దాలతో ఆలోచించాలి. అలాకాక రాగాలతోను, రేఖలతోను, వర్ణాలతోను భావిస్తే ప్రయోజనమేముంటుంది?

కాబట్టి శబ్దం సమాజసిద్ధమనీ, మారుతూవున్న సామాజికజగత్తులోని ప్రత్యక్షాంశాలను, వేదనలను తెలుపుతుందనీ తేల్చుకొన్నాం.

ఇలాంటి శబ్దాలతో నిర్మింపబడే కావ్యజగత్తు అలౌకిక మెట్లవుతుంది?

అయితే, పురాణాలు, ఇతిహాసాలు, బ్లూబర్డ్, ఏన్షియంట్ మారినర్ చిత్రించిన విషయాలు సామాజిక జగత్తునకు సంబంధించినవేనా?

"ఔదలఁ జదలేటిలేఁదరగలు వాలఁ
    దగు చందమామ సయ్యాల లూఁగఁ
దొడవుల తలలఁ జెన్నడరు మానికముల
    చాయ దిక్కుల సెలసంబు వఱుపఁ
దోరంపు టేనిక తోలియే డాలుకప్పు
    కుత్తుకతోఁ బ్రీతి పొత్తుసేయ
దిట్టంపుబూదిపూఁతల బూదెసఱచిన
    పులకలు పేరురంబునఁ దలిర్ప
మూఁడులోకంబులను గావ మొనసినట్లు
చేత ముమ్మొనకైదువు చెన్నుమీఱ
వేల్పుపనువు చూడ్కికి గడువింతయొప్ప
నేచె ముక్కంటియున్న యా చెలువు పేర్మి".[14]

అనీ,

"తొలుకారు మెఱుంగుల తోఁటలో వాడెను
    రాయంచకొదమతో రాయఁజాలి
యిరులబండారంపు టింటికిఁ బెట్టిన
    బొందుమల్లెలకోటఁ బోర గెలిచి

---

11. నాదశక్తి, భారతి 1941 మేసంచిక.

12. సాహిత్యదర్పణం.

13. ఈవాదాన్నే పురస్కరించుకొని భావకవుల్ని ముద్దుకృష్ణగారు సమర్థింపచూచారు. చూడుడు: వైతాళికుల పీఠిక.

14. ఎఱ్ఱాప్రెగ్గడ, హరివంశం.

బలుమంచుఁగొండ బాలబలసి రాఁజుట్టిన
క్రొత్తమంజిడి కాఁగుఁ గొఱఁతచేసి
పాలపెన్నురవు గుబ్బలిమీఁద నెలకొన్న
నిండువెన్నెలముగ్గ నిగ్గుచెఱచి
జడలఁ గ్రొన్నెల మెఱుఁ బాఁపసరిగఁ దొడలఁ
బొడలతోఁ జెన్న వెలిమిడిపూఁత మించఁ
బొడమ ప్రేవేలని ముందటఁ బొడవుమీఱెఁ
పొడువులందెల్లఁ బొడువైనపోఁటివేల్పు. 15

అనీ మనోహరంగా వర్ణింపబడిన శివుడు లౌకిక సృష్టికి లోనైనవాడేనా ? కవిభావన దైవప్రేరణవల్ల లోకాన్ని అతిక్రమించిపోతుందని చాలామంది అభిప్రాయం.

ఇలాంటి అభిప్రాయం, ఆధునికశాస్త్రాలు కష్టపడి పరిశోధించి కనుగొన్న సత్యాలను గుర్తించలేదని తెలుపుతుంది. ముఖ్యంగా మానసిక వైద్యశాస్త్రం వృద్ధిచెంది ఈ భావనావిషయంలో చాలా సత్యాలను కనుగొన్నది. ఈ కనుగొన్న సత్యాలను వినియోగించి మానసిక వైద్యం ఆధులను నివారిస్తున్నది. ముఖ్యంగా చార్కోటో, జానెట్, మోర్టన్‌ప్రిన్సు, ఫ్రాయిడ్, ఇతని శిష్యులైన జంగ్ 16 ఎడ్లర్ 17 సిద్ధాంతాలు చాలా సమస్యల్ని పరిష్కరిస్తున్నాయి.

కవుల వర్ణనప్రకారం శివుడు అలౌకికమూర్తి ఇలాంటిమూర్తిని కవులు ఎలా సృష్టించగలిగారా అనే సందేహం ఒకప్పుడు నన్ను పీడిస్తూ వుండేది. కాని సైకోఎనలిస్టులు బండారం బయటపెట్టారు. 18 ప్రస్తుతం శివుడు అలౌకికుడు కాదనీ, వ్యాసుడు వాసనలను ప్రకృతిసిద్ధమార్గాలను పోనీక సంయమించటంవల్ల ఈసృష్టి బయలుదేరిందనీ, శివుని ఆకృతి అలౌకికం కాదనీ, కేవలం పుంస్త్వస్వరూపమేననీ గ్రహిస్తే చాలు. ఏన్ని యంట్‌మారినర్ ఎలా సామాజిక జగత్తు నుంచి బాహిరిల్లిందో రీడ్‌వగైరాల విమర్శలను చదివితే తెలుస్తుంది.

భావనల తత్త్వాన్నిగూర్చికూడ కొంత తెలుసుకొందాము. నిజానికి భావాలు జాగ్రదవస్థలో కంటే స్వప్నావస్థలో విపరీతంగా పరుగెడుతుంటాయి. సామాజికజగత్తుతో ఏసంబంధం లేనట్లు కనిపిస్తాయి. ఇలా కనిపించటంవల్లనే స్వప్నం దైవప్రేరితమనీ, కాబోయే అర్థాన్ని సూచిస్తుందనీ, దుస్స్వప్నాలకు శాంతిచేయించుకోవాలనీ అనేవాళ్లుకూడ ఉన్నారు.

స్వప్నాలు ఎందుకువస్తాయో, వీటి ప్రయోజనమేమిటో, నిర్మాణం ఎలా వుంటుందో, లౌకికానుభూతికీ, స్వప్నానుభూతికీ ఎలాంటి చుట్టరికముందో, ఈస్వప్నభావాల అర్థమేమిటో, ఫ్రాయిడ్ చాలావరకు పరిశోధించి కనుగొన్నాడు. 19 భావాల తత్త్వాన్నికూర్చి తెలిసికోవాలంటే స్వప్నాన్నిగూర్చి తెలిసికోవాలి.

ఫ్రాయిడ్ మనస్సును మూడుభాగాలుగా విభజించాడు: ౧. బుద్ధి 20, ౨. ఉపబుద్ధి 21, 3. అవ్యక్తం. 22 మానవుడు నిద్రపోతున్నప్పుడు బుద్ధి పనిచెయ్యదు. అదికూడ నిద్రపోతుందని చెప్పవచ్చును. అంటే అహంత జ్ఞానేంద్రియాలు పనిచెయ్యకపోవటంవల్ల అంకెరుక్కి మూతుంది. అందువల్ల దేశకాలాలు జారిపోతాయి. జాగ్రదవస్థలో ఉన్నప్పుడు, బుద్ధి అవ్యక్తంలో దాగిఉండే వాసనల 23 ఇష్టాలను—తనకంగీకరింపరానివాటిని- అణచివేస్తుంది. ఇలా బుద్ధిచేత అణచివేయబడిన ఇష్టాలు 24, జాగ్రదవస్థలో సాధ్యపడని యిష్టాలు స్వప్నావస్థలో విహారానికి బయలు

---

15. నాచన, ఉత్తరహరివంశం.
16. ఇతనిది ఎనలిటికల్ సైకాలజీ.
17. ఇతనిది ఇండివిడ్యుయల్ సైకాలజీ.
18. చూడుడు : *The Madonna's conception, The Symbolic Significance of Salt* అనే రెండు వ్యాసాల్ని, ఎర్నెస్టు జోన్సు వ్రాసిన *Essays in Applied psychoanalysis* అనే పుస్తకంలో.
19. ఫ్రాయిడ్ వ్రాసిన *Interpretation of Dreams.*
20. *Conscious.*
21. *Preconscious.*
22. *Unconscious.*
23. *Instincts* కు వాసనలకు భేదముంది. అయినా గత్యంతరం లేదు.
24. *Unconscious Wishes.*

చేరుతాయి.[25] గడచిన రెండు మూడు రోజుల్లోని అముఖ్యసంఘటనలనే సూత్రాలు వీటికి యోగ్యాలు. ఈ సంఘటనల్లో సాధారణంగా అవాంతరాలవల్ల ఆపివేసిన ఆలోచనలు కాని, ఆలోచించే ఓపికలేక విడిచిపెట్టబడినవికాని, అసలు బుద్ధిలోకి రానీకుండా ఉపబుద్ధి త్రొక్కిపట్టిన ఆలోచనలుకాని, అముఖ్యంగా కనిపించటంవల్ల జాగ్రదవస్థలో పరిష్కారం పొందనివికాని ఉంటాయి.

ఇలాంటి స్వప్నభావాలన్నీ ఆత్మకేంద్రకాలుగా ఉంటాయి. అంటే, కలగనేవాడు కలలో నాయకుడుగా ఉంటాడు. కలలో అతడు కనిపించకపోతే, స్వప్నపాత్రల్లో ఎవరిలోనో దాగిఉంటాడు.

స్వప్నం నిద్రాభంగం కాకుండా చూస్తుంది. అందువల్ల స్వప్నదృశ్యాలు, భావాలు బుద్ధిలోకి ప్రవేశించవు. ప్రవేశిస్తే నిద్ర చెడిపోతుంది. అవ్యక్తంలోనుంచి వాసనా సంతుష్టిని పురస్కరించుకొని బయలుదేరిన దృశ్యాలను, భావాలను బుద్ధిలోకి ప్రవేశించకుండాను, తదనుగుణమైన చర్యలను జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు తీసుకోకుండా ఉండేట్లు ఉపబుద్ధి చూస్తుంది. అందువల్ల స్వప్నభావాలు, దృశ్యాలు ఈ ఉపబుద్ధిఆజ్ఞకు లోబడుతాయి. అందువల్ల, అంటే క్లిష్టీకరణం, వ్యత్యయీకరణం, మిళితీకరణం, వ్యతిరేకీకరణం, సంకేతీకరణం పొందుతాయి. వికల్పభావాన్ని స్వప్నం చిత్రించలేదు. అందువల్ల రెంటినీ ఒకదాని ప్రక్క ఒకదాన్ని చేరుస్తుంది. పోలికల్నీ, కదుపుల్నీ చెప్పవలసివస్తే, పోలిక ఉన్నవాటినన్నిటినీ ఒకటిగాను, కదుపును ఒకదానిద్వారాను చూపిస్తుంది. అందువల్ల స్వప్నంలోని భావాలు, దృశ్యాలు విచిత్రంగాను, అలౌకికంగాను కనిపిస్తాయి. నిజానికి స్వప్నంలో అలౌకికవిషయాలుండవు. దేశకాలాలు జారిపోవటంవల్ల జాగ్రదవస్థలో మనస్సునకెక్కి దాగియున్న జాతిగుణద్రవ్యక్రియాచ్ఛాయలను అసంతుష్ట అవ్యక్తగతవాసనలు ఉపబుద్ధిఆజ్ఞలను శిరసావహించి ప్రస్తారం చేస్తాయి. అందువల్ల అలౌకికాలుగా తోచే దృశ్యాలు, భావాలు ఏర్పడుతాయి.

అలౌకికంగా కనిపించే ఒకస్వప్నాన్ని తీసుకొని వ్యాఖ్యానిస్తే, భావమనేది లౌకికమో, అలౌకికమో తేలిపోతుంది.

“ఒకామె స్వప్నంలో మూడుసింహాలను చూస్తుంది. అందులో ఒకటి నవ్వుతూవుంటుంది. ఆమెకు భయంమాత్రం కలుగదు. తరువాత ఎందువల్లనో పరుగెత్తి చెట్టెక్కటానికి ప్రయత్నిస్తుంది. అంతకుముందే ఆవిడబావో, లేక జ్ఞాతో ఆచెట్టుకొమ్మల్లో వుంటాడు.”

ఈస్వప్నాన్ని వ్యాఖ్యానిస్తే ఇలా తేలింది. ఆమె ఇంగ్లీషు చదువుకొంటూవుంది. ఇంగ్లీషుపాఠంలో కేసరాలే సింహానికి ఉత్తమమైన అలంకారమని వచ్చింది. ఆమెతండ్రికి సింహపుజూలులాంటిగడ్డముండేది. అందువల్ల కలలో తండ్రి ఒకసింహమయ్యాడు. ఆమెకు ఇంగ్లీషు చెప్పే పంతులమ్మ పేరు లయన్సు. ఇంగ్లీషులో ఈపదానికి సింహమని అర్థం. ఈమెకూడ ఒక స్వప్నసింహమైంది. పంతులమ్మకు పరిచితురాలైన ఒక కవయిత్రి ఆవిడకు Loewe గేయాలు పంపింది. Loewe అంటే సింహం. కవయిత్రి కూడ ఆమెస్వప్నంలో ఒకసింహమైంది. ఇలాంటి సింహాలకు ఎందుకు భయపడాలి? ఈ మానవసింహాల్లో ఒకటి నవ్వటంలో ఆశ్చర్యమేముంటుంది?[26]

కాబట్టి శబ్దాన్ని పట్టి చూచినా, భావాన్ని పట్టి చూచినా కావ్యజగత్తు అలౌకికంకాదు. పైగా కావ్యజగత్తులో కేవలం లౌకికాలైన స్వీయచరిత్రలున్నాయి.

అందువల్ల కావ్యజగత్తు సామాజికజగత్తునుంచి వచ్చినదే కాని అలౌకికమైనది కాదు. అందుకనే గ్రీక్ అలంకారికశేఖరుడైన అరిస్టోటల్ కళ అనేది ప్రకృతియొక్క ‘అనుకరణ’[27] మే నన్నాడు. అభి

---

25. కాళిదాసు స్వప్నంలో ఇష్టావాప్తిచేకూరుతుందని గ్రహించినట్లుంది. అందుకనే ఉత్తరమేఘంలో,
"తస్మిన్కాలే జలద యది సా లబ్ధనిద్రాసుఖా స్యాదన్వాస్యైనాం స్తనితవిముఖో యామమాత్రం సహస్వ,
మాభూదస్యాః ప్రణయిని మయి స్వప్నలబ్ధే కథంచిత్
సద్యఃకణ్ఠచ్యుతభుజలతాగ్రన్థి గాఢోపగూఢమ్."

26. *The Basic Writings of Sigmund Ferud*, p. 435.

27. *Imitation.*

నవగుప్తుడు భరతుని మతాన్ని వ్యాఖ్యానిస్తూ, "నాట్యా త్సముదయరూపా ద్రసః, నాట్య ఏవ రసః, కావ్యేఽపి నాట్యాయమాన ఏవ రసః కావ్యార్థః"[28] అన్నాడు. అద్వైతిఅయిన విశ్వనాథుడు సహితం విభావానుభావాలు లౌకికాలేనన్నాడు. కావ్యానుభూతి, లౌకికానుభూతి ఒకటే; కాకపోతే తరతమభావాలుంటే ఉండవచ్చును అని నియో హెగిలిస్టు (ఆధ్యాత్మికవాదుల్లో ఒక తెగవాడు) అయిన క్రోచేసహితం ఘంటాపథంగా చెప్పాడు.[29]

అరిస్టాటిల్ మరొక విశేషాన్ని చెప్పాడు. సామాజికునికి కని విని గుర్తింపలేని విషయాలవల్ల ఆనందం కలిగిస్తే, ఆ ఆనందం కావ్యజగత్తుకు సంబంధించింది కాదన్నాడు. అంటే కావ్యానుభూతి కేవలం లౌకికానుభూతికి సంబంధించినదిగా ఉండాలి. అనుభూతి అలౌకికమైతే కావ్యానుభూతి కాదన్నమాటే కదా!

[సశేషము]

28. నాట్యశాస్త్రంలోని షష్ఠాధ్యాయంపైని అభినవగుప్తుని వ్యాఖ్య.

29. *Aesthetios.*







# త్యాగరాజు మాటలు

= శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు =

ఈమధ్య ఒకచోట ఒక ప్రసిద్ధగాయకుడు ఉప్పొంగిపోయి గానంచేస్తూ 'బ్రోవసమయమిదే, రామయ్య' అనే మాటలు గల కీర్తన సెలవియ్యడంలో రాగతాళభావాలకి యథాశాస్త్రీయంగా జాగ్రత్తపడి, మాటలుమాత్రం 'బ్రోవసామయర్ – మీదేరామయర్' అని సెలవిచ్చారని ఆప్తులద్వారా తెలిసింది. అల్లాగ్గా, త్యాగరాజుని త్యాగయ్య – త్యాగయ్యర్ అని నేను అనాలా అని ప్రశ్నించుకుంటే, ఆతను వేలాదిగా పాడుకున్న కీర్తనలలో త్యాగరాజు అనే ఉండడంవల్ల అతని పేరు పోనీ అల్లానే ఉంచేద్దాం అని ఉంచేశాను. త్యాగరాజు పరంపదించి ౧౩౦ ఏళ్లు అయినట్టు తెలుస్తుంది. ఆయన తెలుగులో రాసిన కీర్తనలలో ఉండే మాటలమధ్య అపారమైన కర్ణాటగానశాస్త్రం వేంచేసిఉన్నట్టు మొదట కనిపెట్టినవారు తెలుగురానివాళ్లే! ఏమైనా, ఆయన్ని ఎక్కువగా స్మరించేది తెలుగురానివాళ్లే. ఆయనమాటలు జాగ్రత్తచేసినవాళ్లుకూడా, పాపం, తెలుగు బాగా ఎరగనివాళ్లే. వాళ్లందర్నీ తెలుగువాళ్లు నెత్తిమీద పెట్టుగోవాలి. తెలుగువాళ్లకి పేరూ, కడంవాళ్లకి ధనమూ సంపాదించిపెట్టిన మహాభక్తుడు త్యాగరాజు. ఆర్యజీవితపరమావధిని సూచించే మాటలు గల ఆయనకీర్తనలన్నీ పోగుచేయించి, ధ్వంసంచేయకుండా సంస్కరించి, ప్రకటించి, ఇంటింటా, అనుక్షణమూ అతని హృదయద్వారా అతని నోట శ్రావ్యంగా అనిపించినమాటలు స్థిరపడేలాగ చెయ్యడానికి తెలుగు కృషీ, తెలుగుప్రజ్ఞా, తెలుగుసాహసం, తెలుగుధనం, తెలుగుభక్తీ చెన్నేసిపోయి మూలపడి పనికిరాకపోయాయి. ఈసందర్భంలో త్యాగరాజూ, అతని కీర్తనలూ, అతని కీర్తనలు విడిపడే చోటూ, రీతీ గురించి కొద్దిగా అంటాను. ఉన్న బాధ చెప్పుకుంటూన్న సందర్భంలో వారూ వీరూ చెంగొట్టుకోవలసిన అవసరం లేదు. అర్హులైన తెలుగువాళ్లు ఉపేక్షగా ఊరుకోడంవల్ల నే నీముక్కలు ప్రకటించానుగాని, గానంమీదగాని, కీర్తనమీదగాని ఇది ఇదీ అది అదీ అని చెప్పడానికి నాకు ఏవేజు చాలదు. ఇటీవల చెలరేగుతూన్న త్యాగరాజుమాటలగురించిన వాదప్రతివాదం పురస్కరించుకుని తెలుగురానివాళ్లని పట్టుకొని తెలుగుభాషలో తిట్టేయ్యాలనికూడా నాసంకల్పం కాదు. ఎవరేనా దుబాసీలు ఈరచన (అస్మదాదుల రచనకి అల్లాంటి అవాంతరం ఉండదుగాని!) అనువదించుకున్నా నాకు బాధ లేదు. త్యాగరాజుమాటల గురించిన తగాదాలకి సమాధానాలు ఏరామకృపవల్లో త్యాగరాజుమాటల్లోనే ఉన్నాయి. మనకర్మం ఇల్లా ఉంటూంది అనుకుంటున్నానుగాని, ఇంకోర్ని ఏమీ అనటంలేదు. అని లాభమేమిటి? 'ప్రారబ్ధమిట్టుండగ నొరుల ననిబనిలేదు రామ' అన్నాడు త్యాగరాజు.

అఖండమైన మేధాప్రజ్ఞగాని, అపూర్వమైన సృష్టిప్రజ్ఞగాని గల మానవుల్ని వర్తమానకాలంలో ఉండే స్వప్రజలు గుర్తించుకోలేకపోవచ్చు, సరిగదా ఒకవేళ ద్వేషించి, హింసించి, బాధించి, క్షోభకూడా పెట్టవచ్చు. చరిత్రనిండా అల్లాంటి ఉదాహరణలు నేటివరకూ ఉన్నాయి. ప్రజల అసామర్థ్యం, ప్రజల అజ్ఞానం, నూతనత్వంయందు ప్రజల కుండే భయం అందుకు కారణాలు అయిఉండచ్చు. కొండమీద ఉండి కుడీ ఎడమా తెలియకుండా కిందా మీదా మాసుగోకుండా ఉండేవాడికి కొండఔన్నత్యం గమనింపుకి రాకపోవచ్చు. అటువంటి ప్రజ్ఞావంతుడి జీవితం వాడిపట్ల నరకప్రాయంగా ఉండవచ్చు. బతికున్నన్నాళ్లూ వాణ్ణి ప్రజలు కొల్చుకుతిని, వాడు కాలాతీతమైన తన కృతి సృష్టించడంలో పడే శ్రమకి మరోసమిధె తగిలిస్తాండి, తీరా వాడు బతకలేక చచ్చిపోయింతరవాత వాడికి తద్దినాలు పెట్టడానికి ఎగబడతారు. అంటే, అటువంటి ప్రజ్ఞ గలవాడు బతికున్న కాలంఅంతా చచ్చినట్టుండి, చావడంతోటే బతకడం మొదలుపెడతాడు. వాడు బతికున్నప్పుడు ఎంతెంతి శ్రమపడి, ఎన్నెన్ని గంటలు ఎక్కడెక్కడి సంగతులు

ఎల్లాఎల్లా సేకరించి శరీరపోషణ ఎల్లాఎల్లా నిర్లక్ష్యం చేసి, తన మెప్పుగురించి కళ్లల్లో నిప్పులోసుకునేవాళ్ల నించి తప్పుకుంటూ, తన కృతి సాగించుకునే నిమిత్తమే తన సర్వస్వం ఏ రీతిగా ధారపోస్తాడో చూడక, వినక, అర్థంచేసుకోక, నమ్మక, క్షమించక, ఊరుకోక ఊరేట్టుగాని, వాడు గతించగానే వాడికి తేజస్సూ, వర్చస్సూ, మాహాత్మ్యం, దివ్యత్వం ఇవన్నీ తెచ్చి కట్టబెట్టి, వాణ్ణి బహువచనంలో సంబోధించి, దేవతల్లో జమకట్టి, శుద్ధ అబద్ధాలతో కూడిన కట్టుకథలు కల్పించి, అవి నమ్మనివాళ్లకి కళ్లోతాయని శపించి ఆ ప్రజ్ఞావంతుడి ప్రజ్ఞ అంతా సహజప్రజ్ఞే అనీ, అందులో శిక్షితప్రజ్ఞ రవంతైనా లేనేలేదనీ, ఒకనాటి పాయింత్రిందాకా వాడు సుద్దువాలకంగా శిలబండలా ఉంటూంటే, ఆ రాత్రి పరమాత్ముడికి (ఇతరపనిలేక) వాడిమీద దయకలిగి, వాణ్ణి "నాలిక ఇల్లా పట్టరా, గాత్రం ఎదీ ఇల్లా తే, చెయ్యొయ్యామాటియ్యి" అన్నట్టు వ్యవహరించి, వాడికి పీలునుబట్టి అఖండకవిత్వమో, అపారగానమో, అమోఘచిత్రకళో దఖలుపరచి చక్కా పోతాడని జనం రొట్టలేస్తూ కళ్లు తెరిచి చెప్పుకుని చప్పరిస్తారు. ఇది లోకంలోమాట. ఇక తెలుగువాళ్లల్లో ఆ మాత్రంకూడా దొరకడం ఉండదు. అందులో త్యాగరాజు అచ్చతెలుగుసీమదాటిన తెలుగువాడు. అది తెలుగువాళ్లకి మరీ మంచిది. ఒకడి కమామీషు తగ్గినా తగ్గటమే. సరి, ఇప్పుడెక్కడికొచ్చాం? మా త్యాగరాజు పోయిన తేదీలగాయతు అతణ్ణి మీరే పెంచి పెద్దవాణ్ణి చేశారుగదా, చివరదాకా మీరే మాట దక్కించుకోపోతే ఎల్లా ఏడుస్తుంది మరీ — అని ఇతరుల్ని ప్రాధేయపడవలసిన స్థితి తెలుగుదేశానికి వచ్చింది. త్యాగరాజు ఈమాత్రం గ్రహించుకోలేదా అన్నట్టు, "లోకుల్ని నెరనమ్మలేదు. కొందరికి అసూయ, కొందరు పీడింతపోమా అంటారు, పీడు సముఖానికి యోగ్యుడు కాడంటారు. నన్ను రక్షించేవాళ్లు గారు వీళ్లా అని నిన్నే కోరి నీవే గతియని రేయీ పొగలూ చెయ్యివేలమొరలు పెట్టుకున్నానాపైని ఎందుకో నీమనసు కరగదు!" అని దేవుడితో చెప్పుకున్నాడు.

సర్వకర్మఫలత్యాగి గనక త్యాగరాజు సార్థకనాముడు. పరమాత్ముణ్ణి ఏదైనా వరం కోరుకుందాం అంటే భక్తులంతా తలోపాఖ్యం ఆయనదగ్గిర్నించి పూర్వమే పట్టుకుపోయారు, ఏమీ మిగలలేదన్నాడు. ప్రకృతిపురుషరహస్యవేదిగనక అతడు 'ధరణితనయకున్న ప్రేమరసము త్యాగరాజుకీయన్న' అని అడిగాడు. నీభక్తికి మెచ్చి పరమాత్మ డిచ్చిం దేమిటో మాకు మాపెట్టవలిసిందని ఎవరేనా నిన్నడుగుతారు గనక వాళ్లకి చూపించేనిమిత్తం ఏమైనా గట్టిది కోరుకో అని పరమాత్ముడు సెల్లించినా, జన్మాంతరంలో కూడా పరమాత్మకటాక్షంతప్ప అన్యం అవసరం లేదని అతడు ప్రహ్లాదుడి ముఖతా అనిపించాడు. 'భక్తుని చారిత్రము' అకడే నిర్వచించాడు. 'మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు' అన్న మాటలున్నూ, 'తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః' అనేవిన్నీ ఆచరిస్తూ, 'పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయార్హసి' వంటి భావం పరమాత్మకి తనయందు ఉంటుందని నమ్మి, 'శ్రీరాజన్యమతము తప్ప అన్యమతము లెరుగక', 'అనన్యా శ్చింతయంతః' అయి, అనునిత్యం వ్యవహరించినవాళ్లల్లో త్యాగరాజు అగ్రగణ్యుడు. అతని వ్యాపారం యావత్తూ హృదయపూర్వకం. మనస్సు, అంతరంగం, ఆత్మ అనే పదాలు కాక 'హృదయం' అనే మాటతో అతని సత్యాన్ని అతడు పరిపోషించాడు. ఆజన్మం పరమాత్ముణ్ణి తన హృదయరాజీవంతో పూజించాడు. వెన్నవంటి దవడం చేత అతని హృదయంమీద ప్రతీ బాహ్యసంఘటనా ఒకనొక్క నొక్కింది, ప్రతినొక్కూ ఒక కీర్తనగా పాకింది. ఒక హృదయశోకం సకలమానవహృదయశోకంగా చూపెట్టగల మాటలు అతడు ఆనేశాడు. తన తల్లిదండ్రులుతప్ప తక్కినవారంతా తన్ని హింసించారన్నాడు. తాను తిరగవలసిన తిరుపళ్లన్నీ తిరిగి దుడుకుపనులన్నీ చేశానన్నాడు. తనకి మాత్సర్యం లేకుండా చెయ్యమని ప్రార్థించాడు. తన్ని చూసి నవ్వి లేలికచేశారనీ, చౌకగా చూస్తూంటే ఎన్నాళ్లు సేగవనీ, అందరిచేతా తన బ్రతుకు నిందలపాలైందనీ, తను హరిదాసరహితపురంలో పడిపోయాననీ, ఎదటిపచ్చ జూడలేక హితవుమాటలాడే జనులన్నారనీ, కరుణలేక తనమీద నేరం లెంచారనీ,

అమాయాపరులు పెట్టిన బాధలు తరముగాక పరమాత్ముడి శరణు జొచ్చాననీ, తను గాసిపడ్డ పరదేశిననీ, ఏదారిపోయినా అడ్డదిడ్డపువాదాలాడతారనీ, ఎంత నేరిస్తేంగనక అనృతాలే ఊరేసుకుంటాయనీ అన్నాడు. ఈమాటల్లో ఉండే అర్థం తెలియపరిచేది అతని ఆధ్యాత్మిక బాధమాత్రమే అనుకోడం హృదయంలేని మాట. అతడు హృదయం లేనంత పండితుడు కాడే! ఎంత వంచన అయితేం, తను అనాథుణ్ణి కా నన్నాడు. ప్రీతిచేత నామం పొందానన్నాడు. తనువు దేవాలయం అన్నాడు. భక్తిలేని మనిషి శవం అన్నాడు. తను పరహితమే భావించానన్నాడు. భక్తి పెంచుకోడానికి సంసారంలో ఉండవచ్చు, భరవాలేదు అన్నాడు. పరమాత్ముడే తన ఆధారం, గమ్యం, శృంగారం, వైరాగ్యం, వినోదం, సమస్తం అన్నాడు. తాను 'చదివినవాడనుగాను' అని చెబుతూనే, కనికరమున - జనకజామాత - ఈసుజనుల అనే చోట్ల శ్లేషిస్తూనే, సకలవిద్యల సారమూ మామూలు తెలుసుమాటల్లో వాటి కర్తవ్యమైన గానగమనంతో అవేస్తూనే, హృదయసన్నిహితమైన దేవభావంలోకూడా పాడేవాడు. త్రిపురసుందరిగురించిన అతని సార్థకవర్ణన గమనించి సౌందర్యాన్ని వర్ణించడం నేర్చుకోవాలి. అతను ఆగమాల్ని మథించి బహు బానులేని భావాల చాలించానన్నాడు. తోపికవల్ల భేదంగాని చైతన్యం ఒకటే అన్నాడు. అధమ దేవుళ్లని పంపించేశా నన్నాడు. భూమిమీద గాను గద్దుమతాంతరాలు ఏర్పడ్డానికి కారణభూతులైన పురాణదేవుళ్ల మాహాత్మ్యాలన్నీ పోసచేసి ఒకచోట పేర్చి తన పరమాత్ముణ్ణి తను తయారుచేసుకున్నాడు. దేవుడు తన హృదయంలో ఉండి త్యాగరాజుచేత నుతింపబడుతున్నా డన్నాడుగాని, అతడికి ఒకే పేరంటూ పెట్టి అతడికి సంకుచితత్వం ఆపాదించలేకపోయాడు. త్యాగరాజు ఆత్మవైశాల్యం గుర్తించడానికి ఈ ఒక్క విషయం చాలు. తను తరుచు వాడిన 'రామ' శబ్దానికి అద్వితీయమైన వ్యుత్పత్తి ఇచ్చాడు. తన హృద్భావమునకు సగుణనిర్గుణరూపాల్లో నిండి ఉన్న పరమాత్ముడని వర్ణించాడు. త్యాగరాజు విశ్వరూప హృదయాన్ని ముట్టుకుని ఇంద్రియములన్నింటితో అనుభవించాడు. మతభేదం అనే మంట పెట్టుకోవద్దన్నాడు. ధనాధికారగౌరవాలకి నమస్కరించి దూరంఅయాడు. కలినరులకి మహిమలు తెలిపి లాభం లేదు, ఎద్దుకేం తెలుస్తుంది అటుకులరుచి, కామశాస్త్రవిదులకి బహుమతు లిస్తారు, భక్తిశాస్త్రవిదుల్ని చూసి నవ్వుతారు, అయినాసరే, రామనామం స్వర్గాది సుఖాలకంటె పైమాట అన్నాడు. మెప్పులకై కొప్పులుగల జనం చేసేది భజనకాదన్నాడు. ఎదలో ఎంచేది ఒకటీ, పయ్యెదమీద మరొకటీకనిపించే సందర్భం భజన కాదన్నాడు. ప్రణవదాహంలేని కొందరు వరరాగలయజ్ఞులం తామే అని వదరుతూండే మాటలు కోతలన్నాడు. గానం సామవేదజనకం అన్నాడు. ప్రణవనాదం ఏడు స్వరాలుగా అయిందన్నాడు. సంగీతంలో రాగతాళరక్తులే కాకుండా జ్ఞానప్రేమభక్తులుకూడా ఉండా లన్నాడు. పరమాత్ముడు ఇంగితమెరిగిన సంగీతలోలు డన్నాడు. నాదసుధారసం నరాకృతిగా కోదండరాము డయా డన్నాడు. స్వరాలు సుందరు లన్నాడు. రంజింపజేసే అనంత రాగాలు మంజుళంగా అవతరించేటట్లు గానోపాసన చెయ్యమన్నాడు. నాదోపాసనచేత వేదమంత్రయంత్రతంత్రోక్తులు పుట్టా రన్నాడు. నాదంలోంచి సంగీతమే కాకుండా వేదశాస్త్ర పురాణాదులుకూడా ఏర్పడ్డాయని మరిచిపోవద్దని ఘోషించాడు. వేదసారమై తనకి తారకంగా ఉండే శతరాగరత్నమాలిక చేశానన్నాడు. రామకథతో కూడిన సంగీతంవల్ల న్యాయాన్యాయవివక్షతేకాదు, జగన్మిథ్యాత్వం సంగతే కాదు, నిర్గుణపరమాత్మయందు విశ్వాసమేకాదు, వాత్సల్యం, ప్రేమ, నియమం, నిష్ఠ, యశం, ఈశ్వరకటాక్షం కలుగుతా యన్నాడు. పదం పరమాత్ముడిమీదకానిది పాడి యేమి, పాడక యేమి అన్నాడు. జ్ఞానసారం, గానమాధుర్యం జోడించి సకలమానవహృదయం యొక్క ఎరుకగలవాడు మహానుభావు డన్నాడు. నాదసుధలో నామశర్కర కలుపుకుని తినడం శివు డెరుగు నన్నాడు. రాగసుధారసం తాగితే యాగ,యోగ, త్యాగ, భోగఫలం ఉందన్నాడు. సంగీతజ్ఞానం ధాత వ్రాయవలె అన్నాడు. కోటీ నదుల్ని దర్శించి సాటిలేని తన పల్కుబోటి నిచ్చి

వారిని వేడుకోడం ముమ్మాటికీ చెయ్యనని, సరిగ్గా పోతరాజులాగే అన్నాడు. తెలిసి, తలపు నిలిపి, చింతనతో కీర్తన చెయ్యమన్నాడు. చేసేవాడు తెలుసుకోవలసింది వాక్యార్థమే కాదు, పదాల అర్థమే కాదు, భావంకూడాను అని చెప్పడానికి రామా, అర్క, అజ శబ్దాలు చూపించాడు. తన సౌఖ్యము తానెరుగక ఒరులకు బోధన సుఖమా అన్నాడు. 'తత్వమసి'కి అర్థం చెయ్యడం తన్నుకున్నా తరం కాదన్నాడు. శాస్త్రవాదతర్కం చూసి భయంవేసి ముక్తిమానుకున్నా నన్నాడు. పరమాత్ముణ్ణి వాదవేదిక మీదికి ఎక్కించి, నామకుసుమాలతో పూజించా నన్నాడు. భక్తిరహితశాస్త్రవిదులకి పరమాత్ముడు దూరం అన్నాడు. భక్తిలేని శ్రేమకవిత్వం జనానికి తెలియచుకనక భుక్తి ముక్తీకూడా ఉంటాయని కీర్తనలు రాశా నన్నాడు. పరమాత్ముడికి సగుణత్వం ఆరోపణ చెయ్యడానికి తోడ్పడే తన మాటలు పరాయిమాటలవడంచేత గ్రహింపబడక ఆమాటలకి జోడింపుగా పరమాత్మకి నిర్గుణత్వం ఆరోపణ చెయ్యడానికి దోహదం చేసేనిమిత్తం తను స్వరార్ణవంలో మునిగి తెచ్చిన అపాతమధురస్వరాలు అసూయాది కారణాలవల్ల మన్నింపబడక ఉండే ఆవరణలో ఉభయత్రా తనకి అన్యాయమే జరగడంవల్లనున్నూ, సత్యసర్వాధారమైన తన సృష్టిప్రజ్ఞలో తనకి పూర్ణవిశ్వాసం ఉండడంవల్లనున్నూ, 'కాలము బోను మాటనిలుచును' అని అతనికి ముంజూపు ఉండడంవల్లనున్నూ, అతడు శోకము దక్క, శాంతము దెచ్చుకొని, జగత్సాక్షితో పెట్టుకున్న మొరలు అతని కీర్తనలు. ప్రహ్లాదభక్తవిజయం ఆయనది కాదేమో అనుకోడం చాలా ప్రమాదం. అది అన్యుడివల్ల కానిది. అది అతని 'కరుణ యేలాగనిన' అనే సూత్రానికి దృష్టాంతం. తోపికవల్ల వేరై కనిపించే జీవాత్మ పరితపించి పరమాత్మతో 'అతడితడని లేక ఆకారయుగము సతము నొకటిగా' అయిపోడం. 'త్యాగరాజనుత' అంటూ చివర రానిచ్చి ఎవడైనా ఇంకోడు కీర్తనలు రాసేశాడేమో అని ముందే భయపడక్కర్లేదు, ప్రత్యేకవ్యక్తికి వచ్చునివి ఆ ఛాపకింద జమకట్టేవెయ్యకూడదు. ఎందుచేతంటే, కీర్తన మజాకా కాదుగా! పోల్చుకోవచ్చుగా!

దానికి ఎన్ని బిగింపు లుంటాయి? గురువుకి గురువూ లఘువుకి లఘువూ దింపి 'బహార్ బహార్ వాలె' అంటూ నెత్తిమీద రాస్తే తరారరయే కొత్తకీర్తన ఆ కాపీదారు తలకాయలాగే ఉంటుందికాని, హృదయం ఎక్కణ్ణుంచి వస్తుంది!! ఇక అతని నాకాయాత్ర మానవజీవితయాత్ర. బాల్యంయొక్క ఆనందోత్సవాలూ, యవ్వనంలో ఉండే లావణ్యమదగర్వాలూ, సాగిపోతుండగా అకాత్తుగా కష్టాలూ ఒడుదుడుకులూ బాధలూ దుఃఖాలూ వచ్చిపడి జీవుణ్ణి నిరాశలో పడెయ్యడం, నిరాశ ఎక్కువవడం, ఇక పుట్టిమునిగిపోతుందేమో అన్నప్పుడు జీవుడు 'మహాప్రభో, పరమాత్మా, మరి దిక్కులేదు' అని పెద్దవిడిచి వేడడం, అతడు రక్షించడం. ఈ రచనలకి నూరేళ్లు నిండవచ్చినా, వీటిల్లో మాటలన్నీ ఆదరణ సంస్కారాలు లేక చిక్కిన కామధేనువుల్లాగ అల్లానే ఉన్నాయిగాని, ఈ మాటల్లో తస్కేవిగాని, కమ్మేవిగాని, పట్టిపోయినవిగాని, మృతించినవిగాని లేవు. ఇక స్వరసముద్రంలోంచి అతడు తెచ్చిన రాగాలు రెండుమూడువందలు అందాం. వీట్లని ఎన్నుకోడంలో ఉండే విశిష్టత గాయకులు చెబుతారు. అతని భక్తి, అతని బాధా, అతని భావం, అతని భాషా, అతని మతం, అతని నిష్కామత్వం, అతని తత్త్వం, అతని హృదయం అతని మాటల్లో ఉంది. ఇందుకోసం కాదు త్యాగరాజుని అనవలిసిందీ వినవలిసిందీనూ. అతను వేసిన రాగాల ప్రకారం ఈ మాటల అక్షరాల సందున నక్కి ఉండగా ఈ మాటలతో జోక్యంలేనివాళ్ళు కనిపెట్టగలిగిన అద్వితీయ కర్ణాటగానశాస్త్ర వ్యాయామం కోసమే అని తెలుగుజనం అనుకోడం ధర్మంకాదు. అల్లా అనుకున్నవారికి సాష్టాంగనమస్కారం.

మాట ఒక్కటే మానవుల్ని ఆకర్షింపగలిగింది లగాయతు కవనం ప్రత్యేకకళ అయింది. యంత్రగానం విడిగా ఒక్కటే మానవుల్ని చేరదీసికూచోబెట్టగలిగింది లగాయతు గానం (అనగా పదాలతో నిమిత్తం లేని నాదం) ఒక ప్రత్యేకకళగా ఏర్పడింది. కవిత్వగానాలు వేర్వేరు కళలు. ఒకదానిపని ఒకోటి చెయ్యలేకపోడంవల్లే రెండు సిద్ధించడం. కవిత్వం పదమైత్రివల్ల ఉద్భవించే అర్థభావరసాలవల్ల బుద్ధిద్వారా

ఆత్మకి ఆనందం ఇవ్వాలి (ఎవరి కవిత్వం అంటే మరి తగాదాలే గనక, ఆదర్శకవిత్వం అన్నమాట). అల్లాగే గానం స్వరమైత్రివల్ల కలిగే రసాన్ని హృదయంద్వారా ఆత్మకి చేర్చాలి (అందుకనే గానానందం పొందలేనివాణ్ణి హృదయశూన్యు డనడం). వృత్తాంతం ఏమిటో తెలిపి కవిత్వం మనస్సుని రంజింపజేస్తే, వృత్తాంతంతో నిమిత్తంలేకుండానే గానం హృదయాల్ని హరిస్తుంది. అయితే, కవిత్వగానాలు రెండూ నాదజనకాలే. స్వరప్రమేయం ముఖ్యంగా పెట్టుకుని నాదం గానం అయి, అర్థప్రమేయం ముఖ్యంగా పెట్టుకుని కవిత్వం అవుతుంది. అందువల్లే కొందరు 'గానం అంటే స్వరకవిత్వం, కవిత్వం అంటే పదగానం' అంటారు. అటువంటప్పుడు ప్రతీనాదమూ గానమా (గార్దభస్వరందగ్గిర్నించి), ప్రతీపదమూ కవిత్వమా (తిట్టుదేశీలూ) అనే సంశయం రావచ్చు. ఈకళలప్రారంభంలో అల్లాగే అయి ఉండవచ్చు. కాని కాలక్రమాన్ని మానవుడికి పుట్టుకతోనే పుట్టిన విమర్శశక్తీ, పెరగడంలో అవసరమయే ఆవరణప్రభావమూ తోడై ఇది చక్కటినాదం - ఇది కఠోరనాదం, ఇది తియ్యని పలుకూ – ఇది వెగటు మాటా అంటూ భేదాలు బయల్దేరి ఉంటాయి. హృదయంగల సభ్యజనాన్ని ఆకర్షించి ఐక్యంచేసినకొద్దీ ఎక్కువ కళ. కవిత్వగానాలు రెండూ నాదజనకాలే గనక. ఈరెండింటినీ కలిపి, రెండింటి మాహాత్మ్యాలూ కూర్చి, రెండూ ఏయేచోట్ల తారసిల్లగలవో చూసి (అందులో ఒకటి సాకారం, రెండోది నిరాకారం), ఒకదానివల్ల రెండోది చెడడంగాని, చచ్చిపోడం గాని జరక్కుండా రెండింటి స్వత్వాల సరించీ జాగ్రత్తపడి, ఉభయతారకంగా ఉండేలాగ చెయ్యవచ్చును. అప్పుడు బయల్దేరే రచనే కీర్తన. కవిత్వగానాలు అనుకూలదాంపత్యంతో మేళవించిన రంగమే కీర్తన. కీర్తన అన్నప్పుడు బయల్దేరే ఆనందం అందులో పదాలవల్ల కలిగే అర్థభావరసాలమూలాన్ని మాత్రమే అనుకోకూడదు, అవి ఏరాగంలో ఉచ్చారణ అవుతున్నాయో ఆరాగంయొక్క తానమూర్ఛనాదులమూలాన్నిమాత్రమే అనుకోకూడదు, తాళం వ్యక్తపరిచే అవస్థమూలాన్ని మాత్రమే కాదు. వీటి యోగము కీర్తన. కీర్తనలో పదం, రాగం, తాళం ఉంటాయి. పదాలు (ఏ ఒకభావమూసినా)బహుళం, రాగాలు అనంతం, తాళాలు విస్తారం. కీర్తనకారుడు అర్థంగల పదాలూ, శ్రావ్యతగల స్వరాలూ, అవస్థ ప్రతిఫలించే తాళమూ, మూడు వేర్వేరుప్రపంచాల్లోవి తన హృదయానుభవంవల్ల గాలించి, కలిపినప్పుడు నీళ్లకి నీళ్లూ ప్రసాదానికి ప్రసాదమూగా ఉండిపోకుండా అతుక్కుని ఒకటైపోయేవి ఎన్నుకుని రచించాలి. అనగా, కీర్తనలో ఆలపిస్తూండే రాగం కీర్తనమాటల్లో ఉండే మహోత్కృష్టమైన అర్థాన్ని పెంపొందించి, వాక్కుకి అసాధ్యమైన పని చేస్తూన్నట్టు స్ఫురించాలి. అంటే, కేవలనాదమైన ఆస్వరాలుకూడా అర్థంఅవుతూన్నట్టు శ్రోతకి అనిపించాలి. జోడించిన రాగంలోని సంగతులు పదాల్లో ఉండే అర్థాన్ని ఛాయపరిచి, నచ్చచెప్పి, హృదయకుహరాల్లో స్థిరపరచాలి. కీర్తనమాటల్లో ఉండే అర్థాన్ని వెల్లడించకుండాగాని, ద్యోతకం ఎల్లా అవుతుందో చూస్తాగా అన్నట్టుగాని, ఎక్కడ తెలిసిపోతుందోకదా భగవంతుడా అన్నట్టుగాని, నిత్యకృత్యంలో ఆ మాటలు వ్యవహరించే జనం అర్థద్యోతకంనిమిత్తం చేసే ఉచ్చారణకి భిన్నంగా వ్యవహరించిగాని, ఇవన్నీకాక ఆమాటల అర్థానికి కేవలం చుక్కెదురుగా ఉండే అర్థాన్ని స్ఫురింపజేసే టట్టుగాని రాగాలుతీసేవాడు రసజ్ఞుడు అని చెప్పలేం. అటువంటివాడు శుద్ధగానం గాత్రంతో చెయ్యడం మంచిదిగాని మాటల్తో జోక్యం కలగజేసుకోకూడదు, అసలు నోరు మెదపవలసిన అవసరం తెచ్చుకోకూడదు. మనస్సుయొక్క అవస్థ యావత్తూ నడకనిబట్టి తెలుస్తుంది గనక కీర్తనమాటల అర్థం సార్థకం అయే నిమిత్తమే తాళం గమనించాలి. అర్థం నిలబెట్టే మార్గం చూసుకోవాలిగాని, నన్నెంజెయ్యమన్నావ్ అనకూడదు. కీర్తనమాటల్లో అంతర్వాహినిగా ఉండే మానసికావస్థగురించి స్పృహలేకుండా, టపాకాయలూ బాంబులూ పేల్చినట్టు తాళంకొట్టినంతమాత్రాన్ని కీర్తన ప్రతిష్ఠ మిన్నుముట్టదు. మళ్లీమళ్లీ అన్నప్పుడు వాటివల్ల బోధపడే జీవితప్రమేయం మరీమరీ హృదయగర్భంలో ప్రవేశించి కలచడానికి వీలైన పదాలు కలిగి ఉన్నప్పుడే కీర్తన నిలుస్తుంది. బతికున్నవాడు బతి

ఉన్నవాడి నిమిత్తం సేరుగా అనవలసిన మాటల్తో కూడిఉండవలసింది గనక, కీర్తన అనేది పాండిత్య ప్రకర్షకోసం ఎంతమాత్రం సృష్టించకూడదు — సరిగదా దాని భాష సంభాషణభాషనించి అట్టే దూరంగాకూడా ఉండకూడదు. గానం ఒక అపరిచిత ప్రపంచం; చీకటికోణం. దానికి శాస్త్రం రచించడం స్వర్గానికి మెట్లుకట్టడం. అందులో ఉండే రాగాల్ని నియమించి వాటితో పరిచయం కలిగిఉండడం భగవంతుడితో చెలిమి. అటువంటి రాగాలు అసంఖ్యాకంగా తెలిసి, వాటిని ప్రత్యేకంగా ఆనందించి, వాటితో ప్రత్యేకంగా ఇతరుల్ని ఆనందపరిచి, వాటికి యథాతథంగా శాశ్వతరూపం ఇవ్వడం అసంభవం గనక, ఆ స్వాదునాదం తనలో పుట్టినప్పటి అవస్థకి అనుగుణంగా ఉండే తాళం చెప్పి, వృత్తాంతానికి అనుగుణంగా మాటలు చెప్పి తానమభవించిన హృదయానందంవంటిది సాటిమానవులకికూడా కలిగించాలనే సదుద్దేశంతో కీర్తనరూపంలో సృష్టి చెయ్యగలగడం మోక్షం సాధిస్తుం దనడంలో ఆశ్చర్యంలేదు. జ్ఞానభక్తుల కలయికవల్ల ఏర్పడ్డ కర్మనే కీర్తన అనవచ్చును. త్యాగరాజుని 'నాదసుధారసంయొక్క నరాకృతి' అనవచ్చును. దరిదాపులేని గానంయొక్క (గానశాస్త్రంయొక్క కాదు) జాలిచూసి (జాలి, కనికరము, అంగలార్పువంటి మాటలు త్యాగరాజు శోకార్థంలో అంటాడు) భగవంతుడు త్యాగరాజుకి జన్మ ఇచ్చాడు. సంఘం తమరికి సాయం చెయ్యకపోడం అటుంచి హింసించినాసరే హృదయంగల ప్రతిభావంతుడు లోకహితమైన శాశ్వతకృతులే చేయిచ్చి ఎల్లప్పుడూ జీవించే ఉంటాడని ఋజువుఇచ్చేనిమిత్తం ప్రకృతి బయల్దేరి తెలుగువాళ్లకి ఓ వేమరాజునీ, ఓ పోతరాజునీ ప్రసాదించినట్టే ఓ త్యాగరాజుని ప్రసాదించింది.

హృదయపూర్వకరచనలో రచయితయొక్క వ్యక్తిత్వమేకాక రచయితయొక్క జాతికూడా ప్రతిబింబిస్తుంది. తెలుగుకవిత్వం, తెలుగుశిల్పం, తెలుగు చిత్రరచన అంటే బాగానే ఉంది. కాని, తెలుగుగానం అనేది చిక్కుమాట, అల్లా అనకపోడం మంచిదన్నారు. అవస్తవే లేనప్పుడు అమా టెందుకని! తెలుగులోగానంపేరు కర్ణాటగానం. త్యాగరాజు తెలుగుమాటల సందువ కర్ణాటగానం పీకంపేసుకుని కూర్చుంది! ఆంధ్రులూ, ఆంధ్రేతరులూకూడా ఒకే తెలుగుపాట పాడుతూ, ఆపాటలో మాటల్ని కూడబలుక్కున్నట్టు వాటాలప్రకారం యథాశక్తిగా సంధులు విరగ్గొట్టి ఏది గానమో తెలుసుగోలేని అంధజనం ఎదట పారేస్తూ, వాట్లకి కొండొకచో జోడింపబడుతూండే అనర్థపు స్వరసామగ్రి ఎవరిమట్టుకు వారు తమరిదే అనుకోడం గొప్పమజాగానం! అప్పుడు బయల్దేరే వాదం కర్ణాటగానం అనడం మరీ తమాషాకళాయి! ప్రతీ ఆంధ్రేతరుడూ చెయ్యగల కవిత్వాన్ని ఆంధ్ర కవిత్వం అనం. ఆంధ్రకవిత్వం అంటే ఆంధ్రజాతి యొక్క ప్రత్యేకజాతిలక్షణాలు సూచించేది. కాని, ప్రతీ ఆంధ్రేతరుడూ తెలుగుమాటల తొడకగా పెట్టుకుని చెయ్యగల గానంమాత్రం ఆంధ్రగానమే అనుకోవాలిట. కాదుట, ప్రతీ ఆంధ్రేతరుడూ తెలుగుమాటలు పుచ్చుకుని చేసిన గానమే అసలైన సిసలు కర్ణాట గానం అని దెబ్బలాటకొచ్చే ఆంధ్రులున్నారు. తెలుగు మాటలు అయినకాడికి దొరకపుచ్చుకుని అందులో హిందూస్తానీ సంగతులు వేసినా, అదికూడా ఆ తెలుగు మాటల గర్భంలోంచి పుట్టే ఆంధ్ర (కాదు, కర్ణాట) గానమేట. తెలుగుమాటలు పుచ్చుకుని వాటిల్లో ఇంగ్లీషు గానసంగతులు రంగరించి పాడినా అదికూడా తెలుగుమాటల్లోంచి ఉద్భవించిన కర్ణాటగానం అవుతుందేమో, కాదో, అన్నారు కొందరు. తెలుగువాళ్ల గానం అంటే తెలుగుమాటలకి జోడించిన అడ్డమైన నాదకోలాహలవిశేషాలూనా, లేక జాతికిమాత్రమే చెంది, తెలుగువాళ్ల ప్రత్యేకసంప్రదాయం (అసలు ఉంటే మాటే!) తెలిపే నాదాలసంపుటియా ? చాలామంది ఉద్దేశప్రకారం, తెలుగువాళ్ల గానం అంటే తెలుగుమాటల మధ్య దాగుడుముచ్చీలాడుతూ ఆమాటల్ని కొత్తవాళ్లకి బోధపడకుండా, పాతవాళ్లకి బాధకలిగించే నేర్పుతో, గాత్రప్రజ్ఞావిశేషాలు గల ధూనరు దెవడైనా సరే చేసేటటువంటి చప్పుడు సరంజాం అని. పాటకచేరీలసేవాటిల్లో ఇల్లానే తేల్తుంది. అక్కడ బయల్దేరే సందేహాలు కొన్ని ఇస్తాను:

పాటకచేరీల్లో కొందరు పాడడానికి వంద పుచ్చుకుంటే, పాడుతూన్న పాట పదివారు మానెయ్యమన్న

ప్పుడు మానడానికి మరోయాత్రై పుచ్చుకుంటారట! పాటకచేరీల్లో త్యాగరాజునిష్కామభక్తికి చోటు లేదుగనక, త్యాగరాజుకీర్తన పాడడం మంచిదా, మహాభోగరాజు జావళీలు పాడడం మంచిదా? పాటకచేరీలు గానశాస్త్రపండితులకా, మామూలుగా బతుకున్న ఆంధ్రజనులకా? తెనుగుశిసువుల్నీ, పసువుల్నీ కూడా ఆకర్షించవలసిన కర్ణాటగానం మనుష్యుల్ని అక్కణ్ణించి తరిమేసేరకంగా ఉంటూన్నప్పుడు, నిర్వహించేవాళ్లు మనుష్యులా పసువులా అనే ప్రశ్నకి ఎడంలేదుగనక, అది గానమా, లేకపోతే గోలామా క్రగపిడిరణగొణధ్వనా? పాటకచేరీకి వెళ్లి నాదసౌఖ్యం అనుభవించడానికి మనిషి ఒకటికి ఎన్నివేల రకాల పరిగములు కంఠతా పట్టాలి? బతుకున్న జనంతో కూడిన సభయెదట పాడే గాయకుడు తను చిన్నప్పణ్ణించీ నేర్చుగున్న గానశాస్త్రసంగతులూ, వాటి ప్రస్తారాలతో జనించే పిల్లిమంత్రపు పేచీలూ తెచ్చి యథాక్రమంలో సభనెత్తిమీద వడ్డించి శ్రోతల్లో గానాభిరుచి లేదనుకోడం న్యాయమా? గానం గాత్రానికి సంబంధించిందా, మాట్లాడే దినుసా? మరికొందరు గాత్రం ఎక్కడో పారేసివచ్చి పెదిమల్తో చాలా గానం మాట్లాడి కోపంగా చక్కాపోతారేం? కీర్తనమాటలకి అర్థం తెలియకపోయినా పాడేవాడు హృదయగానం వినిపిస్తున్నాడు అనుకునే తెలుగువాడికి హృదయం ఉందా? పాటకచేరీల్లో మద్దెలవాడికీ పాడేవాడికీ దారుణవైరం అవడంచేత ఒకడు గొర్రెపొట్టేలులాగు రెండోవాడికేసి చూస్తూన్నప్పుడు, ఆ రెండోవాడు కోడిపుంజులాగ మొదటివాడికేసి చూస్తూన్నప్పుడు, జనం వెళ్లి వాళ్లని విడదియ్యడం న్యాయం అవునా కాదా? లేకపోతే అంతపనీ చూస్తూ ఊరుకోడం మంచిదా, గానం వినాలిగనక కళ్లు మూసుగోడం మంచిదా, అప్పుడు తలకూడా వంచుగుంటే తప్పా? మద్దెలపనివాడికి ఛాన్సు ఇచ్చినప్పుడు ప్రాణం బిగపెట్టుకుని పావుగంట విని వాడు పూర్తిచెయ్యగానే ఒకప్పుడూ, పొరపాట్న కాస్తముందే ఒకప్పుడూ చప్పట్లుకొట్టడం ఎందుకు అని అడగ్గా 'అయిపోయిందిగనక, అమ్మయ్య' అని ఒక పామరుడు సమాధానం చెప్పినమీదట కర్ణాటగానశాస్త్రి దుఃఖించడం అవసరమా? త్యాగరాజుకీర్తన పాడినప్పుడు 'త్యాగరాజు' అనేమాట చివరకి వినిపించగానే చాలామంది 'హాహా' అంటారు, ఏమని ఒకర్ని అడగ్గా! అన్నిమాటలు ఆ పాడేఅబ్బి రెట్టించిరెట్టించి నోటితో అనేసినా, నొక్కిపెట్టినట్టు ఒక్కముక్కైనా తెలియలేదు, అతని ధర్మమా అని ఆ 'త్యాగరాజు' అనే మాటమాత్రం బోధపడింది, ఆపళంగా 'హా' అన్నాను-అన్నారు. ఇంకోఆయన: నేనూ అప్పుడు 'హా' అన్నాను. త్యాగరాజు తన కర్మంవల్ల పాడుకున్నపాటల్లో ఉండే మాటలు పట్టుగొచ్చి, ఆపాడేఆసామీ బాగా పచ్చడిచేసి చేసి, పోనీ అప్పటితో ఒకసారైనా వాటిని 'వదిలిపెడుతున్నాడు' గదా, త్యాగరాజు అంటే అదేకదా, తద్వారా గాయకుడుకూడా త్యాగరాజేకదాఅన్నాడు. వీరిద్దరికీ బ్రాకెటులో బహుమతీ ఇవ్వాలా వద్దా? నగుమోము-కీర్తన పాడే అబ్బాయి ఏడుపుమొహం పెట్టి ప్రారంభించగానే కీర్తనసౌఖ్యం కొలవడానికి దారేదీ? ఎందుకు పీతలవలె బూనియ్యవు-అంటూ వినబడే కీర్తనయొక్క భావంకేసి చూడకుండా విని ఎంతమంది తెలుగువాళ్లు ఏమాత్రం బాగుపడచ్చు? చుక్కలరాయనిగే-లేటప్పుడు పాడేవాని మొహంనించి గానరసం ఒలికేటందుకుగాను మొహం తుమ్మల్లో పొద్దుకూకినట్టైనా ఉండవలిసింది? వైశాఖోత్-శివ, దశదిన, కరులంద యిఃప-అనే కీర్తనలో కర్మవశంచేత మాటలు తెలిసినవాడు ఎవరి పదోనాడు ఏనుగులు పుడతా అంటే ఏమంత నేరం?

వివిధరాగాల సాయంతో వివిధరోగాలు కుదర్చడానికి యత్నించేనే దేశా లున్నాయి. అటువంటి వైద్యగ్రంథం ఒకటి తయారుచెయ్యడానికి ప్రయోగాలు చేస్తున్నారు. కొన్నికొన్ని గానశాస్త్రప్రయోగాలు చేస్తే రోగాలు పుడతాయికూడానూ. ఒక పెద్దభవనం కట్టడానికి ఉపయోగించిన రాళ్లవల్ల కలిగే బ్రహ్మాండప్రతివాదం ఏశ్రుతిలో ఉందో కనిపెట్టి ఆశ్రుతిలోనే ఫిడేలుగాని వీణగాని వాయించి, ఆభవనాన్ని ఊగిసలాడించి పడగొట్టగలిగినవాళ్లు ఈకాలంలోనూ ఉన్నారు. ఒకనగరాన్ని కూడా ఊగించి వెయ్యొచ్చునని వాళ్ల ఉద్దేశం. ఆరీతిగా, జీవం లేదని మనం ఎంచుతూన్నవాటినే రంజింపచేసే

గానం భూమిమీద లేదుకూడా ఉందని మనం తెలుసుకుంటూన్నప్పుడు, తెలుగువాళ్ల పాటక చేర్లేలు — త్యాగరాజు కర్ణాటగానాన్ని తెలుగుమాటల్లో బంధించి యిచ్చిపోయాడుగనక — తెలుగు జనాన్నేనా రంజింపజేయాల్లా, వినేవాళ్లకి గానం అంటే తెలియదు అంటూ కూచోవాలా? గానం తక్షణం రంజింపజేస్తుందేకాని, ఎవడికీ తెలియదుగా? తెలుగువాడి హృదయాన్ని — వాడు మూర్ఖుడైనాసరే పశువైనాసరే — ఆకర్షించలేని గానం కర్ణాటగానం అయితేకావచ్చు గాని, తెలుగుగానం కాదు. గానాభిరుచి మానవుడికి లేదనకూడదు. గానం జీవులకి స్వభావం. నాకు గానం అంటే చాలా అభిరుచి అని చెప్పనున్నా ఎప్పట్టుగానే వినపడుతుంది, ఎవరికి కాదు? తల్లిజోలపాటకి నిద్రపోయిననాటినించీ మానవవ్యక్తికి గానాభిరుచి ఉంటుంది. అందులో లోటుండదు. కొండంత త్యాగరాజు అందరికీ ఉన్నాడు, తెలుగువాళ్లకి మరీ దగ్గర ఉన్నాడు. ఎవరెవరి గానశాస్త్రానికి త్యాగరాజు మాటలు సరిపోతాయో తక్కినవాళ్లు చూసుకుంటారు, త్యాగరాజుమాటలకి 'ఇంగితమెరిగిన సంగీతం' ఏమిటేమిటో చూసుకుని తెలుసుజనాన్ని ఆకర్షించుకోడమే తెలుగువాళ్లు చూసుకోవాలి. సార్థకగానంతో కూడి హృద్యమైన తెలుగుమాటల్ని రక్షించవలసిందంటోయ్ అంటూ తెలుగువాళ్లు ఇతరుల్ని అనడం హెచ్చరికగాదు, ధర్మంకాదు, న్యాయంకాదు. మరొకర్ని కాదు సరిగదా పరమాత్మన్నయినాసరే "అడిగి, సుఖం ఎవరనభవించారు, పరమాత్ముడికే దయపుట్టాలిగాని!" అన్న మాటలు కూడా త్యాగరాజుమాటలే!

---

# భావం

= శ్రీ శ్రీరంగం నారాయణబాబు =

వేడిగగీతం!!!
* * *
నివురుగప్పిన నిప్పు
హృదయం
కుదిపినకుంపటి
జీవితం
హేమంతనిశ
మంచుదెబ్బ
సహించుకోలేక
పుడమి
అంచులు వెలిసిన
నిశానీల దుప్పటీ
కప్పుకొని
మూడంకేసి
నిద్రిస్తే
పుండుమీద చేయిలా
బాధాకరంగా గాలి
* * *
చల్లగాలిలో
సన్నసన్నగా జారి
చుక్కలె భయపడ
నాగోడ గొంతి
నారక్తస్రవంతి నీది
హృదయహజారానికే
ఎగబ్రాకి
పట్టుజారి
క్రిందపడి
శబ్దిస్తే
నాయినుపగీతాల
సంకెళ్ల
నిన్నిరికించి
బాధిస్తే
నీవు
పకపక నవ్వా!
దొంగా!!!

— 'రుధిరజ్యోతి' నుండి.

# విజ్ఞాన విశేషాలు

## ::: ఆధునిక పరిశోధనలు - వ్యవసాయము :::

ప్రపంచసంపద యావత్తూ ఏదోవిధంగా ధాత్రీమాత నుంచే ఉద్భవిస్తున్న దవటంచేతను, అందులో మనభారతదేశంలో నూటికి తొంబదిమంది వ్యవసాయము, లేక పశుగణముపై ఆధారపడియున్నందునను ముఖ్యంగా, వ్యవసాయ విషయమున శాస్త్రజ్ఞులు గావించిన, గావించుచున్న పరిశోధనలు చాలాశ్రద్ధతో పరిశీలింపబడునవుట నిర్వివాదాంశము.

ఈపరిశోధనల్లో ముఖ్యవిషయం మనుష్యుని బదులు యంత్రములచే పనిచేయించుట. ఇందువల్ల అనేకవేలమనుష్యులకు పనిలేకుండపోవుననుట తథ్యమే. కాని పని అతిసులభముగను, చురుకుగను, శుభ్రముగను ముగిసిపోగలదు. ఎక్కువభూభాగాన్ని సాగుచేయుట, కలుపు మున్నగువాటిని తేలికగా నిర్మూలించుట, మురుగునీరు నిల్వవుండకుండా ఎప్పటికప్పుడు ప్రవహించిపోవుట, భూమి తేమసత్తువను చాలాకాలము నిలబెట్టుకొనునట్లుచేయుటమున్నగు విషయములలో అనేక పరిశోధనలు జయప్రదముగా సాగి నేడు అమలులోనికి తేబడినవి.

పాశ్చాత్యదేశాలలో గతశతాబ్దమువరకును, మన దేశములో నేటికినిగూడ నాల్గువేలసంవత్సరములక్రింద వ్యవసాయమునకు వాడబడే ఆ నాగళ్లు, ఆ కొడవళ్లు మొదలగునవి వాడుకలో నున్నవి. కాని ఇటీవల కోత కోయుటకు, దున్నుటకు, ప్రత్తిఏరుటకు అనేకరకములైన యంత్రాలు ప్రచారములోనికి వచ్చినవి.

ఇవన్నీ ఇలా వుండగా నేడు కాలిఫోర్నియాలో జరుగుచున్న ఒకానొక పరిశోధన ప్రపంచ మంతటా వ్యాప్తిచెందినచో మనదేశపు సాంఘికవ్యవస్థ తారుమారు కావచ్చు. మనదేశంలో పెద్దపెద్దజమీందార్లు, ఇనాందార్లు, భూస్వామందులును తమకుగల భూవసతివల్ల ఆర్థికంగాను, సాంఘికంగాను కూడా ఒకవిధమైన పెత్తనం సాగిస్తున్నారు. 'హైడ్రోపానిక్స్' అనే ఈపరిశోధన అమల్లోకి వస్తే వారి పెద్దరికం ఏమౌతుందో చెప్పలేం. వారిఘనత వారికున్న భూమినిబట్టీ, దానిమీద వచ్చే ఆదాయాన్నిబట్టీ. ఇకమీద వ్యవసాయానికి భూమి అక్కర్లేదు! సెంటుభూమిలేనివాడు కూడా పెద్దవ్యవసాయదారుడై జమీన్ లేని జమీందారుడు కావచ్చు. ఇదంతా మీకు లోకవిరుద్ధంగా కనపడవచ్చు. అయినా చూడండి:

కాలిఫోర్నియా విశ్వవిద్యాలయానికి చెందిన డా. విలియం ఫ్రెడెరిక్ గెరిక్ గారు ఈ హైడ్రోపానిక్సును వ్యాపారపరంగా మార్చేందుకు అనేకపరిశోధనలను చేస్తున్నారు. లోతులేని చిన్నచిన్నతొట్టెలలో నీళ్లునూ, ఒకవిధమైన పుష్టికరద్రావకమునూ కలిపి వుంచుతారు. ఆతొట్లల్లో విత్తనాలు చల్లి డా. గెరిక్ గారు టొమెటోలు, ఉర్లగడ్డలు, అనేకధాన్యములు, చిక్కుళ్లు మున్నగునవి ఎన్నో పండించారు. ఈపంటలకు కీటకబాధగాని, నీటికరువుగాని, మురుగుభయముగాని, భూమిసారం పోతుందనిగాని, అలాంటి విపత్తులేమీ లేవు. పైగా ఒకఎకరంమేరతొట్లల్లో ౨౧౭ టన్నుల టొమెటోలు పండినవి. నేలమీద ఎకరానికి ౫ టన్నులు పండితే గొప్పవిషయం. అదేవిధంగా తొట్లల్లో ఎకరానికి ౨౪౬౫ పౌనుల ఉర్లగడ్డలు పండినవి. ఈ తొట్లల్లో ఒక అరటిచెట్టు ౧౧ నెలల్లో ౧౭ అడుగుల ఎత్తున పెరిగింది. అదేవిధంగా పొగాకు మొదలైనవికూడా మంచి ఏపుగాను, భూమిమీద పండే పంటకు కొన్నిరెట్లు అధనంగాను పండుతున్నవి.

ఇదిగాక డా. గెరిక్ గారు పండ్లకు తాను తలుచుకున్న రంగును ఇవ్వగలుగుతున్నారు. ఆ తొట్లల్లో ఏ రంగు కలిపితే ఆవర్ణము ఆ పండేఫలాలకూ, అందులోని రసానికీ వస్తుంది. ఎఱ్ఱనివర్ణంగల డా. గెరిక్ గారి టొమెటోలకు సాధారణటొమెటోలకంటె రెట్టింపు విలువ ఉండటంలో ఆశ్చర్యం ఏమిన్నీ లేదు. ఇదిన్నీగాక ఈనీళ్లలోని సత్తువగల పదార్థాలను మిళితంచేసి అందులో పండువాటియందు వైటమిన్ సంపదకూడ వృద్ధిచేయ గలిగినారు డా. గెరిక్ గారు. ఇదంతా ఇంద్రజాలం గానో, విశ్వామిత్రసృష్టిగానో కనపడవచ్చు. కాని కొద్దిరోజుల్లో ఇలా పండిన పండ్లే మన పల్లెలలోకి రావచ్చు.

పంటపండించుటకంటె ఆ పంటలను నిలబెట్టుకొనుట పెద్ద సమస్యగా పరిణమించింది. ఈ విషయంలో మానవజాతికి పరమశత్రువులు క్రిమికీటకాలు. ఇవి నానాటికీ అనేకజాతులు అసంఖ్యాకములుగా పెరిగిపోవటంవల్ల అంతకంతకూ జీవనంకోసం కీటకమాన

వుల మధ్య ఒకవిధమైన పోరాటం ప్రారంభమైంది. మానవుడు తన శ్రమ ఫలించి, తన కడుపు నిండాలనుకుంటే ముందు ఈ కీటకవధకు మార్గాలు వెతుక్కోవలసివస్తోంది. ఈ కీటకబాధ ప్రపంచమంతట్లో అమెరికాఖండంలో ఎక్కువ. అక్కడ ఏటా రూ. ౮౫ కోట్ల విలువగల పంటలు కీటకాలవల్ల నాశనమౌతవట. ఈ బాధ మనకు తక్కువగానే వున్నప్పటికీ ఉత్తరహిందూస్థానము, అందులోనూ ముఖ్యంగా సింధురాష్ట్రంలో చాలాదారుణంగానే ఉన్నట్లు తెలుస్తున్నది.

ఈ కీటకసంహారానికి పరిశోధనలు మళ్లీ సహాయపడుతున్నవి. ద్రావకాలు, మందుపొళ్లు చిమ్మెరి గొట్టాలద్వారా చల్లడం, బోనులలాంటివి వుంచి వాటిలో ఈపురుగులను పట్టడం మున్నగువిధాలెన్నో పరీక్షింపబడి నిష్ప్రయోజకాలుగా విసర్జింపబడినాయి.

సింధురాష్ట్ర వ్యవసాయశాఖమంత్రిగారి వార్షిక నివేదికనుబట్టి థార్ యెడారిలో ఎన్నడూ ఎరగనట్టి మిడతలబాధ యీ యేడు దాపురించినట్లు తెలుస్తున్నది. అనేకవిధాలైన నివారణోపాయాలువన్నినారు. అందులో ముఖ్యమైంది కందకాలు త్రవ్వటం. పెద్ద కందకాలు త్రవ్వి ఈ మిడతలకు ఆకర్షణీయమైన పదార్థాలందులో వుంచితే కోట్లకొలదిగా మిడతలు వచ్చి ఆ కందకాల్లో పడి మరణించినట్లు తెల్పినారు. ఈ ప్రకారం ఇటీవల రోజునకు ౬౦ కోట్ల మిడతలను నాశనం చేసినట్లు ఆ నివేదిక తెలుపుతున్నది. ఈ ౬౦ కోట్లు బ్రతికివుంటే రోజుకు ఒక్కొక్క చదరపు మైలు ఆక్రమించే మరి ౨౦ కోట్ల మిడతలను ఉద్భవింపజేసేవిట. విదేశాల్లో ఇలాంటి ప్రత్యేకదాడులు లేని సాధారణ పరిస్థితుల్లో కీటక సంహారానికి శాస్త్రజ్ఞు లొక విధానం కనిపెట్టారు. అది రంగుకాంతి. ఒక్కొక్కరకమైన కీటకాలు ఒక్కొక్కవర్ణముచే ప్రత్యేకముగా ఆకర్షింపబడతాయని నిర్ధారణ చేసుకున్నారు. ఆయాకీటకాల బాధ వున్నప్పుడు ఆయా రంగుగల దీపాలను వెలిగిస్తారు. ద్రాక్ష మున్నగు పండ్లను నాశనంచేసే కీటకాలకు నీలవర్ణం ఆకర్షణ కలిగిస్తుంది. ఇలాంటి దీపాలను బోనుల్లో పెట్టి వాటి కటకటాలకు విద్యుచ్ఛక్తి ప్రసరింపజేస్తారు. ఆ కాంతికి ఆకర్షింపబడిన కీటకాలు ఎగిరివచ్చి విద్యుత్ప్రసారితమైన ఈ కడ్డీలకు తగిలి వెంటనే భస్మీభూతమౌతాయి. సాధారణపరిస్థితుల్లో ఒక్కొక్కరాత్రికి అయిదువేల కీటకాలు నాశనమవుతాయి. కీటకాలవలన కలిగే నష్టంతో పోల్చిచూస్తే ఈ ప్రక్రియ అట్టే ఖర్చుతో కూడినది కాదు. ఏలనన పాశ్చాత్యదేశాలు ఈకీటకబాధానివారణకు గాను ఏటా ఆయుధసంపత్తికి చేసినంత ఖర్చు చేస్తున్నారు.

ఇవిగాక కీటకాలనూ, కలుపుదుబ్బులనూ నాశనం చేయడానికి మరికొన్ని మార్గాలను కనిపెట్టుతున్నారు. ప్రకృతిలో ఒక్కొక్క కంటకపదార్థాన్ని నాశనం చెయ్యడానికి మరొకపదార్థం భగవంతుడు సృష్టించి వుంచేవున్నాడు. నేటిశాస్త్రజ్ఞులు అట్టిరహస్యాలనే తమ పరిశోధనలవల్ల విపులంగా తెలుసుకోగలిగి ఆయా అవసరాలకు సరిపోవునట్లు వాటిని ప్రయోగించుకొని ఆపన్నివారణ పొందుతున్నారు. ఇలాగే రక్కిస మొదలైన దుబ్బులనూ, చెదలు మొదలగు కీటకాలనూ నాశనం చెయ్యడానికి వాటిని నిర్మూలించగల క్రిములను అందులో ప్రవేశపెట్టి సఫలమనోరథు లౌతున్నారు.

సాధారణంగా మనం పూర్వంనుంచీ వాడుతున్న ఎరువులుగాక శాస్త్రజ్ఞులు అనేక ఎరువులను కనిపెట్టి భూమి ద్విగుణీకృతంగానూ, కొండొకచో త్రిగుణీకృతంగానూకూడా ఫలవంతమౌనట్లు చేస్తున్నారు. ప్రస్తుతము సాగులోవున్న భూభాగమే కాకుండా శతాబ్దముల తరబడిగా బంజరుబీళ్లై పడివున్న భూభాగాలనుకూడా ఫలవంతం చెయ్యడానికి శాస్త్రజ్ఞులనేకపరిశోధనలు చేశారు, చేస్తున్నారు. ఇందులో ఒకానొకపరిశోధన చాలా అద్భుతంగా పనిచేస్తోంది. సూర్యరశ్మి తక్కువగా ఉండే భూభాగంలో పంటలు సరిగా పండవు. అలాంటిప్రదేశాల్లో భూమిలోనికి విద్యుచ్ఛక్తి ప్రసరింపజేసి అక్కడకూడా విరివిగా పంటలు పండేట్లు నేటిశాస్త్రజ్ఞులు చేస్తున్నారు. ఆర్కిటిక్ దేశాల్లో సూర్యరశ్మి చాలా కొద్దికాలమే వుంటుంది కనుక అచటి భూభాగం మంచుతో కప్పబడివుండి ఏమాదిరి పైరుపంటలు పెరగడానికీ అవకాశంలేకుండా వుంది. ఈ నూతనపరిశోధనవల్ల అటువంటిదేశాల్లోకూడా ఇకమీద పంటలు పండించబోతున్నారు. నిజంగా ఈశాస్త్రజ్ఞాల మహత్కార్యాలకు అంతులేనట్లుంది.

ఈ పరిశోధనలఫలితంగా ఇకమీద మనం గింజలేని నారింజలు, పుచ్చపండ్లు, ద్రాక్ష మొదలైనవి రుచిచూడగలుగుతాము. అంతేకాదు. తోలులేని అరటిపండ్లుకూడా మనం చూస్తామేమో!

పులిగడ్డ వేంకటసుబ్బారాయుడు.

# బాలానందం

## సముద్రము, కొండలు

అనగా అనగా ఒక ఊళ్లో ఒక రాజుండేవాడు. ఆరాజు కిద్దరు కొడుకు లుండేవారు. పెద్దవాడి పేరు సాగరబాలుడు; చిన్నవాడి పేరు హిమకుమారుడు. వాళ్లిద్దరూ చిన్నప్పటినుంచీ ఒకళ్లకంటె ఒకళ్లు గొప్పవాళ్లవాలని అనుకుంటూండేవారు. ఒకరోజు వాళ్లిద్దరూ వాళ్ల నాన్నతోకూడా వేటకి వెళ్లారు. ఆ వేటసందడిలో వాళ్లిద్దరూ ఒకవైపూ, తక్కినవాళ్లందరూ ఇంకొకవైపూ అయిపోయారు. అప్పుడు సాగరబాలుడు తన గుఱ్ఱాన్ని బాగా పరిగెత్తిస్తూ "చూశావా! నాగుఱ్ఱాన్ని ఎంతబాగా పరుగెత్తిస్తున్నానో!" అన్నాడు. "అయితే, నాగుఱ్ఱంమాత్రం పరిగెత్తటం లేదా?" అంటూ తన గుఱ్ఱాన్ని ఇంకా బాగా పరుగెత్తించాడు హిమకుమారుడు. "దీంట్లో ఏముందీ, నిజంగా ఎవరు గొప్పవాళ్లమో చూసుకోవాలిగాని" అన్నాడు మళ్లీ సాగరబాలుడు. "అయితే ఇప్పుడు మనిద్దరిలోనూ ఎవరు గొప్పవాళ్లమో చూద్దామా?" అన్నాడు హిమకుమారుడు. "అయితే సరే" అని ఇద్దరూ కలిసి ఆ అడివి దాటేసి ఇంకో అడివిలోకి వెళ్లేటప్పటికి అక్కడో చక్కని సరస్సు కనిపించింది వాళ్లకి. అక్కడే కొన్ని పళ్లచెట్లుకూడా ఉన్నాయి. ఆవాళటికి అక్కడే ఉండిపోదామనుకొని వాళ్లిద్దరూ స్నానం చెయ్యడానికి సరస్సులో దిగారు. అప్పుడు వాళ్లిద్దరికీ సరస్సుమధ్యగా ఒక బంగారుచేప కనిపించింది. "దాన్ని పట్టుకోనా తమ్ముడూ?" అని అడిగాడు సాగరబాలుడు. "అక్కడ చాలా లోతుగా ఉంటుంది. దానిదగ్గిరకి వెళ్లొద్దు" అన్నాడు హిమకుమారుడు. "అలా కాదు, నేను పట్టుకొంటాను చూడు!" అని ఈదుకువెళ్లి పట్టుకోబోయి అందులో మునిగిపోయాడు పాపమా సాగరబాలుడు. అప్పుడు హిమకుమారుడు "అయ్యోపాపం, అన్నయ్య మునిగిపోయా"డని విచారిస్తూంటే "ఎవరు నువ్వు, ఒక్కడవూ కూచుని ఏం చేస్తున్నావు?" అని ఎవరో అడిగారు. ఎవరా అని పైకి చూసేటప్పటికి పైన ఒక తెల్లని మేఘంలో ఓ అందమైన అమ్మాయి కనిపించింది. "నా పేరు హిమకుమారుడు" అని తనకథంతా చెప్పాడు హిమకుమారుడు. "నేను దేవకన్యకను; నా పేరు మేఘబాల. నాకు భూలోకం అంటే చాలా ఇష్టం! అంచేత నేను ఆకాశంమీద తిరుగుతూ చూస్తూంటాను. నువ్విక్కడికి రాగలవా?" అని అడిగింది మేఘబాల. "నువ్వంతఎత్తుగా ఉన్నావుకదా! నేనెలా రాగలను?" అన్నాడు హిమకుమారుడు. "నేనూ రాలేను మరి! ఇక్కడ తిరగడమేగాని అక్కడికి రాలేను. మరి నేనో ఉపాయం చెప్తాను వింటావా?" అని అడిగింది మేఘబాల. "ఏమిటి" అన్నాడు హిమకుమారుడు. "మాఇంట్లో కమండలంలో మంత్రపు నీళ్లున్నాయి. అవి చల్లుకుంటే ఏది కావాలంటే అది అవుతారు. నేను అవి తెచ్చి చల్లుతాను, నువ్వొక పెద్దకొండయితే బాగుంటుంది, అప్పుడు నా అంత ఎత్తూ అవొచ్చు" అంటూ రివ్వున పరుగెత్తుకెళ్లి మంత్రపునీళ్లు తెచ్చి చల్లేసింది మేఘబాల. దాంతోటి హిమకుమారుడు మేఘబాలకంటే ఎత్తుగా అయిపోయాడు. అప్పటినుంచీ మేఘబాలా, హిమకుమారుడూ అలా సుఖంగా ఆడుకుంటూ ఉండేవారు.

ఆసాగరబాలుడు అలా మునిగిపోయి ఒక పెద్ద మైదానంలో ఉన్న చక్కటి సరస్సులో తేలాడు. ఆసరస్సులో అన్నీ బంగారు తామరపూలూ, బంగారు చేపలే ఉన్నాయి. దాని ఒడ్డునే చాలామంది పిల్లలు ఆడుకుంటున్నారు. సాగరబాలుణ్ణి చూడగానే వాళ్లంతా వచ్చి "ఎవరబ్బాయీ నువ్వు?" అని అడిగారు. సాగరబాలుడు తన కథంతా

చెప్పి "మీ రెవరు?" అని అడిగాడు. "నా పేరు కళాకన్యక. మేమూ చిన్నప్పుడు భూలోకంలోనే ఉండే వాళ్లం. మాతండ్రి ఒక రాజు. ఒకమాటు మా నాన్న వేటకి వెళ్లినప్పుడు ఒక రాక్షసుడు మా రాజ్యం అంతా పాడుచేసి నన్నిక్కడికి పెంచుకోడానికి ఎత్తుకువచ్చేశాడు. మా నాన్న వేటనుంచి వచ్చాక నన్ను వెతకడానికి తిరుగుతూ నీలాగే సరస్సులో మునిగి ఇక్కడికి వస్తే అందరిలాగే అతన్నీ మింగేయబోయాడా రాక్షసుడు. అప్పుడు మా నాన్న వాణ్ణి చంపేశాడు. అప్పటి నుంచీ మేము ఇక్కడే ఉంటున్నాం. ఆ సరస్సునీ, చేపనీకూడా ఆ రాక్షసుడే కల్పించి ఆ చేపకోసం వచ్చినవాళ్లందర్నీ మింగేస్తూండేవాడు. వీళ్లందర్నీ కూడా నాలాగే తీసుకువచ్చాడు." అని చెప్పి వాళ్లందర్నీ చూపించింది కళాకన్య. తరవాత కళాకన్యకా వాళ్లతోటి కలిసి వాళ్ల నాన్నని చూడ్డానికి వెళ్లేడు సాగరబాలుడు.

వాళ్లనాన్న ఆ తోటలోనే ఒక చెట్టుకింద తపస్సు చేసుకుంటున్నాడు. సాగరబాలుడు నమస్కారం పెడితే "నువ్వెవరు" అని అడిగాడు వాళ్ల నాన్న. కళాకన్యక సాగరబాలుడి కథంతా చెప్పి "ఇలా చంపివేసి వచ్చాడు" అని చెప్పింది. అప్పుడు వాళ్లనాన్న "మీ రిద్దరూకూడా సమానమైన గొప్పవాళ్లే అవుతారు లే" అని చెప్పాడు. తరవాత సాగరబాలుడికి తన పెంపుడు లేళ్లనీ, చిలకల్నీ, బొమ్మల్నీ, ఆ రాక్షసుడు సంపాదించిన ముత్యాల రత్నాల రాసుల్నీ అన్నింటినీ చూపించింది కళాకన్యక. అక్కడ రోజూ ఎన్నో ఆటలాడుకుంటూండేవారు వాళ్లందరూ!

ఒకరోజున వీళ్లంతా ఆ సరస్సు ఒడ్డుని ఆడుకుంటూంటే "మనం ఇల్లాంటి పెద్దసరస్సు అయిపోతే బాగుండదా?" అని వాళ్లకి తోచింది. వెంటనే వాళ్లందరూ గబగబా వాళ్ల నాన్నదగ్గిరకు వెళ్లి "మాకో పెద్దసముద్రం అయిపోవాలని ఉంది" అన్నారు. అంటే వాళ్లనాన్న "నే నొక మంత్రం ఉపదేశిస్తాను" అని చెప్పి ఓ మంత్రం ఉపదేశించాడు. వీళ్లందరూ అది జపిస్తూ ఆ సరస్సులో మునిగేటప్పటికి ఒక పెద్ద సముద్రంగా మారిపోయి ఇదివరకు సాగరబాలుడు మునిగిపోయిన సరస్సులోనే తేలారు. వాళ్ల నాన్న వాళ్లతోటికూడా వచ్చేసి అక్కడే తపస్సుచేసుకుంటూ ఉండిపోయాడు. వాళ్లు మాత్రం అతివేగంగా అలా ప్రవహిస్తూ ఎంతోదూరం వెళ్లిపోయారు. అక్కడే ఉన్నారుకాదూ ఈ హిమకుమారుడూ వాళ్లూనూ. సాగరబాలుడు హిమకుమారుడితో తన కథంతా చెప్పి "నువ్వెలా కొండవయావు?" అని అడిగాడు. హిమకుమారుడు తన కథంతా చెప్పాడు. కొన్నాళ్లిలా ఉండేటప్పటికి "వాడికంటె నేను పెద్దవాణ్ణికదా, వాడంత ఎత్తుగా ఉంటే నేనింత కిందగా ఉండడ మేమిటి?" అనుకుని పైకి పొంగిపోవడం మొదలెట్టాడు సాగరబాలుడు. అప్పుడు దేశాలన్నీ మునిగిపోతూయి. పాపం, వాళ్లందరూ సముద్రాన్ని తిట్టుకుంటూండేవారు. అప్పుడు కళాకన్యక తండ్రి వచ్చి "నువ్విలా పొంగిపోతూంటే దేశాలన్నీ మునిగిపోతున్నాయి చూశావా? మీ రిద్దరూ గొప్పవాళ్లే" అని చెప్పి వెళ్లిపోయాడు. అప్పటినుంచీ సాగరబాలుడు పొంగటం మానేశాడుకాని "వాడంత ఎత్తుగా ఉండడ మేమి"టని తన కెరటాలతో పడగొట్టెయ్యబోయాడు సాగరబాలుడు. అప్పుడు హిమకుమారుడికి చాలా కోపం వచ్చి దేశానికి ఉత్తరంగా చాలాదూరం వెళ్లి అక్కడే ఉండిపోయాడు.

అయినా సాగరబాలుడు ఆ కోపం మరిచిపోక ఏ చిన్నకొండ ఉన్నా తన కెరటాలతో అలా కొట్టుతూంటాడు.

— మంచాళ శంకరీదేవి.



# మీగడ తరకలు

## 'సూయాణ' శబ్దవిచారము

"నడదీవియలు నేసె నగరికి మాణిక్య
 మకుటము ల్పూనిన మనుజపతుల
దను నాజ్ఞ సూయాణముగ నొనరించె మం
 చిగ సేలవాలును చెరగులకును
శ్రీకార్థి జనుల సచేతన త్యాగధ్వ
 జములుగా నన్ని దేశముల బఱపె
దిక్కులన్నింటను దెలుపారు ఖ్యాతిగా
 వించె నజ్వాలయశో విభ్రమంబు
 ... ... ...
ధర్మ,రాజు కుమ్మకుమ త్స్వైరసీరమణ యితడు"

ఆంధ్రమహాభారతము విరాటపర్వమునందలి (౫ ఆ ౩౨౦ ప.) ఈపద్యములోని 'సూయాణ'శబ్దమునకు మన నిఘంటుకారులును, తదితర పండితులునుకూడ "దండెత్తిపోవుట-దండయాత్ర" అనునర్థమును సాధించియున్నారు. ఆంధ్రశబ్దచింతామణిలోకూడ ఈశబ్దమునకు "శత్రుభయంకరమైన దండయాత్ర" అను నర్థమే ఇవ్వబడియున్నది. ఈ పదమునకు ఇతరత్ర ఏ తెలుగుగ్రంథమునందును ప్రయోగము కానరాదు. కావున ఏకైకమైన ఈ ఒక్క ప్రయోగమువల్లనే దీని యర్థమును సాధింపవలసియున్నది. అందువల్ల మన ఆంధ్ర పండితులు దీనిని సంస్కృత 'సుయాన'శబ్దపు తద్భవ రూపమని భ్రమించి యీ యర్థమును సాధించినారు. కాని వారు చెప్పిన అర్థము పైపద్యప్రకరణమునకు ఎంతమట్టుకు సంగతమై సరిపోవుచున్నదో పర్యాలోచింపవలసియున్నది. అజమునకు అక్కడ 'దండయాత్ర'ను సమన్వయపరచుట కొంచెము ప్రయత్న సాధ్యమే.

ఈ సందర్భములో ఈమధ్యనే ప్రకటితమైన **Annals of Oriental Research** పత్రిక సంచికలో శ్రీ హెచ్. శేషయ్యంగారు వ్రాసి ప్రకటించిన ఒక విమర్శవ్యాసము గమనింపదగియున్నది. అందులో వారు కన్నడసాహిత్యమునంతను అమూలాగ్రముగా అవలోడనచేసి ఈపదమునకు క్రొత్త అర్థమును సాధించియున్నారు. వారి హేతువాదములు యుక్తియుక్తములుగానే కనిపించుచున్నవి. వారు చెప్పిన అర్థముకూడ మన భారతములోని ప్రకరణమునకు సమ్యక్ సరిపోవుచున్నది. ద్రావిడ ప్రాణాయామము చేయవలసినంత అవసరము కూడ లేదు. ఆ యర్థమును ఆంధ్రపండితుల కెరుకపరచుటకై ఆ వ్యాసముయొక్క సారాంశమును ఇక్కడ ఉల్లేఖించుచున్నాను. గుణగ్రహణ పారీణులగు మనపండితులు ఈయంశమును సహృదయతతో పరిశీలింపదగును :

"ఈ సూయాణశబ్దమునకు పర్యాయముగా కన్నడ సారస్వతములో సూయాణ, సాహియాణ, సుయ్యాణ, సుయ్యతాణ అను అనేకరూపములు కనుపించుచున్నవి. ఇది 'సూచీయాన'మునకు తద్భవమని వ్యుత్పత్తి చెప్పవచ్చును. శబ్దమణిదర్పణములోని తద్భవ ప్రకరణమందు "సూచీయాన = సూయాణ; సంస్కృత సమాస పదముల తద్భవ రూపములందు ఒక్కొక్కప్పుడు పూర్వపదములోని అంత్యాక్షరమును, ఒక్కొక్కప్పుడు ఉత్తరపదములోని ఆద్యక్షరమును లోపించు"నని తత్కర్త యీ పదము నుదాహరణగా చెప్పియున్నాడు. ఇదికాక సంస్కృత శబ్దములలోని నకారము తద్భవములందు ణకారముగా మారిపోవునని "గాన = గాణ; ధర్మపానీయ = దమ్మణి" అను నుదాహరణములను పఠించియున్నాడు. కావున సీసూయాణ శబ్దము 'సూచీయాన'మనెడి సంస్కృత శబ్దమునకు తద్భవరూపమనుటయే యుక్తముగా కనుపించుచున్నది. దీనికి పర్యాయపదములుగా వాడబడుచున్న

ఇతర రూపములుకూడ పరిశీలించగా పరిశీలించగా అసంగతములుగాను, అసంబద్ధములుగాను, లేఖకప్రమాదమున కలదైనట్టివిగాను దృఢపడుచున్నది. ఆయా ప్రయోగములను సూక్ష్మదృష్టితో పరిశీలించినవారికి 'సూయాణ' అను రూపమొక్కటే సమంజసమైనదని స్పష్టపడగలదు.

ఇక దీని అర్థవిచారము: కన్నడభాషలోని ఏ నిఘంటువునందును దీనికి అర్థము వ్రాయబడలేదు. కావున సారస్వతమునం దుపయుక్తమైన ఆయా ప్రయోగములనుబట్టియే ఈ శబ్దార్థవిచారము చేయవలసియున్నది. వివిధకావ్యములందు ఇది ఉపయుక్తమైన ప్రకరణములను పరామర్శించి పరిశీలించి చూడగా ఈ సూచీయానశబ్దమునకుగాని, దీని తద్భవరూపమైన సూయాణశబ్దమునకుగాని రంగురంగుల అల్లిక గుడ్డ యను నర్థము నిశ్చయింపదగియున్నది. ఆంధ్రపండితులు నిర్వచించిన 'దండయాత్ర' దీనికి ఎందువను పొసగనే పొసగదు. శబ్దార్థములను విడదీసి చూచినను ఈకొత్త యర్థము సంగతముగానే కనిపించుచున్నది. సూచీయానమనెడి ఈసంస్కృతశబ్దమునకు నాకు తెలిసినంతవరకు ప్రసిద్ధమైన సంస్కృతకావ్యములయం దెక్కడను ప్రయోగము కానిపించదు. సంస్కృతనిఘంటువులలో కూడ దీని అర్థవిచారము కానరాదు. కాని 'స్థితస్య గతి శ్చింతనీయా'. కావున పైయర్థము వచ్చునట్లు ఈ శబ్దమునకు సులభముగానే అవయవార్థము చెప్పవచ్చును. "సూచ్యాః యానం యస్మిన్ తత్" అని వ్యధికరణ బహువ్రీహినైనను చేసికొనవచ్చును. లేదా, "సూచ్యాః యానం" అని షష్ఠీతత్పురుష చేసి కొని 'అర్శఆద్యచ్' అనుసూత్రమువల్ల 'కల'అని మతుబర్థకమైన అచ్ప్రత్యయమును చెప్పినను చెప్పవచ్చును. ఉభయ సందర్భములందును 'సూదియొక్క గమనాగమనములుగల' అనియర్థము వచ్చును. అనగా ఏదైన నొక రంగుల గుడ్డమీద అటువంటి రంగుగుడ్డలపైనని కత్తిరించిన కమలము, చంద్రుడు, సూర్యుడు మొదలైన బొమ్మలను కుట్టిన గుడ్డయని నిశ్చయమగుచున్నది. ఇప్పుడు మన మహిళామణులుచేయు ఎంబ్రాయిడరీ (పూలఅల్లిక)ని ఈసూచీయానమునకు పోల్చవచ్చును. పూర్వమునందును ఇట్టి శిల్పము ఉండియుండెను. ఇట్టిశిల్పము చేసిన గుడ్డలు మన మిప్పటికిని దక్షిణదేశ క్షేత్రములలో ఉత్సవాదులయందు అలంకారార్థము ఉపయోగింపబడుచుండుట చూచుచునేయున్నాము. కనుక 'సూయాణ' శబ్దమునకు ఈ రంగుఅల్లికగుడ్డయనెడి అర్థము సమంజసముగా సరిపోవుచున్నది.

శేషయ్యంగారుగారి వాదము యుక్తియుక్తముగానే యున్నది. పై భారతప్రయోగమునగూడ ఈ యర్థము నిర్బాధముగా, ప్రకరణానుసారముగా అతికిపోగలదు.

శబ్దస్వరూపము వేరైపోయినను, చతుష్షష్టికళలలో ఒకకళగా పేర్కొన్న 'సూచీవానము'నకును, ఈ 'సూచీయానము'నకును అంతరము కానరాదు. వస్తుస్వరూపమునందు రెండును సమానములే. ఆ'సూచీవాన' జాతికి చేరినదే ఈ 'సూచీయాన' శిల్పముకూడ. కావున సూయాణశబ్దమును ఈసూచీయానశబ్దవికృతిగా భావించుట సర్వథా సంప్రతిపన్నమై యుండగలదు.

'ఆచార్య'

---

## కీ. శే. నాగపూడి కుప్పుస్వామయ్యగారు

ముక్కుతిమ్మన పారిజాతాపహరణమునకు 'పరిమళోల్లాస'మను సాంధ్రవ్యాఖ్య వ్రాసి కీర్తిగడించిన నాగపూడి కుప్పుస్వామయ్యగారు అక్టోబరు నెల ౨౭-వ తేదీనాడు దివంగతులైరి. వీరిమృతికి వాపోవుచున్నాము; వీరి యాత్మకు శాంతి నాకాంక్షించుచున్నాము.

వీరు జన్మతః అరవవారయ్యును ఆంధ్రదేశములో పుట్టి ఆంధ్రులమధ్యనే పెరిగి చిన్ననాటినుండియు ఆంధ్రభాషనే యభ్యసించుచుండినందువలన వీరు ఆంధ్రులుగనే పరిగణింపబడుచుండిరి. కొంతకాలము వీరు కాళహస్తి రాజాగారి సంస్థానములో ట్యూటరుఉద్యోగమునం దుండిరి. అటుతరువాత ప్లీడరుపరీక్షయందు తేరి తిరుపతిలో న్యాయవాదివృత్తి నవలంబించి నిన్నమొన్నటివరకును ఆవృత్తినే సాగించుచుండిరి. చిన్నప్పటినుండియు వీరికి ఆంధ్రసాహిత్యమునందు అభిమానము మెండు. సంస్కృతభాషలోకూడ కవనమల్లగల నేర్పు వీరికుండెను. వీరు రచించిన సంస్కృతస్తోత్రములు చాల కలవు. వీరు శుద్ధగ్రాంథికవాదులు. మద్రాసు విశ్వవిద్యాలయములో తెలుగుశాఖయందు వీరు అనేకపదవులను నిర్వహించిరి. సంస్కృతాంధ్రములందు చక్కని పాండిత్యమును ప్రదర్శించిన యిట్టి సాహిత్యవేత్తను కోల్పోయినందుకు మిక్కిలి విచారించుచున్నాము.

# వింత వీలునామా

● 'రావుబాబు' ●

నేను మొదట నమ్మలేదు. హాస్య మాడుతున్నాడనుకున్నాను. వా రిద్దరి ప్రేమగాథ తెలిసినవారెవ్వరు నమ్ముతారు? ఇప్పుడు నాగరకకుటుంబాల్లో కొత్తగా బయలుదేరుతున్న ప్రేమవివాహాలలో యిదొకటి అని లెక్క వేసుకున్నాను. కాని వినోదరాయి మొఖమీ్మదున్న విషాదచ్ఛాయలు చూసింతర్వాత ఏదో విపరీతము జరిగేవుంటుం దని అనుకున్నాను.

ఉండివుండి ప్రశ్నించాడు రాయి — "రావుబాబూ, నువ్వు భూతము లన్నా, దెయ్యము లన్నా నమ్ముతావా" అని.

"నాకిప్పటిదాకా ఏం నమ్మకము లేదు. ఏం? ఏం జరిగిం దేమిటి? ప్రతిమను పెళ్లాడితే ఏదన్నా భూతము మింగుతావందా ఏమిటి?" అన్నాను కొంచెము నవ్వుతూ, జరిగిం దేదో హాస్యధోరణిలో పెట్టి కనుగుందామని.

"కలుచుకుంటే —" అని ఒక్క నిట్టూర్పు విడిచాడు రాయి. ఆ పైమాట అతని నోటివెంట రానే లేదు.

"వినోద్, జరిగిం దేదో సరిగ్గా చెప్పు. నువ్వు శెరంపూర్ నుండి వచ్చిందగ్గర్నుంచీ అదోమాదిరిగా వుంటున్నావు. నీ మనస్సుకి మరీ కష్టంగా లేకపోతే జరిగిందేదో చెప్తే నాకు తోచిన సలహా —"

నే నా పైమాట అనకుండానే అతను నావంక చూచి ఒక విషాదమిళితమయిన నవ్వు నవ్వేడు. "సలహాస్టేజి దాటిపోయింది రావ్ ... అసలు నా ధైర్యమే సన్నగిల్లిపోయింది, చెవ:క్రిదాదాకథ విన్న

తర్వాత ...... చెప్తాను విను అతని 'వింత వీలు' వృత్తాంత మంతాను" అని ప్రారంభించాడు:

"నేను చౌదరీగారింట్లో అతని కుమారుడికి ట్యూషనుకి కుదురుకోవడం, చౌదరీగారి కుమార్తె ప్రతిమతో నా పరిచయం, అది క్రమంగా ప్రేమగా మారడం నీ కిదివరకే చెప్పాను."

"అవును. ప్రతిమకూడా రెస్పాండ్ చేస్తుం దనే కదూ చెబుతుండేవాడివి ?"

"ఆమెకే కాదు, ఆమెతండ్రికికూడా అంగీకార మేనన్న సూచనలు నా కగ్పించాయి. అంచేతే అతని కుమారుడు కుషార్ మెట్రు పాసయి ఇంజనీరింగుకి బెనారెస్సు వెళ్లిపోయినా మా యిద్దరి మీటింగులుమాత్రం యథేచ్ఛగానే జరుగుతుండేవి. అప్పుడప్పుడు సినీమాలకనీ, పార్కులకనీ కలసి వెళ్లుతుండేవాళ్లము. నే నోనాడు కలటోలాలోనున్న ఒక మిత్రుడి యింటికి రాత్రి విందుకని వెళ్లి ఆ రాత్రి అక్కడే పరుండి మర్నాడు ప్రొద్దుట మా యింటికి బయలుదేరి వస్తున్నాను. ప్రతిమని చూసి అప్పటికి సుమారు వారమురోజు లవుతుంది తోలీలో ప్రతిమతో సాయంత్రం మెట్రోకి ఆనాడు ప్రోగ్రాం బుక్ చేద్దామని శ్యామప్రసాద్ చౌదరీగారింటికి వెళ్లాను. ఇంట్లో తండ్రీకూతురు లిద్దరూ కూడ లేరు. సేవకుని వల్ల తెలిసింది ఏదో గ్రామాంతరం వెళ్లేరని. ఎప్పుడు వస్తారోకూడ అతడు చెప్పలేకపోయాడు. నేను హతాశుడనై యింటికి వచ్చేశాను. ఇంటివద్ద టేబిలుమీద ఒక వుత్తరం పడివుంది. నేను లేకపోవడం చూసి పోస్టుమేను కిటికీలోనుంచి విసరివుంటాడనుకున్నాను. శెరంపూరుపోస్టుముద్ర చూసి విప్పి చదువుకుంటే అది ఛెటర్జీదాదావద్దనుండి వచ్చిందని తెలిసింది. మర్నాడు విందుకు రమ్మని ఆహ్వానము. రాత్రి అక్కడ వుండి పోయే ఏర్పాటుతో. సతీశ్చంద్ర ఛెటర్జీ చాలా ఆస్తిపరుడు. నేను ఒకటిరెండుసార్లు మాత్రమే చూచానంతే. అంత స్వల్పపరిచయంతో అతను నన్నా రీతిగా ఆహ్వానించడం చాలావింతగా తోచింది. అతని కుటుంబవిషయంగూడ అంతకు ముందు నాకేమీ తెలీదు.

"మర్నాడు శెరంపూరు ప్రయాణమయ్యాను. అక్కడ ఛెటర్జీగారింట్లో అనుకోకుండా ప్రతిమనూ, ఆమెతండ్రినీ చూసేటప్పటికి నాకు ఆశ్చర్యం వేసింది. వారుకూడా ఆ విందుకే వచ్చారు. ఎందుకో గాని ప్రతిమముఖమ్మీద ఎప్పటి ప్రసన్నభావం లేదు. ఆ తండ్రీకూతుర్లతో నేను మాట్లాడ్డానికి అవకాశం యివ్వకుండానే నన్ను మేడమీదికి తీసుకొని పోయాడు ఛెటర్జీదాదా. వారిద్దరూకూడ మావెంటే మేడమీదకి వస్తారనుకున్నానుగాని, విందువేళదాకా వారు రాలేదు. విందుకి ఆహ్వానింపబడింది మేము ముగ్గర మేనని తెలిసింతర్వాత మరింత ఆశ్చర్యం వేసింది—అంత బెంగాలుదేశంలోనూ ఛెటర్జీ గారికి మరి స్నేహితులుగాని, బంధువులుగాని లేరా అని.

"రాత్రి విందుతర్వాత ఛెటర్జీదాదా మా ముగ్గుర్ని వరండాలోనికి తీసుకుపోయాడు. వెన్నెల ఎంతో చల్లగా, అందంగా వుంది. నలుగురికీ నాలుగు వాలుడుకుర్చీలు అమర్చబడివున్నాయి. అంతా ఆసీనుల మయింతర్వాత ఛెటర్జీదాదా కొంచెము గంభీరం వహించి చేతిపెట్టెలోనుంచి ఒక దస్తావేజు తీస్తూ 'మిమ్మల్ని ఒక్క విందుకే గాకుండా ఇంకో పనిమీదకూడా పిలిచాను ... ఇది నా వీలు ... దీనికి మీ యిద్దరి సంతకాలూ కావాలి ... నా కిప్పుడు డెబ్బయియేళ్లు పూర్తికావస్తున్నాయి. నే నింక యెన్నాళ్లో బతికేటట్టు తోచదు. అందుచేత నా అనంతరం నా ఈ ఇరవై లక్షల ఆస్తీ ఎవరికి చెందవలసినదీ రాసివుంచేను దీనిలో.' అని తన వీలును తీసి చదువుమని నా చేతి కిచ్చాడు. ప్రతిమతండ్రి చౌదరీ వకీలని నీ వెరుగుదువు. ఆయన చదివితే సరిగ్గా వుందో లేదో చూడగలరని ఆయన కందచేయబోయాను గాని ఛెటర్జీదాదా నన్నే చదవమని ప్రోత్సహించాడు. అప్పుడు ఛెటర్జీ,చౌదరీ లిద్దరూకూడా నావంక అదోమాదిరిగా చూడసాగేరు. దానిలో రాసివున్నది చూసేటప్పటికి నాసుందె నీరయిపోయింది. అప్రయత్నంగా ప్రతిమ వంక చూచాను. పూర్తిగా చదవమని ఛెటర్జీ నాబుజము తట్టేడు. దానిలో వున్న దేమిటంటే— అతనికి వేరే సంతతిగాని, వారసులుగాని లేకపోవడంచేత అతని యావదాస్తీ ప్రతిమకి ఒకే ఒక షరతుమీద రాసి

యిచ్చినట్టూ, ఆ పైన, ప్రతిమ ఆజన్మాంతమూ అవివాహితగా వుండిపోవాలనీ, ఒక వేళ ప్రతిమ వివాహము చేసుకుంటా అంటే, ఆమెకు చిల్లిగవ్వకూడ దక్కకుండా ఆ ఆస్తంతా శేరంపూరు అనాథశరణాలయానికి చెందవలసిందనీ రాసివుంది.

"ప్రతిమముఖభావాలు నాకు సరిగా కనిపించలేదు. నాకు మాత్రం పిడుగుపడ్డట్టే అయింది...... నేను సంతకం పెట్టక తప్పిందికాదు. అనంతరం ఎవరి గదుల్లోకి వారు వెళ్లిపోయినాము. నేను పరిపరివిధాల ఆలోచనలతో నిద్దరపట్టక దొర్లుతున్నాను పరుపుమీద. ప్రతిమకూ, చెనర్జీకీ ఏలాటి బంధుత్వమూ ఉన్నట్టు నాకిదివరకు తెలీదు. ఆమె వివాహం చేసుకుంటే నేడో రేపో చావనున్న అతనికి వచ్చిన ఫుట్టిమునక యేమిటో సరిగా అర్థమవలేదు.

"తలుపు తెరుచుకొని చెనర్జీదాదా గదిలో ప్రవేశించగానే నా ఆలోచనలకి భంగము కలిగింది. పరుపుదిగి ఒక కుర్చీలో కూచున్నాను. అతనూ ఆదగ్గరగా వున్న ఇంకో కుర్చీలో ఆసీనుడయి 'వినోద్ బాబూ, నీ విచారకారణము నాకు తెలుసు. నేను చేసిన ఈ పని ప్రతిమశ్రేయస్సుకొరకే అని నీవు నమ్మాలి. ఇదొ యిరువురి ప్రేమగాథా నేను విన్నాను. ఈ మీ వివాహానికి ఒక పూర్వశాప ముంది. అందుకే నిన్ను కూడ సాక్షిసంతకానికి పిలిచాను. నీ కీరాత్రి నా చిన్నప్పటి విషయ మొకటి చెప్తాను. నే చెప్పిన కథనంతా విన్నతర్వాత నే చేసినపని నీవు హర్షించి తీరుతావని నానమ్మకము' అని చెనర్జీదాదా తన కథనిలా చెప్ప మొదలుపెట్టేడు:

"'నేనూ చిన్నప్పుడు ఒక పిల్లను ప్రాణపదంగా ప్రేమించాను. ఆమెపేరుకూడా ప్రతిమే. ఆమె నా మేనత్త కూతురు. మా మేనత్త ఆమెభర్తకి రెండవ భార్య. మొదటిభార్య ముగ్గురు కొడుకులను కని చచ్చిపోయింది. మా మేనత్తకు ప్రతిమ ఒక్కతే సంతానము. మా తలిదండ్రులు నాచిన్నప్పుడే చనిపోవడంచేత నేను మా మేనత్త దగ్గిరే పెరుగుతుండేవాణ్ణి. వారి కుటుంబము మూర్షిదాబాదులోని గొప్పకుటుంబాల్లో ఒకటిగా నుండేను. కాని చివరరోజుల్లో మా మేనత్త మొగుడు దుర్వ్యసనాల్లో పడి ఆస్తినంతా పాడుచేసి తను వ్యాధిగ్రస్తుడై మరణించాడు. భర్త పోయిం తర్వాత మా మేనత్తస్థితి మరీ హీన మయిపోయింది. మొదటిభార్యసంతానము మామగ్గుర్నీ చాలా నీచంగా చూడ మొదలు పెట్టేరు. మా మేనత్త మరి సహించలేక మూర్షిదాబాదు వదలి, తనవంటిమీదున్న నగ లమ్మి, ఆ దగ్గిర నేవున్న కండీ అనే ఒక పల్లెటూరిలో చిన్న భూమి కొని, అక్కడ సేద్యముతో కాలక్షేపము చేయసాగింది. నేనూ, ప్రతిమాకూడ ఆమెకు సహాయం చేస్తూండేవాళ్లము. ఆ పల్లెటూరి ప్రశాంత జీవనంలో ప్రతిమతో ఎంతో స్వేచ్ఛగా వుండడానికి నా కవకాశ ముండేది. ఆ రోజులను తలచుకుంటే—' చెనర్జీదాదా కొంతసేపు ఆగి కళ్లు తుడుచుకొని గొంతు సవరించుకొని మరల ప్రారంభించాడు: 'అప్పటికి నాకు పందొమ్మిది ఏళ్ల వయసు. ప్రతిమ నాకన్న అయిదేళ్లు చిన్నది. ఒకనాడు మా మేనత్త చింతాక్రాంతురాలయి నన్ను పిలచి 'నాయనా, మనకి నానాటికీ జీవనం చెయ్యడం చాలా కష్టమయిపోతున్నది. నీవూ పెద్దవాడి వయ్యావు. ఎక్కడయినా ఉద్యోగం సంపాదిస్తేగాని మరి గడవడం కష్టము. కలకత్తాలో నాపినతల్లి కుమార్తె ఒకతె వుంది. ఆమెభర్త గిరిజాశంకర్ ఘోషుకి అక్కడ ఏదో పెద్ద ఓడవర్తక ముంది, రంగూను కలకత్తాలమధ్య. నే నొక ఉత్తరం రాసియిస్తాను. అది చూపితే ఆమె తప్పక ఆదరించి నీ కుద్యోగం యిప్పిస్తుంది. రెండు మూడు ఏళ్లలో నీవు కొంత సొబ్బు చెయ్యవచ్చు. అప్పుడు నీవు తిరిగి వస్తివా నా కూతురు ప్రతిమను నీకిచ్చి వివాహం చెయ్యడానికి నా కేమీ అభ్యంతరంలేదు' అంది. నేనూ ఆలోచించాను. ప్రతిమను వదలివెళ్లడం కష్టమనిపించినా అప్పటి కంతకన్నా వేరు కర్తవ్యం కనిపించలేదు నాకు. ఉద్యోగంలేనిదే ప్రతిమను ఎల్లా పోషించగలననికూడా తోచింది. వెంటనే బయలుదేర సిద్ధమయ్యాను, మూటా ముల్లే కట్టి. నా ఉత్సాహానికి మా మేనత్త చాలా సంతోషించి నాకు తోవఖర్చుల కని మూడువందల రూపాయలూ, ఒక బంగారు హారం యిచ్చింది. ఆ హారము మా అమ్మదట. తనవద్ద దాచుకున్నదనీ, నేను పెద్దయితే నాకిచ్చి వేయమన్నదనీ

చెప్పింది. ప్రతిమ నే వెళిపోతున్నప్పుడు ప్రేమ పురస్సరంగా అడిగింది—'సతీశ్, వచ్చినపుడు నాకోసమేదయినా తెస్తావుకదూ?' అని. తప్పకుండా తెస్తానని చెప్పి నేను అప్పటికి మా అమ్మ బంగారుహారం ఆమె మెడలో వేసి జ్ఞాపకంగా వుంచుకోమన్నాను. ఆమె ఆ హారాన్ని ప్రాణపదంగా దాచుకుంటానని హామీ యిచ్చింది.

"'మా మేనత్త ఉత్తరము రాగానే పనిచేసింది. నా స్థితికి విచారించి ఘోషుబాబు అతనికింద నాకొక చిన్నపని ఇప్పించాడు. మూడునెలలు గడచిన తర్వాత రంగూనులోని అతని ఏజెంటు చనిపోయాడని తెలిసింది. నేను నమ్మకంగా పనిచేస్తూండడం చూసి ఘోషుబాబు నన్ను అక్కడ ఏజెంటుగా వుండమని నియమించాడు. బర్మాలో అనేక పెట్రోలు కంపెనీలలో అతను వాటాదారు. ఆ కంపెనీల వ్యవహారాలు అతని బదులు నేను చూడవలసివచ్చింది, అతని రిప్రజెంటేటివ్ గా.

"'ఒక ఏడాది గడచింతర్వాత ఒకనాడు ప్రతిమ నుండి ఒక ఉత్తరం వచ్చింది. మా మేనత్త చనిపోయినట్టున్నా, నేను గాభరాపడి రావలసిన అవసరం లేదనీ, తనవద్ద ప్రస్తుతం తనతండ్రి దూరపుచుట్టమెవరో ఒక ముసలావిడ వున్నదనీ వుందా ఉత్తరంలో. నేను చాలా విచారించాను చిన్నతనంలోనే ప్రతిమకు యెటువంటి కష్టములు వచ్చాయా అని.

"'రెండేళ్లలో బర్మాలో చాలా మట్టుకు డబ్బు గడించాను. బర్మా దేశంలో ఆ రోజుల్లో హిందువులంటే ద్వేషభావం లేదు. రెండేళ్లు పూర్తికాగానే నాకు స్వదేశం రావాలని కోరిక పుట్టింది. ఘోషు బాబుఅనుమతిమీద ఒకనాడు ఓడలో కలకత్తాకు ప్రయాణమయ్యాను. నేను వెళ్లిపోతున్న రోజున బర్మాదేశపు వర్తకులంతా నా కెంతో సన్మానంచేసి వారి స్నేహచిహ్నంగా కట్నములూ, కానుకలతో నన్ను గౌరవించారు. అవన్నీ ప్రతిమ కిద్దామని నిశ్చయించుకొని, ఆమె అవన్నీ చూసి ఎంత ఆనందిస్తుందో కదా అని గాలిమేడలు నిర్మించుకుంటూ సంబరపడ్డాను. నేను కలకత్తానుండి మూర్షిదాబాదు వచ్చే సరికి ఆ ప్రాంతాల్లో కలరా జోరుగా వున్నట్టు తెలియవచ్చింది. నాగుండె ప్రతిమకై తత్తరపడ సాగింది. నేను అతిత్వరగా మా గ్రామానికి చేరుకున్నాను. అప్పటికి చాలారాత్రి అయింది. మంచి వెన్నెల కాస్తూంది. ఉద్వేగంతో కొట్టుకుంటూన్న గుండెతో మా యింటిని సమీపించాను. మా యింటి ముందున్న మఱ్ఱిచెట్టుకింద ఒక నులకమంచంపై పడుకొనివున్న ఒక స్త్రీమూర్తి నాకంట బడింది. ఆమె పొడుగుపాటిజుత్తు మంచంమీదినుండి కిందకు వ్రేలాడుతూ కొంతభాగం నేలమీదకూడా పడివుంది. నేను దగ్గరికి వెళ్లి చూచాను. నా ప్రతిమే. కాని నే నక్కడ చూచిన దృశ్యంతో నాగుండె ఆగిపోయినట్టయింది. ఆమెపక్కనే ఒక పసిబాలుడుకూడా పడుకొని వున్నాడు. నా ప్రాణాలు స్తంభించిపోయినాయి. హృదయంలో విషబీజం నాటుకుంది. ఎంత మోసకత్తె! స్త్రీల నిందుకే నమ్మరాదన్నారు అనుకొని ఆ పసిబాలుణ్ణి దగ్గరనుండి పరీక్షింపవలెనని కొంచెము దగ్గరికి వెళ్లి ముందుకువంగి చూచాను. ఆ బాలుని రూపు సరిగా ప్రతిమనే పోలివుంది. ఇంతలో నాకాలికింద ఆమెజుత్తు పడి ఆమెకు మెలకువ వచ్చింది. ఆమె కళవళపడుతూ లేచి 'సతీశ్ — ఎన్నాళ్లకు —' అంటూ ముందుకు రాబోయి నా వాలకం చూచికాబోలు, పాపం, జంకి అల్లాగే నిలువబడిపోయింది. 'ప్రతిమా, ఈ బాలు డెవరు?' అని గంభీరంగా ప్రశ్నించాను. 'ప్రస్తుతం నాబిడ్డడే అవాలి' అన్న దామె పసివానివంక చూస్తూ. గుండె ఝల్లుమంది. వెంటనే వచ్చిన మార్గం పడదామనుకున్నాను. కాని తుదివరకూ ఆమె చేసిన పాపం ఆమె నోటినుంచే వినదలచి 'తండ్రి ఎవరు?' అని తీవ్రంగా ప్రశ్నించాను. 'తండ్రివిషయ మంతగా తెలియదు. అతని నొక్కసారే కలుసుకున్నాను. అదయినా రాత్రి చీకట్లో. అటుపిమ్మట అతని జాడ నాకు తెలియలేదు' అంటూ ఆమె ఆ పసివానిని ఎంతో ఆప్యాయంగా తీసి ఎత్తుకుంది. నాకు వళ్లు మండుకోపోతూంది. ఎంత నిర్లక్ష్యంగా మాటాడుతున్న దనుకున్నాను. చివరకి మరి కోపం పట్టలేక 'ఎంత సిగ్గుమాలినదానివే! కులానికి కళంకం తెచ్చావు. ఇన్నాళ్లూ నిన్ను

ప్రేమించి మోసపోయాను. నీకోసం ఎంతో ఆశతో ఎన్నో నగలూ నాణెములూ తెచ్చాను. అతిసంబరపడినందుకు పూర్తిగా ఆశాభంగమయింది.' అని తీవ్రంగా అన్నాను. ఆమె నామాటలు విని నిర్ఘాంతపోయింది. 'సతీశ్! నీమాట లేవో విపరీతంగా వున్నాయి—' అని కొంతసేపు నోట మాట లేక మళ్లీ యిట్లు చెప్ప ప్రారంభించింది. ఈలోగా, ఏమిసాకు చెబుదామా అని ఆలోచించుకుందని నా నమ్మకం. 'సతీశ్! ఈశ్వరసాక్షిగా చెబుతున్నాను. నాకీబాలుడు నిన్ననే లభించాడు. ఇక్కడ కలరా చాలా వుపద్రవంగా వుంది ఇన్నాళ్లూ. మా అవ్వకూడా పదిహేను రోజులక్రితం కలరా తగిలి చనిపోయింది. నాకింకో దిక్కులేక, వేరే పనిలేక, నిన్ను రమ్మని రాద్దా మనుకున్నాను గాని ఈ కలరారోజుల్లో ఎందుకని మళ్లా వూరుకున్నాను. అప్పుడప్పుడు ఈ చుట్టుపక్కలనున్న గ్రామాలకు వెళ్లి అచ్చటి రోగులకు చికిత్సచేస్తూ యిరుగు పొరుగువారు తీసుకోవలసిన జాగ్రత్త మొదలయినవి బోధిస్తూ కాలం గడుపుతున్నాను. నిన్న దూరగ్రామంనుండి ఒక రోగిని చూచి వస్తూండగా తోవలో పెద్దవర్షం పడింది. తలదాచుకుందుకని ఒకయింటి చూరుకింద దూరాను. ఆ యింటివారు కలరాభయంకొద్దీ కాబోలు ఆ గ్రామం వదలి వెళ్లడంవల్ల యిల్లంతా నిర్మానుష్యంగా వుండెను. ఇంతలో ఎదురుగావున్న ఇంకొక యింటినుండి ఆ వర్షపు హోరుని చీల్చుకుంటూ ఒక ఏడుపు వినవచ్చింది. కంఠస్వరం పురుషుని దయి వుండడం నాకు కొంత ఆశ్చర్యం కలిగించింది. ఎప్పటికీ ఆ ఏడుపు తగ్గకపోగా వెళ్లి అదేదో కనుక్కుందామని ఆ యింట్లో ప్రవేశించాను. లోన నలభైసంవత్సరాల పురుషుడు ఒక చంటిపిల్లణ్ణి పట్టుకొని దుఃఖిస్తూండడం చూశాను. ఆ గదిలో వున్న గుడ్డిదీపపు వెలుగులో అతనిపక్కనే ఒక స్త్రీశవం పడివుండడం కూడా చూశాను. అతను ఆమెభర్త అయివుంటాడు. ఆ స్త్రీని తలుచుకుంటూ కాబోలు 'శైలబాలా, శైలబాలా, నీ యెడ[ల] నే చేసిన అత్యాచారానికి తగిన ఫలం అనుభవిస్తున్నాను ... ఈ బిడ్డడుకూడా నాకు దక్కడం కష్టం కాబోలు ... ఇప్పటికయినా నన్ను క్షమించమని వేడుకుంటున్నాను.' అని విలపిస్తున్నాడు. అతడు నన్ను కొంతసేపు తేరిపారచూచి, 'వచ్చావా? శైలబాలా, వచ్చావా? ఇంద ... తీసుకో ... యీ బిడ్డణ్ణి ... నావద్దనుంటే—' అతని గొంతుక కొంచెం రుద్ధమయింది. 'నావద్దనుంటే ఇంకో పద్ధెనిమిది నెలలేగా!' అంటూ ఈ బిడ్డణ్ణి నాకు అప్పగించాడు. అతని కెవ్వరూ వేరేదిక్కు లేరు కాబోలనుకొని ఆ పిల్లణ్ణి పుచ్చుకుంటూ నేను తన శైలబాలను కాననీ, నా పేరు ప్రతిమ అనీ చెప్పేను. కాని అతడు ససేమిరా వినలేదు. 'నువ్వు నన్ను క్షమింపవచ్చిన ఆ శైలబాల ఆత్మవయుంటావు. లేకపోతే ఈ నిర్జన గ్రామంలో నీకీయింటికి రావలసిన పని యేమి? నువ్వు శైలబాలఆత్మవే. సందేహం లేదు. వీడు నీ బిడ్డడే. ఇప్పటికయినా నన్ను పూర్తిగా క్షమించి, నీబిడ్డణ్ణీ తీసుకోపో' అని కళ్లు మూసుకొని దుఃఖిస్తున్న అతన్ని చూస్తే నాకు జాలి వేసింది. ఈలోగా వర్షంకూడా తగ్గడంచేత నే నీ బిడ్డణ్ణి తీసుకొని ఈ గ్రామం వచ్చేశాను. అంతే గాని నాకు మరేమీ తెలీదు' అని ప్రతిమ తన కథను పూర్తి చేసింది. నా కేమీ నమ్మకం తోచలేదు. అంతా కట్టుకథలాగు కనిపించింది. ఇంతలో నాదృష్టి ఆమె మెడమైన పడింది. నేనిచ్చినహారం కనిపించలేదు. మెడ శూన్యంగా వుంది. 'ప్రతిమా, నేనిచ్చిన బంగారుహార మేదీ?' అన్నాను. ఆమె చకితురాలై మెడ తడుముకొని 'అరె! నిన్నటికి వుండెనే, ఎక్కడికి పోయింది చెపుమా!' అని వెదుక జొచ్చింది. నా కంతా నటనగా తోచింది. నేను వికటంగా నవ్వి, 'ప్రతిమా, ఇహ మరి లాభం లేదు. అంతా తెల్లమయింది. ఈ బాలుడి రూపు చూస్తున్నకొద్దీ అచ్చం నీరూపులాగే కనిపిస్తున్నది. నన్నింకా లేనిపోని కట్టుకథలతో ఎందుకు మోసంచేయజూస్తావు? ఇప్పటికయినా మేలుకున్నానని సంతోషిస్తున్నాను ... ఇహ నాదారి నాది, నీదారి నీది' అని గిరుక్కున తిరిగిపోయాను. 'ఆఁ. ఆఁ. సతీశ్!' అని ఆమె వెంటబడ్డది కాని ఆమెను విడిపించుకొని కిందకు నెట్టివేసి వచ్చిన మార్గం పట్టేను. కలకత్తా చేరుకున్న తర్వాత ఘోషబాబు మరల నన్నాదరించి తన భాగస్వామిగా చేర్చు

కున్నాడు. అక్కడే చాలాకాలం పనిచేసి ఈ ఆస్తినంతా గడించాను. అప్పుడప్పుడు ఈ ఆస్తి అంతా ఎవరికోసమో అని నాలో నేనే ఖేదపడుతుంటాను. ప్రతిమ చేసిన మోసంవల్ల నాకు స్త్రీజాతి అంతటిమీదా విరక్తి పుట్టి మరి వివాహమాడ యిచ్ఛ లేకపోయింది.

"'ఇలా నలభై సంవత్సరాలు వెళ్ళిపోయినాయి. నేను ప్రతిమని పూర్తిగా మరచిపోయినా ననే చెప్పవచ్చు. ఒకనాడు నా కొక రహస్యం తెలియకపోయివుంటే నేను ఈ కథనంతా నీకు చెప్పవలసిన అవసర ముండెకపోను' అని బెనర్జీదాదా ఒక్క నిముష మూరకుండి మళ్ళా ప్రారంభించాడు:

"'నేను చేసిన ఆస్తితో ఎక్కడయినా మంచి యిల్లు కట్టి పక్కనే కొన్ని భూములు కొని నాజీవిత శేషం విశ్రాంతి పుచ్చుకోదలచాను. ఈలోగా ఘోషు బాబు మరణించాడుకూడాను. అతని వ్యవహారమంతా అతని నలుగురుకొడుకులూ చూస్తున్నారు. ఈ శెరంపూరువద్ద ఒక వితంతువు తన భూములను అమ్మజూపుతున్న దని విని ఇక్కడ ఆమెభూములన్నీ కొని ఈ యిల్లు నిర్మించి, కలకత్తాలో నావాటా అమ్మివేసి ఇక్కడకు వచ్చేశాను. ఇక్కడికివచ్చి సుమారు అయిదు సంవత్సరాలు అయివుంటుం దంతే. ఈ పరిసర ప్రాంతాలు నాకెంతో ఆనందదాయకంగా వుండడంచేత సుమారు ప్రతీరోజూ నా గుఱ్ఱపుబండిమీద నాభూములన్నీ చూసివస్తూంటాను. ఈ పల్లెటూరి జీవనమందలి అభిలాష మా మేనత్త పెట్టిన భిక్షే. నాభూములను చూస్తూన్నప్పుడు నలభైయైదు సంవత్సరాలకిందట నేనూ, ప్రతిమా పొలముగట్లలో ఎంతో ఆనందంగా గడిపిన రోజులు జ్ఞాపకానికి వచ్చి హృదయం ద్రవించుకొనిపొయ్యేది.'

"బెనర్జీదాదా కంఠము కొంచెము డగ్గుత్తిక పడ్డంవల్ల కొంతసే పూరుకొని కంఠము సవరించుకొని మరల ప్రారంభించాడు:

"'ఒకనాడు నేను నా భూములనుండి యింటికి తిరిగిరావడం చాలా ఆలస్య మయిపోయింది. చీకటి పడితే ఏదో దెయ్యాలగుట్టవద్ద గుఱ్ఱము మరి నడవదని మా బండివాడు తొందరగా తోలుతున్నాడు. కాని ఆ గుట్టేదో రాకముందే చీకటిపడిపోయింది. కొంత సేపటికి మా గుఱ్ఱపువాడు దిగి నావద్దకు వచ్చాడు చేతులు నులుపుకుంటూ. 'ఏమయిం' దన్నాను. వాడు ఆ దూరంగావున్న ఏవో గుట్టలు కొన్ని చూపుతూ 'అక్కడినుండి ఏదో శబ్దము వస్తున్నాది. గుఱ్ఱము మరి నడవడంలేదు ... తమరు ...... దిగితే ఒక ఫర్లాంగు దూరంవరకూ నడిపించుకొని తీసుకొని వెళ్తాను బండి. ఆ తర్వాత మళ్ళా తమరు రెక్కవచ్చు' నన్నాడు. నాకు దెయ్యమన్నా భూతమన్నా చిన్నప్పటినుండీ బొత్తిగా నమ్మకం లేకపోవడంచేత వాణ్ణి కోప్పడి 'గుఱ్ఱము కదలకపోవడ మేమిటి నీ మొహం. కొరడాతో నాలుగు కొడితే అదే నడుస్తుంది' అన్నాను. కాని కొరడాదెబ్బలకికూడా గుఱ్ఱం నడవకపోవడంవల్ల నేను దిగక వీలయిందికాదు. ఒక ఫర్లాంగు దూరం బండీ వెనుక నేను నడుచుకొంటూ వెళ్లినాను. మా గుఱ్ఱపువాడు చెప్పినట్టు నాకూ ఏదో శబ్దం ఆ గుట్టపైనుంచి వస్తూన్నట్టనిపించింది. వెళ్లి అదేదో కనుక్కుందా మంటే చేతిలో టార్చి లేకపోవడంవల్ల అప్పుడు వీలయిందికాదు. ఆ నాటినుండి ఎప్పుడు భూములమీదికి వెళ్లినా నేను టార్చికూడ తీసుకోపోతుండేవాణ్ణి. ఇంకొకనాడుకూడా అలాగే కొంచెము ఆలస్యమయింది తిరిగిరావడం. వెనకటిలాగే గుఱ్ఱము ఆ గుట్టలవద్ద ఆగిపోయింది. బండివాడు నన్ను దిగమన్నాడు. నేను దిగి నలుప్రక్కలా చూశాను. వెనుకటి సారికన్న యిప్పుడు చాలా గట్టిగా వినవస్తున్న దాశబ్దము. 'లతీఫ్, అదేదో నేను చూసి వస్తాను. నువ్వు బండి నడిపించుకొని వెళ్తుండు' అని టార్చి పట్టుకున్నాను. 'బాబూ! అక్కడ దెయ్యమో భూతమో వుండంటారు. తమరు ఒంటరిగా వెళ్లడం —' అని వాడు అంటూన్నా నేను వాణ్ణి సరకు చెయ్యక బయలుదేరాను, ఆ వింత ఏదో ఆనాడు కనుగొనితీరాలని. ఆ గుట్టల సమీపానికి వెళ్తున్నకొద్దీ అందులోనుండి వస్తున్న శబ్దము మరింత గట్టిగా, స్పష్టముగా వినవస్తూంది. నేను టార్చి సహాయమున ఆ దగ్గరికి వెళ్లి పరీక్షించగా ఆ గుట్టల్లో ఒక చిన్న గుహలాంటి దొకటి కనిపించింది. దానిలోనుంచే శబ్దము వస్తూన్న ట్టనిపించింది. లోన దూరంగా చిన్న వెలుతురుకూడా కనిపి

చింది. నేను ధైర్యంచేసి మెల్లగా అడుగులువేసుకుంటూ లోనికి వెళ్లాను. లోనికి వెళ్తున్నకొద్దీ ఆవెలుతురుకూడా ముందుకే నడుస్తూన్నట్లుండేను. నే నాశ్చర్యంతో ఆ వెలుతురు ననుసరించి పోయిపోయి ఒక చిన్న గదిని సమీపించాను. ఆ గదివద్ద ఆ వెలుతురు పూర్తిగా మాయ మయిపోయింది. నాకు కొంచెం భయం వేసింది. కాని ధైర్యంగా ఆ గదిలోకి ప్రవేశించాను. లోనంతా చాలా దుర్గంధంగా వుండేను. నాటార్చితో నలుమూలలూ పరీక్షిస్తే ఒక మూల మఠం వేసుకొని కూచున్న ఒక అస్థిపంజరం తప్ప నాకు మరేమీ కనపడలేదు. ఇంకో విశేష మేమిటంటే, నే నా అస్థిపంజరమును చూసింతర్వాత, అంతవరకూ వినిపిస్తున్న రోద హఠాత్తుగా ఆగిపోయింది. నేను నలుప్రక్కలా చూశాను. ఎవ్వరూ కనిపించలేదు. అరమైలు దూరంలో వున్న మా సజ్జపువాడు తప్ప ఆ ప్రాంతాల్లో నేనుగాక మరో రెండో ప్రాణి లేదని స్ఫురణకు రాగానే వళ్లు కొంచెం జలదరించింది. కాని అంత దూరంవచ్చి తిరిగి వెళ్లిపోవడ మెందుకని మెల్లగా ఆ అస్థిపంజర సమీపానికి వెళ్లి పరీక్షించాను — దుర్గంధాన్ని సహిస్తూ. కుడిచేయి తొడమీద పెట్టుకొనివుంది; ఎడమచేయిమాత్రం దేనినో పట్టుకొనివున్నట్టుంది. ఆ అస్థిపంజరం ఎవరో పూర్వం సమాధిలో వుండిపోయిన యోగి దయివుంటుం దనుకున్నాను. మరీదగ్గరకి వెళ్లి చూడగా ఎడమచేయి ఒక టిన్ను రేకుడబ్బామీద ఆనించివుంది. ఆడబ్బాలో ఏదో వుండకపోదని నాకు తోచింది. మెల్లగా కదిల్చాను వస్తుందో రాదో అని. కాని శిథిలమయి వుండడంచేత కాబోలు కిందిభాగం సుళువుగా నాచేతిలోకి వచ్చింది. మాతేమాత్రం కంకాళపు ఎడమచేతిసప్పిటిలో వుండిపోయింది. ఆ డబ్బాలో ఒక కాగితాలకట్ట కనిపించింది. అది మెల్లగా విప్పేను. అందులోంచి ఏదో వకటి జారి నాకాళ్లమీద పడ్డది. త్రుళ్లిపడి ఒక్కగంతు వేశాను. కింద టార్చితో చూసేసరికి కాగితపుపొట్లం మొకటి కనిపించింది. అది విప్పిచూసేటప్పటికి నా ఆశ్చర్యానికి అంతు లేదు. అది నేను ప్రతియేటి నలభైసంవత్సరాలకిందట యిచ్చిన బంగారుహారము. నాచేతిలో వున్న కాగితాలకట్ట విప్పిచూస్తే దానిలో పెద్దగాథ కనిపించింది. అక్కడ మరివుండ బుద్ధిపుట్టక పైకి వచ్చేశాను, ఆకాగితాలకట్టనూ, బంగారుహారాన్నీ తీసుకొని.

" 'సజ్జపువాడు నన్ను చూసి ఆశ్చర్యపోయి 'ఎక్కడున్నా రింతసేపు? మీరెంతసేపటికీ రాకపోతే నాకు భయంవేసి ఊనగ్గరవూరివారిని పిలుచుకొని వద్దా మనుకుంటున్నాను గాని హఠాత్తుగా ఆశబ్దం ఆగిపోవడం చూసి ఏంచెయ్యడానికీ తోచక యిలా నిలబడిచూస్తున్నా' నన్నాడు. మరి అప్పటికీ, ఇప్పటికీ ఆఘట్టలదగ్గర ఎంతరాత్రయినాకూడా ఏవిధమైన శబ్దమూ వినపడడం లేదట.

" 'ఇంటికి వెళ్లి, ఆరాత్రే ఆకాగితాలలో వున్న కథంతా చదివాను. దానిలో ఒక ఆత్మకథ యిలా రాయబడివుంది: 'ఈసమాధిలో వున్న నా పేరు కాంతోష్ కుమార్ ఛటర్జీ. నాతండ్రి నగేంద్రనాథ్ ఛటర్జీ. మాకు జెస్సూరువద్ద బునగా మను చిన్న జమీందారీ వుండేది. మా తండ్రి పేరు చెబితే మా జమీందారీలోనే గాకుండా చుట్టుపక్కల గ్రామాలవారుకూడా చాలా భయపడుతూ వుండేవారు. నాకు పద్ధెనిమిదేళ్లవయసప్పుడు మాతండ్రి తన పాపాలఫలితంగా మరణించాడు. నాకు జ్ఞాపకమున్నంతమటుకు జరిగిన దిది. మాభూముల పక్కనే ఉమాకాంతచటోపాధ్యాయ అనే ఒక బీదబ్రాహ్మడి భూమి వుండేను. అది చాలా సారవంతమయినదని విని మాతండ్రి దానిని తనకు అమ్మమని కోరేడు గాని ఆబ్రాహ్మణుడు దానిని అమ్మటకు వప్పుకోనలేదు. దానితో ఆబ్రాహ్మణ్ణి అనేకవిధాల పీడించడం మొదలుపెట్టాడు మాతండ్రి. దానికితోడు చటోపాధ్యాయగారి భార్య చాలా రూపవతిట. ఆమెకై మాతండ్రి చాలా ప్రయత్నించాడట. ఆ మార్గంలోకూడా మాతండ్రికోరిక నెరవేరకపోవడమే గాకుండా ఏదో తీరని అవమానంకూడా చేసిందట ఆయిల్లాలు. దానితో మాతండ్రికి వారి కుటుంబం మీద కక్ష పెరిగి ఒక నాడు రహస్యంగా ఉమాకాంతునీ, వానిభార్యనూకూడ చంపించాడు. ఆగ్రామవాసు లెవరూ మాతండ్రిమాట కెదురాడ సాహసించకపోవడంచేత ఈరెండు హత్యానేరాలూ బయటికి రాలేదు. పాపం! ఉమాకాంతుని ముసలితల్లి ఉమాకాంతుని

ఏకైకపుత్రికయిన తన మనుమరాలితో సహా ఎక్కడికో వెళ్లిపోయింది, మరి ఆగ్రామంలో వుండలేక. ఆ తర్వాత ఆరునెలలకే మాతండ్రిదుండగాలని సహింపలేకకాబోలు ఆగ్రామస్థులలో కొందరు కుట్రపన్ని మా తండ్రిని అంతమొందించారు. చిన్నతనంలో జమీందారీ స్వాధీన మవడమే గాకుండా, చిన్నప్పటినుండీ చాలా ముద్దుగా పెరగడంచేత నేను సరిగ్గా మాతండ్రికి కొడుకు ననిపించుకున్నానంటే ఆశ్చర్యంలేదు. మాతండ్రి ఆస్తినంతా విచ్చలవిడిగా ఖర్చుపెడుతూండేవాణ్ని. నేను పెడదార్లుపడడం చూసి మాతల్లి నాకు స్నేహలత అనే అమ్మాయిని తెచ్చి పెళ్లిచేసింది. అయినా తండ్రితాతల నుండి వస్తూన్న ఆబుద్ధి నేను మానలేకపోయాను. పెళ్లి అయిన ఆరునెలలకే నాకు భార్యమీద విరక్తి జనించి గంగ అనే కాపుదాన్ని తెచ్చి యింట్లో పెట్టుకున్నాను. మాతల్లి యెంతో బోధించింది, తండ్రిలాగ అందరి నోట్లో పడ్డానికి యోగముందా యేమిట్రా అని. నా కామాట లేమీ తల కెక్కలేదప్పుడు. మాతల్లి మరి నావద్ద వుండడాని కిష్టపడక హరిపురంలో వున్న మా మేనమామదగ్గరకు వెళ్లిపోయింది. ఆతర్వాత కొన్నాళ్లకే నాభార్యకూడా మరి భరించలేక పుట్టింటికి పారిపోయింది. మరికొన్నాళ్లయింతర్వాత గంగ వుండివుండి ఓ రాత్రి మా పెద్దకాపుకొడుకుతో లేచి పోయింది. నాకు ఏంతోచక మాతల్లివద్దకు వెళ్లి అటు వంటి చిలిపిపను లేవీ మరి చెయ్యనని నావెంట తిరిగి రమ్మన్నాను. కాని మా మేనమామ ఆమెను నావెంట పంపడాని కెంతమాత్రమూ ఇష్టపడలేదు. అక్కడే నన్ను కొన్నాళ్లుండమన్నాడు, నేను బాగుపడతానేమోనని. అంచేత నేను కొన్నాళ్లు హరిపురంలోనే వుండవలసి వచ్చింది. అక్కడ క్రమంగా నాకు కొంతమంది కుర్రాళ్లతో పరిచయం యేర్పడింది. మేమంతా ప్రతిరోజూ నదిఒడ్డుకి వెళ్లి తిరిగివస్తూండేవాళ్లం. ఒకనాడు తోవలో బ్రహ్మాండమయిన వర్షం కురియమొదలు పెట్టింది. మాకు తలదాచుకుంది కెక్కడా చోటు కనిపించలేదు. అప్పుడు మా మిత్రుడొకడు ఆ దగ్గరనే పువ్వు లమ్ముకుంటున్నవారి కుటీర మున్నదని అక్కడికి దారితీశాడు. అంతా అక్కడికి పరుగెత్తాము. అక్కడ అనేకరకములయిన కూరగాయలపాదులు, పువ్వులచెట్లు గల ఒక తోట కనిపించింది. ఆ కుటీర ద్వారంవద్ద ఒక పదహారేళ్లయువతి నిలువబడివుంది. మోములో విషణ్ణ భావం గోచరిస్తూంది. ఆ యింటికి దారితీసిన మిత్రుడు ఆమెను ప్రశ్నించాడు 'ఏమి శైలబాలా! ఎలాగున్నావు?' అని. ఆమె మెల్లగా జవాబు చెప్పింది, తన ముసలి నాయినమ్మకి మళ్లీ జ్వరము హెచ్చయినదనిన్నీ, తన కేకో జెంగగా వున్నదనీ. అంతా చాలా విచారించారు. నాకు మిత్రులవల్ల తెలిసింది— ఆమె, ఆ ముసలినాయినమ్మతప్ప వారికి మరెవ్వరూ లేరనీ, పాపం దినముజరుగక కూరగాయలూ, పువ్వులూ అమ్ముకుంటూ జీవిస్తున్నారనీ. నా కేమిటో ఆ పిల్లని చూస్తే ఎంతో జాలివేసింది. నన్నోవిధంగా ఆకర్షించిం దనికూడా చెప్పాలి. వర్షం తగ్గింతర్వాత అంతా ఎవరియిళ్లకు వారం వెళ్లిపోయాము. ఆ మర్నాడు పొద్దుట నేను ఒంటరిగా బయలుదేరాను ఆ కుటీరానికి. ఆ పిల్లని మళ్లీ మళ్లీ చూడాలని వుంది. ఆ కుటీరం సమీపం లోనే నా కోర్కె ఫలించింది. ఆమె అప్పుడే నదికి వెళ్లి బుజంమీద కుండతో నీరు తెస్తున్నది. నేను కలుసుకొని పలుకరించాను, ఆమె నాయినమ్మ కెలాగుందని. కొంచెము నింపాదిగావున్నదన్నతర్వాత 'నాకు మంచి పువ్వులు కావాలి' అని జేబులోనుండి రెండు రూపాయి లిచ్చాను. ఆమె ఆశ్చర్యపోయి 'రెండు రూపాయిలవా? అన్ని లేవే. ఇంతకూ పగలొచ్చారేమి, సాయంత్రంరాకుండా' నంది. నాకు జవాబు చెప్పడాని కేమీ తోచలేదు. 'సాయంత్రమే వస్తాను. మీనాయినమ్మ కెలాగుందోనని యిప్పుడు వచ్చానంతే. ఈ రూపాయి లుంచు' అని ఆమెచేతిలో పెట్ట బోయాను. కాని ఆమె 'ఒకపావలావికన్నా హెచ్చు రావడం కష్టము. ఎలాగ' అంది. నేను మరేమీ తోచక 'ఎన్నవుతే అన్నే ఆయెను. మిగతాసొమ్ము మీ నాయినమ్మకి మందుకనీ మాకుకనీ వుంటుందివుండనీ' అని చెప్పి ఆరూపాయి లామెచేతిలో పడేసి వెళ్లి పోయాను. 'ఆ సాయంత్రం నాకు వెళ్లడానికి - మా స్నేహితులమూలంగా—వీలయిందికాదు. ఆ మర్నాడు మళ్లీ వెళ్లాను. ఆమె నన్ను చూచి 'ఏమండీ నిన్న సాయంత్రం రాలేదేమి? మా తోటలోని పువ్వులు

కాక మిగతావారి తోటలలోవికూడా మీ రిచ్చిన పైసాతో కాని మీకోసం దండలుకట్టి వుంచానే, నిష్కారణంగా అన్నీ వాడిపోయాయి' అని విచారించింది. నాకు హఠాత్తుగా నోటినుండి వచ్చేసింది: 'నువ్వు తల్లో పెట్టేసుకోలేకపోయినావా?' అన్నాను. ఆమె తెల్లబోయి నావంక జూసి 'మీవా?' అంది. ఆమె అమాయకత్వం నన్ను మరింత ముగ్ధుణ్ణి చేసింది. ఆ పిల్ల నామంచితనానికి ఆశ్చర్యపడబోచ్చింది. ఈ విధంగా మా పరిచయం క్రమంగా యెక్కువయింది. నే నొకనాడు ధైర్యంచేసి నా యిచ్ఛని ప్రకటించాను. నేను జమీందారుణ్ణనీ, తన దరిద్రబాధ వదలిపోతుందనీ నచ్చచెప్పాను. ఆమె కొంత సేపటివరకూ నిర్ఘాంతపోయి ఆ తర్వాత తలవంచుకొని మెల్లగా 'మా ముసలినాయినమ్మని వదలి—' అనబోయింది. నేను వెంటనే అందుకొని 'మీ యిద్దరూ కూడా నాదగ్గర వుండవచ్చు' అన్నాను. ఆమె తలయెత్తి ఆశ్చర్యంతో నావంకజూసి లోనికి పరుగెత్తింది. లోనుండి అప్పుడే నామాటలని విని కాబోలు ముసలిది కర్రతట్టుకొని వంగినడుస్తూ వస్తూంది. ఆమె నన్ను ఎగాదిగా చూసి 'నాయినా, నా అభ్యంతరం ఏమీ లేదు కాని నీపే రేమిటో, మీ గ్రామమెక్కడో కొంతదూరమైనా ఏమీ చెప్పేవుకావు' అంది. నే నామె కోరినట్టుగా నావూరూ, పేరూ, మాతండ్రి పేరూ తెలియబరచి ఎంతో ఆశతో ఆమెవంక చూస్తున్నాను. ఆమె హఠాత్తుగా 'ఆఁ!' అని అరచి కొయ్య అయిపోయింది. ఆ మరుక్షణమే శైలబాలచెయ్యి పట్టుకొని చరచర లోనికి కీడ్చుకొనిపోయి 'మీ తండ్రి చేసింది చాలక నా నాయినా మావెంటపడ్డావు?' అని దభాలున తలుపు వేసేసింది. శైలబాల 'ఆ కేమిటి నాయినమ్మా' అని ప్రశ్నించింది కళవళపడుతూ. 'నీ తండ్రినీ, తల్లినీ పొట్టలో పెట్టుకున్నవాడి కొడుకు నా పెళ్లాడుతావు సిగ్గులేక' అని గదమాయించింది ముసలిది. అప్పుడు నా కర్థమయింది వా రెవరో. నేను తలవాల్చుకొని తిరిగిపోతూంటే శైలబాల ముసలిదానితో వాదిస్తుండడం వినిపించింది. 'తండ్రి చేసిన అత్యాచారానికి కొడుకెలా బాధ్యుడవుతాడు నాయినమ్మా' అంది శైలబాల. దానికి ముసలామె ఏమి జవాబు చెప్పిందో నాకు వినిపించలేదు. నేను హతాశుడనై యిల్లు చేరుకున్నాను. మరి ఆ గ్రామంలో వుండడాని కిష్టంలేకపోయింది. మా మేనమామ నెలాగో వప్పించి మాతల్లిని వెంటతీసుకొని మాజమీందారీ చేరుకున్నాను. ఎంత ప్రయత్నించినా శైలబాలరూపం మరచిపోలేకపోయాను. ఆమెతుదిపలుకులు నా చెవుల్లో గింగురుమంటూనే వున్నాయి. కొన్ని నెలలయింతర్వాత మా మేనమామగారింట్లో ఒక శుభకార్యానికి మళ్లీ హరిపురం వెళ్లవలసివచ్చింది. ఆసాయంత్రం నాకాళ్లు ఆకుటీరం వైపే తీసుకోపోయాయి. ఆ కుటీరద్వారంవద్ద విచారంతో నిలబడ్డ శైలబాల కంటబడింది. నన్ను చూసి ధభ్భున లోనికివెళ్లిపోయింది. నాకు దగ్గరకి వెళ్లడానికి ధైర్యంచాలక అలా తిన్నగా నడచివెళ్లిపోతున్నాను. ఒక వందగజాలదూర మలా నడిచిం తర్వాత వెనక్కు తిరిగిచూడకుండా వుండలేకపోయినాను. నావంకే దీనంగా చూస్తున్న శైలబాల కంటబడింది. వెంటనే కాళ్లు వెనక్కు తిరిగాయి. ఆమెను సమీపించి విచారకారణం మెల్లిగా ప్రశ్నించాను. తన నాయినమ్మ చనిపోయిందనీ, పక్కనున్న రైతు లెవరో తన కుటీరాన్నీ తోటనూ అమ్మమని బలవంతపెట్టేరనీ, తాను వప్పుకోకపోగా అంతా కట్టుగట్టి తనవద్ద ఎవ్వరూ ఏమీ కొనకుండా చేస్తున్నారనీ చెప్పి దుఃఖించింది. నాకు చాలా జాలివేసి మళ్లా ప్రస్తావించాను, నా వెంట వచ్చేయ్యకూడదా అని. ఆమె నావంక చూస్తూ 'తమ కింకా పెళ్లి కాకపోవడం ఆశ్చర్యంగావుంది' అన్నది. అబద్ధ మాడ్డానికి తకుతుకోలేదు నేను. నా కింకా పెళ్లికాలేదన్నాను. 'మీ జమీందారులకి పిల్లలకేం కొదవ? మీరు ఎన్ని పెళ్లిళ్లయినా చేసుకోవచ్చ ననుకుంటాను' అంది. ఆమె ఏవుద్దేశంతో అందో కాని నాకుమటుకు మాతండ్రిదుశ్చర్యలకు దెప్పుతున్నట్టనిపించింది. నేను వెంటనే ఆమెచేతిలో చేయివేసి 'శైలబాలా, నిన్ను తప్ప మరెవ్వరినీ నేను వివాహ మాడనని నీకు మాటయిస్తున్నాను. నన్ను మాతండ్రివంటివానిగా తలుస్తున్నావో యేమిటో' అన్నాను. ఆమాటతో ఆమె తలవాల్చి తన అంగీకారాన్ని సూచించింది. వివాహమయిన రెండుసంవత్సరములు ఏమి

సంతోషంగా వున్నానో అంటే. ఆ తర్వాత ఒకదాని వెనక ఒకటి ఉపద్రవాలు వచ్చిపడ్డాయి. మా కొక పుత్రుడుకూడా కలిగాడు. నాబుద్ధి మళ్లా యెప్పటిలాగ పెడదారులు పట్టసాగింది. ఒకనాడు రేణుక అనే పదహారేళ్ల గొల్లపిల్లని చూసి తహతహలాడాను. శైలబాలకన్నా ఎంతో అందంగా వుండేను, అప్పుడు నా కంటికి. వెంటనే దాన్ని యింట్లో తెచ్చిపెట్టాను. వద్దని శైలబాల ఎంతో మొత్తుకుంటుందిగాని నేను వినలేదు. నేను శైలబాలని పెండ్లాడడం మాతల్లికి యిష్టంలేదు. మా గ్రామంలోని బీదబ్రాహ్మణ కుటుంబంలోని పిల్ల అవడంచేతో, లేక మాతండ్రి మరణానికి ఒకవిధంగా ఆమెతల్లి కారణం అవడం చేతో నాకు తెలియదు. చివరకి రేణుకా, మాతల్లీ ఒకపక్ష మయిపోయి శైలబాలని హింసిస్తుండేవారు. ఈవిషయం నా కప్పుడు తెలీదు. మాయింట్లోని అశాంతికి శైలబాలే కారణమని నాకు తోచి వెంటనే పశుప్రాయుణ్ణై, బాలున్ని నావద్దే వుంచుకొని ఆమెను యింట్లోంచి గెంటేశాను. ఆమె రాళ్లు కరిగేటట్టు మాయింటిముందు ఏడ్చి యేడ్చి, చివరికి నూతిలో పడి మరణించిందని తెలిసింది. కొన్నాళ్లకి రేణుక అప్పటికి రెండు సంవత్సరాల ప్రాయం గల శైలబాలపుత్రుణ్ణి విషంపెట్టి చంపేసింది. వెంటనే నాకు దానిమీద మనసువిరిగి గెంటేశాను. ఆ తర్వాత కొన్నాళ్లకి మా తల్లి నా మొదటి భార్య స్నేహలతని మరల రప్పించింది. ఆమెకు వరుసగా నలుగురు కొడుకులు పుట్టి సరిగా రెండు సంవత్సరాల వరకూ బతికి చనిపోతూవచ్చారు. మా తల్లికీ, నాకూ కూడ అది శైలబాలకి మేము చేసిన అత్యాచార ఫల మనిపించింది. మరికొన్నాళ్లకే మాతల్లీ, నాభార్య స్నేహలతాకూడ మరణించారు. నేను కొన్నాళ్లు దుఃఖంలో వున్న తర్వాత స్నేహితులంతా ప్రోత్సహించి నాకు మరొక పెళ్లి చేయించారు. ఆమెకుకూడా వరుసగా ముగ్గురు కొడుకులు పుట్టి రెండేసియేళ్లవరకూ బతికి చనిపోయారు. అప్పటికి నాకు పూర్తిగా నమ్మకమయింది శైలబాలఉసురు ఊరికే పోలేదని. నా భార్య తిరిగి నాల్గోసారి గర్భం ధరించేటప్పటికి నాకు భయం వేసింది. మిత్రుల సలహామీద ఆమెను అనేక పుణ్యక్షేత్రాలు తిప్ప మొదలెట్టేను. ఆబిడ్డనయినా బతికించుకుందామని నాప్రయత్నం. ఈలోపున నేను జమీందారీ విడచివెళ్లిన అవకాశం చూసుకొని అక్కడున్న మాప్రతిపక్షులు మా జమీందారీలో జరుగుతున్న అన్యాయా లిన్నీ అన్నీ కావని గవర్నమెంటువారికి విన్నపం పెట్టుకోగా వారు మా జమీందారీని స్వాధీనం చేసుకున్నారు. నాకీ విషయం మూర్షిదాబాదు ప్రాంతాల్లో వుండగా తెలిసింది. నేను వెంటనే మాజమీందారీకి వెళ్లడాని కిష్టపడక మూర్షిదాబాదువద్ద వున్న ఒక గ్రామంలో మా రైతొకడు వుంటే వానిదగ్గర కొన్నాళ్లలా వుండిపోయాను. అక్కడ నా భార్య ఒక మొగ శిశువుని కన్నది. ఆతర్వాత సుమారు ఆరునెలలు అక్కడుండిపోయాను. కొన్నాళ్లకు మా దురదృష్టంకొద్దీ ఆ గ్రామంలో వుపద్రవమయిన కలరా ప్రారంభించింది. మాముసలి రైతు పాపం కలరాతగిలి చనిపోయినాడు. ఆ గ్రామస్థులందరూ కలరాభయంచేత దూరగ్రామాలకు పారిపోయారు. ఒకనాటిరాత్రి నా భార్యకు కలరాచిహ్నాలు కన్పించాయి. ఆరాత్రి మారైతుకుటుంబం మాతో చెప్పకుండానే పారిపోయా రేదో గ్రామానికి. నాకు ఏమీ తోచలేదు. ఆ గ్రామం నిర్జనమవడం చేత తగిన మందు యిప్పించడానికి కూడా వీలు లేకపోయింది. నాభార్య ఆ రెండవరోజున చనిపోయింది. నా కన్నిపక్కలా దావానలము చుట్టుకున్నట్టయింది. ఆ రాత్రి నేను పడిన దుఃఖమునకు మితిలేదు. ఎవ్వరూ దిక్కు కనిపించలేదు. ఆగర్భ శ్రీమంతుణ్ణి. నాపాపఫలంవల్లనే నాకీగతి పట్టిందని పూర్తిగా నిశ్చయమయిపోయింది. మనసారా శైలబాలఆత్మని వేడుకున్నాను, అప్పటికయినా నామీద కసిమాని నన్ను క్షమింపమని. ఇంతలో ఎవరో పదహారేళ్ల ప్రాయముగల యువతి వచ్చి నాముందు నిలబడింది. పైన చాలా జోరుగా వర్షం పడుతుండగా, ఈ నిర్మానుష్య మయిన ప్రదేశంలో ఈమె యెటుల రాగలిగిందా అని ఆశ్చర్యపడ్డాను. ఆమెఆకారమూ, అంగసౌష్ఠవమూ మూడు మూర్తులా శైలబాలనే పోలివున్నాయి. నాప్రార్థనల నాలకించివచ్చిన శైలబాలఆత్మ అని నేను నిశ్చయించుకున్నాను. ఆమెకు నాబిడ్డణ్ణి అప్పగించాను. నా

సంతోషంగా వున్నానో అంతే. ఆ తర్వాత ఒకదాని వెనుక ఒకటి ఉపద్రవాలు వచ్చిపడ్డాయి. మా కొక పుత్రుడుకూడా కలిగాడు. నాబుద్ధి మళ్లా యెప్పటిలాగ పెడదారులు పట్టసాగింది. ఒకనాడు రేణుక అనే పదహారేళ్ల గొల్లపిల్లని చూసి తహతహలాడాను. శైలబాలకన్నా ఎంతో అందంగా వుండెను, అప్పుడు నా కంటికి. వెంటనే దాన్ని యింట్లో తెచ్చిపెట్టాను. వద్దని శైలబాల ఎంతో మొత్తుకుంటిగాని నేను వినలేదు. నేను శైలబాలని పెండ్లాడడం మాతల్లికి యిష్టంలేదు. మా గ్రామంలోని బీదబ్రాహ్మణ కుటుంబంలోని పిల్ల అవడంచేతో, లేక మాతండ్రి మరణానికి ఒకవిధంగా ఆమెతల్లి కారణం అవడంచేతో నాకు తెలియదు. చివరకి రేణుకా, మాతల్లీ ఒకపక్ష మయిపోయి శైలబాలని హింసిస్తుండేవారు. ఈవిషయం నాకప్పుడు తెలీదు. మాయింట్లోని అశాంతికి శైలబాలే కారణమని నాకు తోచి వెంటనే పశుప్రాయుణ్ణై, బాలున్ని నావద్దే వుంచుకొని ఆమెను యింట్లోంచి గెంటేశాను. ఆమె రాళ్లు కరిగేటట్టు మాయింటిముందు ఏడ్చి యేడ్చి, చివరికి నూతిలో పడి మరణించిందని తెలిసింది. కొన్నాళ్లకి రేణుక అప్పటికి రెండు సంవత్సరాల ప్రాయంగల శైలబాలపుత్రుణ్ణి విషంపెట్టి చంపేసింది. వెంటనే నాకు దానిమీద మనసువిరిగి గెంటేశాను. ఆ తర్వాత కొన్నాళ్లకి మా తల్లి నా మొదటి భార్య స్నేహలతని మరల రప్పించింది. ఆమెకు వరుసగా నలుగురు కొడుకులు పుట్టి సరిగా రెండు సంవత్సరాల వరకూ బతికి చనిపోతూవచ్చారు. మా తల్లికీ, నాకూ కూడ అది శైలబాలకి మేము చేసిన అత్యాచార ఫలమనిపించింది. మరికొన్నాళ్లకే మాతల్లీ, నాభార్య స్నేహలతాకూడ మరణించారు. నేను కొన్నాళ్లు దుఃఖంలో వున్న తర్వాత స్నేహితులంతా ప్రోత్సహించి నాకు మరొక పెళ్లి చేయించారు. ఆమెకుకూడా వరుసగా ముగ్గురు కొడుకులు పుట్టి రెండేసియేళ్లవరకూ బతికి చనిపోయారు. అప్పటికి నాకు పూర్తిగా నమ్మకమయింది శైలబాలఉసురు ఊరికే పోలేదని. నా భార్య తిరిగి నాల్గోసారి గర్భం ధరించేటప్పటికి నాకు భయం వేసింది. మిత్రుల సలహామీద ఆమెను అనేక పుణ్యక్షేత్రాలు తిప్ప మొదలెట్టేను. ఆబిడ్డనయినా బతికించుకుందామని నాప్రయత్నం. ఈలోపున నేను జమీందారీ విడచివెళ్లిన అవకాశం చూసుకొని అక్కడున్న మాప్రతిపక్షులు మా జమీందారీలో జరుగుతున్న అన్యాయా లిన్నీ అన్నీ కావని గవర్నమెంటువారికి విన్నపం పెట్టుకోగా వారు మా జమీందారీని స్వాధీనం చేసుకున్నారు. నాకీ విషయం మూర్షిదాబాదు ప్రాంతాల్లో వుండగా తెలిసింది. నేను వెంటనే మాజమీందారీకి వెళ్లడాని కిష్టపడక మూర్షిదాబాదువద్ద వున్న ఒక గ్రామంలో మా రైతొకడు వుంటే వానిదగ్గర కొన్నాళ్లలా వుండిపోయాను. అక్కడ నా భార్య ఒక మొగ శిశువుని కన్నది. ఆతర్వాత సుమారు ఆరునెలలు అక్కడుండిపోయాను. కొన్నాళ్లకు మా దురదృష్టంకొద్దీ ఆ గ్రామంలో వుపద్రవమయిన కలరా ప్రారంభించింది. మాముసలి రైతు పాపం కలరాతగిలి చనిపోయినాడు. ఆ గ్రామస్థులందరూ కలరాభయంచేత మారగ్రామాలకు పారిపోయారు. ఒకనాటిరాత్రి నాభార్యకు కలరాచిహ్నాలు కన్పించాయి. ఆరాత్రి మారైతుకుటుంబం మాతో చెప్పకుండానే పారిపోయా రేదో గ్రామానికి. నాకు ఏమీ తోచలేదు. ఆ గ్రామం నిర్జనమవడం చేత తగిన మందు యిప్పించడానికి కూడా వీలు లేకపోయింది. నాభార్య ఆ రెండవరోజున చనిపోయింది. నాకన్నిపక్కలా దావానలము చుట్టుకున్నట్టయింది. ఆ రాత్రి నేను పడిన దుఃఖమునకు మితిలేదు. ఎవ్వరూ దిక్కు కనిపించలేదు. ఆగర్భ శ్రీమంతుణ్ణి. నాపాపఫలంవల్లనే నాకీగతి పట్టిందని పూర్తిగా నిశ్చయమయిపోయింది. మనసారా శైలబాలఆత్మని వేడుకున్నాను, అప్పటికయినా నామీద కసిమాని నన్ను క్షమించమని. ఇంతలో ఎవరో పదహారేళ్ల ప్రాయముగల యువతి వచ్చి నాముందు నిలబడింది. పైన చాలా జోరుగా వర్షం పడుతుండగా, ఈ నిర్మానుష్య మయిన ప్రదేశంలో ఈమె యెటుల రాగలిగిందా అని ఆశ్చర్యపడ్డాను. ఆమెఆకారమూ, అంగసౌష్ఠవమూ మూడు మూర్తులా శైలబాలనే పోలివున్నాయి. నాప్రార్థనల నాలకించివచ్చిన శైలబాలఆత్మ అని నేను నిశ్చయించుకున్నాను. ఆమెకు నాబిడ్డణ్ణి అప్పగించాను. నా

దగ్గరుంటే వానికి రెండేళ్లు పూర్తి అవుతాయో లేదో అనేదియమే కాకుండా నేనొంటరిగాణ్ణి, ఆపసిబిడ్డణ్ణి పెంచడం కష్టమని తోచింది. ఆమె మాత్రం బిడ్డణ్ణి పుచ్చుకుంటూ తాను శైలబాలను కాననీ, తన పేరు ప్రతిమ అనీ చెప్పినట్టు జ్ఞాపకం. ఆమె వెళ్లిపోయిన మరునాడు ప్రాతఃకాలమందు తళతళలాడుతూ ఒక బంగారుహారం కనిపించింది. సరిగా ఆమె నిలువబడిన స్థలమందే ఆ హారం పడివుండుటచేత అది ఆమెదే అని నిశ్చయించాను. పసిబిడ్డణ్ణి అందుకుందికని వంగినప్పుడు ఆ హారం మెడలోనుంచి పడిపోయి వుంటుందని నా ఊహ. ఆమెహారమామె కప్పగించాలని ఆ చుట్టుపక్కలా ఆమెకై ఎంతో ప్రయత్నించాను కాని ఆమెజాడ రేమీ తెలీలేదు. క్రమంగా ఐహికవిషయాల మీద వాంఛ తగ్గి సన్యాసినై ఊరూరా తిరుగ మొదలు పెట్టేను. ఆ బంగారు హారాన్ని ఆమెకిద్దామని ఎంత ప్రయత్నించినా ఆమె నివాస మెవ్వరూ చెప్ప లేక పోయారు. ఒకనాడు నేనొక మర్రిచెట్టుకింద కూచొని వుండగా ఈ హారపు హక్కుదారులు నీకై వెతుక్కొనివస్తారనీ, నువ్వు ఫలాని గుట్టలవద్ద సమాధి ఏర్పరుచుకొనమనీ నా కెవరో చెప్పినట్టయింది. నే నామాటల ననుసరించి ఈగుట్టలవద్దకు వచ్చి సమాధి ఏర్పరచుకొని చేసినపాపాలకి పరిహారార్థం హరినామస్మరణ చేస్తూ కూచున్నాను. ఇప్పటివరకు ఎవరూ ఈ హారంకోసం రాలేదు. నేను ఇలా కృశించికృశించి మరణించింతర్వాత వస్తారేమో తెలీదు. అందుచేత నాకథనంతా ఇలా రాసిపెట్టి, ఈహారాన్ని అందులో చుట్టి యిక్కడ వుంచేశాను. ఒకవేళ నేను మరణించినా నాఆత్మ నావలెనే వారికై నిరీక్షిస్తుంటుంది. ఈహారం దాని హక్కుదారులకి చేరేవరకూ నాఆత్మకి శాంతి వుండదు'

"'ఇలా రాసివున్న ఆకథనంతా చదివేసరికి నా మనస్సు పశ్చాత్తాపంతో దహించుకొనిపోయింది. నే నన్యాయంగా ప్రతిమని అనుమానించాను. ఆమె ఏమయివుంటుందో అని దిగులుపుట్టింది. ఆమర్నాడే మూర్షిదాబాదు చేరి అక్కడనుండి పూర్వం మే మున్న కండీగ్రామం చేరుకున్నాను. నాహృదయం ఉద్వేగంతో కొట్టుకోపోతోంది. నా కప్పటికి ప్రతిమకి అరవై సంవత్సరాల ప్రాయం వుంటుందన్న ఆలోచనే లేదు. నాపదిహేనేళ్ల ప్రతిమరూపమే కళ్లు వెదుకుతున్నాయి.

"'ఈ నలభైయైదుసంవత్సరాల్లో మా గ్రామం పూర్తిగా మారిపోయింది. మర్రిచెట్టును గుర్తుపెట్టుకొని మాయిల్లు కనుక్కొనగలిగాను. అచ్చట ఎవరో మాలవారు కాపురమున్నారు. అక్కడ నాకు ప్రతిమవిషయ మెవ్వరూ చెప్పలేకపోయారు. ఒకరైతు మాత్రం తన ముసలితల్లి ఎప్పుడో ఆ పేరు వుచ్చరించినట్టు జ్ఞాపకమున్నదని చెప్పి, నన్ను ఆముసలావిడదగ్గరకి తీసుకొవెళ్లాడు. ఆమె నావంకజూసి 'అవును; ప్రతిమ అమ్మర్రిచెట్టుకెదురుగా వున్న యింట్లోనే వుండేది. ఆమె చాలనాళ్లకిందటే కొడుకుతోకూడ కలకత్తా వెళ్లిపోయిన'దని చెప్పి తన కొమారునివంక చూస్తూ 'మన గోపీగాడు పనిచేస్తున్న భూములు వారివే. ఆబాబు అప్పుడప్పుడు భూములు చూసుకుందికి వస్తుంటాడు కాదట్రా' అన్నది. నేను వెంటనే ఆగోపీదగ్గరికి పరుగెత్తితే వాని యజమానిపేరు శ్యామప్రసాద్ చౌదరి అనీ, అతను కలకత్తాలో వకీలనీ తెలిసింది.

"'నేను కలకత్తా పరుగెత్తి అతికష్టమ్మీద ఈ చౌదరీబాబుని కలుసుకోగలిగాను. నలభైయైదుసంవత్సరాల వయస్సుగల చౌదరీని చూసి నేను కొంత ఆశ్చర్యపడ్డాను, ఆనాడు ప్రతిమదగ్గర చూచిన ఆరునెలల పసివాడింతవాడయ్యాడా అని. ప్రతిమవిషయ మాయన్నడిగాను. మొదట ఆయన 'లోపలనున్న'దని చెప్పి ఏదో జ్ఞాపకం తెచ్చుకొని 'మీ కే ప్రతిమ కావా'లన్నాడు. మీతల్లి ప్రతిమకై వచ్చానని చెప్పాను. 'మీ కెవ' రన్నాడు చౌదరీ, నావంక వింతగా చూస్తూ. నే నామెతల్లికి దగ్గిరబంధువు నని చెప్పేను. తన తల్లి సుమారు పదిహేనుసంవత్సరాలకిందటే చనిపోయిం దన్నాడు. నేను దుఃఖ మాపుకోలేక అక్కడే కూలబడ్డాను. ఎన్ని కష్టాలు పెట్టేనా శీలవతి నని నన్ను నేనే శపించుకున్నాను. ఈలోగా లోనుండి ఒక పదిహేనుసంవత్సరాలయువతివచ్చి నన్ను వింతగా చూడసాగింది. నే నామెను చూచి నిర్ఘాంతపోయాను. నాకు సుమారు అరవైయైదుసంవత్సరాలని నేను మరచి

పోగలుసతే ఆమె నా ప్రతిమే అనుకుందును. అదే రూపు, అదే ఎత్తు. చౌదరీ నాదుఃఖకారణ మడుగుతూ నన్ను కుర్చీలో కూర్చుండబెట్టి ఆవచ్చిన యువతిచేత విసనకర్రతో విసిరింపించాడు. ఆమె తన కుమార్తె అనీ, తనతల్లిజ్ఞాపకార్థం ఆమెకూ ప్రతిమ అనే పేరుపెట్టేమనీ చెప్పేడు చౌదరి. నేను వారింట్లో నాలుగురోజులు అతిథిగా వుండిపోయాను. ఈలోపున ప్రతిమకు నావద్ద చాలా చనువయింది. ఆమె నాప్రతిమనే పోలివుండడాన్ని నేను నాబంగారుహారాన్ని ఆమె మెడ నలంకరించాను. పాపం ప్రతిమతల్లి ఒక ఏడాది కిందటే చనిపోయిందిట. ఆమెతల్లి చనిపోయిందని వినగానే నాకు ప్రతిమా, శైలబాలల జీవితాలు జ్ఞాపకానికి వచ్చి కొంత భీతి కలిగింది. శైలబాలకూ ఆ వయస్సునే తల్లిపోయింది; నాప్రతిమకూ ఆవయస్సునే తల్లి పోయింది. మళ్లీ ఈమెకు ఆవయస్సనే—! నా కాలోచిస్తున్న కొద్దీ ఒకఊహా కలిగింది. అదే నా ఈవింతవిల్లుకి కారణము'

"అని బెనర్జీ దాదా ఒక్క నిముషము విశ్రాంతి తీసుకొని మరల ప్రారంభించాడు:

"నేను ఒకనాడు ఆ అమ్మాయి పెళ్లివిషయం ప్రస్తావించాను. చౌదరీవల్ల మీ యిర్వురి క్షేమ గాథ తెలిసింది. వెంటనే నా కదోమాదిరి భయంవేసింది. శైలబాలకీ వివాహానంతరము అంత ఆనందం కలగలేదు. నాప్రతిమకుకూడా వివాహప్రస్తావన వచ్చే వయసుదగ్గిర్నుంచే కష్టాలు ప్రారంభమైనాయి. నేను పూర్తిఅయిన దృఢవిశ్వాసంతో చెబుతున్నాను. ఈప్రతిమే మొదటి జన్మలో శైలబాల అయి, తర్వాత నా ప్రతిమ అయి, ఈ జన్మలో ఈ ప్రతిమగా జన్మించింది. శైలబాలను వివాహానికి పూర్వ మొనర్చిన వాగ్దాన ముల్లంఘించినందుకు ఆమెశాపం తగిలి పాపం ఆగర్భ శ్రీమంతుడయిన జమీందారు ఆ తర్వాత ఎన్ని పెళ్లిళ్లు చేసుకున్నా ఆనందమన్నది లేక పుట్టిన పిల్లలంతా మరణించడమేగాకుండా జమీందారీనికూడా గోల్పోయాడు. అతని ఆఖరిపిల్లడు—మన చౌదరీ—ప్రతిమ కప్పగించకుండా వుంటే రెండేళ్లు పూర్తికాగానే చనిపోయివుండు నవడాని కేమీ సందేహం లేదు. పురుషుడొనర్చిన అన్యాయానికి అలిగి ఆ యిల్లాలు—శైలబాల—తన వివాహానికిచ్చిన ఈ శాపం తప్పకుండా మూడుజన్మలవరకయినా వుండితీరుతుంది. ఈ ప్రతిమకీ శైలబాలకీ ఒకవిధమయిన బంధుత్వ ముండడం కూడా నాకు మరింత భయకారణ మయింది.

"నా ప్రతిమకీకూడా వివాహసౌఖ్యము లభించలేదు. అంతవరకూ ఆనందంగా గడచిపోయిన ఆమె జీవితం వివాహప్రస్తావన రాగానే ఒక తుపానులో పడి కొట్టుకోపోయింది. శైలబాలలాగే ఆమెకూడ తన ప్రియునికన్నా ముందే చనిపోయింది. ఇప్పుడు ఈ ప్రతిమ వివాహప్రస్తావన రాగానే తన తల్లిని గోల్పోయింది. ఆమె వివాహంచేసుకున్నదా అంటే మిగతా జీవితమంతా దుఃఖమయ మయిపోవడమే గాకుండా తన భర్తకంటే ముందు తానే అకాలమరణానికి పాలవకతప్పదు. అందుచేత ఈ జన్మలో నయినా శైలబాలశాపమునకు ఆమే, ఆమెభర్తా ఆహుతిగాకుండా రక్షించడం నావిధిగా యెంచుకున్నాను. ఛటర్జీ దెయ్యమై నాకోసం నిరీక్షించి నాకీకథనంతా అందచేయడం ఈ వుద్దేశంతోనే అని నానమ్మకం.

"ఛటర్జీ తాను శైలబాలయెడల గావించిన అత్యాచారానికి పశ్చాత్తప్తుడై, ఆ పాపములనుండి విముక్తిచెందగోరి తన ఏకైకపుత్రుణ్ణి నా ప్రతిమ కందజేశాడు. నేనుగూడ ప్రతిమకు గావించిన అన్యాయముల నుండి విముక్తికావడానికి నా ఆస్తినంతా ఈ ప్రతిమకి సమర్పించ సిద్ధపడ్డాను. ఆమెకు నీ కిప్పుడు చెప్పిన కథనంతా నిన్ననే చెప్పి, ఆమె పెళ్లికున్న ఈ పూర్వ శాపం తెలియపరచి, ఆమె ఈ జన్మలో అవివాహితగా వుండిపోతేనేగాని శాపవిముక్తి కాదని నచ్చచెప్పేను. ఆమె నా కథనంతా విని పాపం గడగడ వణకింది. శైలబాలాప్రతిమలకు జరిగిన అన్యాయాలకు పరిహారార్థం తాను ఆ జన్మాంతమూ అవివాహితగా వుండిపోతానని మనఃస్ఫూర్తిగా వాగ్దానం చేసింది. అయినా ఆమెతండ్రి ఎప్పుడయినా ఆమెమనస్సు తిప్పివేయవచ్చునని ఈ విధంగా నా వీలునామా రాసి నిన్నుకూడ సాక్షిసంతకానికి రప్పించాను. ఆమెశాప

ముక్తికి నీవూ తోడ్పడాలి. ఇప్పుడు నీవు ప్రతిమను వివాహం చేసుకొంటివా అంటే మీరిద్దరూ నరక కూపంలో పడుట తథ్యము.

“‘వినోదబాబూ, ఇదీ నా కథ. ఈ కథంతా విన్నతర్వాత ప్రతిమ శ్రేయస్సు కోరే నే నిలా ప్రవర్తించానని నీకు నమ్మకం కలిగివుంటుం దనుకుంటాను. ఇక ఆమెమీది వ్యామోహం తప్పుకుంటావని నా నమ్మకం. ఆమెకు వ్రతభంగం కానివ్వవని నా విశ్వాసం. ఏమంటావు ?’

“అని బెనర్జీ నా బుజంమీద చేయివేసి నా కళ్లల్లోకి చూస్తూ ప్రశ్నించాడు. గుడ్లప్పగించి ఆయన కథంతా విపరీతమయిన భయంతోనూ, ఆశ్చర్యంతోనూ వింటున్నా నంతసేపూ. నాకు పూర్తిగా మతి పోయినట్లే అయిపోయింది. ఇక ప్రతిమప్రసంగం తలపెట్టనని అతని చేతిలో చేయివేసి తిరిగివచ్చేశాను కలకత్తా.”

అని కళ్లనీళ్లతో తన వృత్తాంతమంతా చెప్పి ఈజీచైర్ లో వెనక్కు చేరబడ్డాడు రాయి. అలా నిర్ఘాంతపోయి వింటున్నా నతని విషాదవృత్తాంత మంతా.

“ఆలోచిస్తూంటే-మరి పెళ్లే చేసుకోబుద్ధిపుట్టడం లేదు!” అనిమాత్ర మన్నట్లు జ్ఞాపకము.

---

# పో త న!

●

శ్రీ మోచర్ల రామకృష్ణయ్య

●

పసిడిపళ్లెరముల కా మెసవుకోరిక లేక, రత్నాంబరములపై రక్తిలేక,
భద్రకుంజరపు టంబారిపై నూరేగి బిరుదు టందెల నందు వేడ్కలేక,
కస్తూరికై ఱేండ్లఁ బ్రస్తుతించుటలేక, అగ్రహారములపై నాసలేక,
ఉయ్యెలల్ దూతికల్ తొయ్యలుల్ కప్రంపువిడియముల్ లేవన్న యడలు లేక,

వినుతకవితాకుమారిని విక్రయింప
లేక, కీర్తికిఁ బరుగెత్తలేక, మాకు
భక్తిపీయూషపరిపూర్ణ భాగవతము
నిచ్చితివి, తీర్చుటెట్లు నీఋణము సుకవి!

---

# లేపాక్షిలోని చిత్రకళావైభవము

శ్రీ
గాడిచర్ల హరిసర్వోత్తమరావు

శ్రీకృష్ణదేవరాయల పేరు తెలుగు దేశమునందు విననివా రుండరు. అన్ని వైపులనుండియు ఆంధ్ర దేశమును కబళించుటకు సిద్ధమైన శత్రువుల నందరను జయించి తెలుగువారిని ఏకచ్ఛత్రాధిపతిగ నేలిన వీరు డతడు. అష్టదిగ్గజము లను అల్లసాని పెద్దన మొదలగు కవు లతని యాస్థానము నలంకరించిరి. స్వయముగ ఆముక్తమాల్యద యను అద్వితీయ గ్రంథమును అతడు వ్రాసెను. కవిపోషణ కావ్యనిర్మాణము మాత్రముతో ఆతని ప్రతిభ నిలువలేదు. అతడు సంగీతప్రియు డనుటకు అనేక నిదర్శనము లున్నవి. ఇక ఆతడు కట్టించిన గుళ్లు, గోపురములు, వేయించిన తటాకములు వేనవే లున్నవి. హంపి, తాడిపత్రి మొదలైన స్థలములలోని శిల్పములను చూచి ముక్కున వ్రేలిడుకొని ఇట్టి నిర్మాణమునకు కారణభూతులైన కృష్ణదేవరాయలాదిగాగల విజయనగర సామ్రాట్టుల యుగము దక్షిణదేశచరిత్రమున స్వర్ణయుగ మని తజ్ఞులు వేనోళ్ల ప్రకటించినారు; ఆంధ్రశిల్పమునకు అంజలి యొనర్చి జోహారులు పాడినారు.

ఇటీవలి చారిత్రక పరిశోధనలనుబట్టి విజయనగర సామ్రాజ్యమున కవిత్వము, సంగీతము, శిల్పముల వలె చిత్రలేఖనమునకును నొక క్రొంగ్రొత్త తేజము ఏర్పడినదని నిశ్చయించినారు.

ఈ నిశ్చయమునకు కారణభూతమయిన విషయములలో లేపాక్షి దేవాలయములోని చిత్తరువుల విమర్శ చాల ముఖ్యమైనది. నేడు లేపాక్షి కుగ్రామము. ఇది అనంతపురము జిల్లాలో నున్నది; హిందూపురమునకు చేరువన గలదు. జనసంఖ్య ౧౦౦౦ లకు తక్కువగా యుండు నేమో. ఈ యూరు కృష్ణదేవరాయలకాలమున మిక్కిలి ప్రశస్తిగన్నది. విరుపణ్ణనాయక, వీరణ్ణనాయకు లను ఇరువురు గొప్ప వ్యక్తులు ఆ రాయల ప్రతినిధులుగ నీయూరిలో నుండి ఈవైపుప్రాంతము నేలిరి. ఈ యూరిప్రక్కన నొక చిన్న గుట్ట కలదు. దీని పేరు కూర్మశైలము. ఇక్కడ పాపనాశేశ్వరు డను శివుడు ప్రతిష్ఠితు డయియున్నాడు. అగస్త్యఋషి యితనిని ప్రతిష్ఠించెనందురు. మొదట నిది గర్భగుడి మాత్ర ముండియుండును. మన ఋషులు అరణ్యములలో తపమునకై వచ్చి ఇట్టి పట్టుల ప్రశాంతముగ దేవుని గొల్చిరి. దండకారణ్యమును తాపసోత్తమ శరణ్యమని కృష్ణరాయల కాలమునకు ముందువాడగు పోతనామాత్యుడు వర్ణించియున్నాడు. లేపాక్షి దండకారణ్యములోనిది. ఇచ్చట జటాయువు పడియుండె ననీ, శ్రీరాములవారు ఆతనిని 'లే పక్షీ' యని సంబోధించిరనీ, అందుచేత దీనికి లేపాక్షియని పేరు కలిగ ననీ కొందరందురు. ఇది నమ్మదగినది కాదు. శ్రీరాముడు కిష్కింధకు రాకముందు జటాయువునకు సంస్కారము జరిగినది. శ్రీరాముడు ఉత్తరమునుండి దక్షిణమునకు వచ్చినవాడు. "లే + పక్షి = లేపాక్షి" యని దీర్ఘమగుటయు అంత సుసంభవము గాదు. లేపాక్షి అను పేరి గ్రామమున నొకవేళ ఇచ్చట పూసిన చిత్రలేఖనసృష్టిలో కంటితీర్పునకు పేరెక్కిన స్థానము.

కావున దీనిని లేపాక్షియని యందురు. "లేప + అక్షి" అని యప్పుడు సులభమైన పదవిభాగము చేయవచ్చు. ఈ పేరుమాట యెట్లున్నను ఇచటి కూర్మశైలముమీది దేవాలయము దినక్రమమున అభివృద్ధి, శైథిల్యములు పొందగా విరుపణ్ణ వీరణ్ణ సోదరులు, కృష్ణదేవరాయలు అతని తర్వాతివాడైన అచ్యుత దేవరాయల కాలమున దీని నుద్ధరించిరి. వీరి విగ్రహము లిచ్చట దివ్యమైనవి కలవు. వీరి తలగుడ్డలు, దుస్తులు నాటి రాయల సామంతుల తలగుడ్డలు దుస్తులబోటివి.

వీరి పేర్లను బట్టియే వీరు వీరభద్రుని భక్తులనుట యూహింపవచ్చును. ఇచ్చటి ఆదిమశివాలయమునకు వీరభద్రాలయమును, తరువాత విష్ణ్వాలయమును ముఖమంటపమున కానుకొని యేర్పడినవి.

ఆనాడు సినీమాలు, సినీమాహాలులు లేకపోవచ్చును గాని దేవాలయపు పైకప్పులు గోడలమీది రంగులు, రంగులతో రామాయణ, భారత కథలను తరువాతి మత కథలను చిత్రించి శాశ్వతసినీమా లుంచువారు. హరికథలు భజనలు సంగీతముతోగూడ వినిపించి వారి రీతిని వారు విజ్ఞానమును వెదజల్లుచుండిరి.

లేపాక్షి దేవాలయమున చక్కని ఎరుపు, నీలిమ, పసుపుపచ్చ, ఆకుపచ్చ, నలుపు, తెలుపు లుపయోగించి అద్భుతచిత్రములను కంటికి కట్టినట్లు నాటి చిత్రలేఖకులచేత విరుపణ్ణవీరణ్ణలును, వారి తర్వాతివారును వ్రాయించిరి. చిత్రకారుడు తన కుంచె దీసికొని ఒక నల్లరేఖ దీర్చి కనుబొమను, మరియొక్క గీతగీచి నాసికను, ఇంకొక గీత గీచి రెప్పలను స్ఫుటముగా దీర్చినాడంటే కంటికళ యట్టే యుట్టిపడిపోవును. పరిస్ఫుట రేఖల తీర్పునకు భారతదేశము పేరైనది. లేపాక్షి చిత్రము లా ప్రతిష్ఠను నిల్పినవి; పెంచిన వన్నను అననగును.

కృష్ణదేవరాయలకాలపు చిత్రలేఖనము యొక్క గొప్పదనము— అంటే లేపాక్షి చిత్రలేఖనపు గొప్పదనముగూడ ననవచ్చును— సమకాలికుడయిన పింగళి సూరనార్యుడు ప్రభావతీ ప్రద్యుమ్నమున కొంత సూచించినాడు. అందులో కంటి ప్రభావమునే వర్ణించినాడు:

"కన్నులఁ గట్టినట్లు తెలికన్నుల నిక్కము జూచినట్లు, తోఁబలుకఁ గడంగినట్లు, కడు భావ గభీరత లుట్టిపడఁగా శివ వ్రాసినట్టి యీ చిత్తరువు"

అని శుచిముఖిచేత వర్ణింపించినాడు.

శివ, వీరభద్ర, విష్ణ్వాలయములు మూటికిని సమానమైన ముఖమండపము పైకప్పు లోభాగమున మహాభారత రామాయణాది పౌరాణికగాథల నెక్కుడుగ వ్రాసినను, వీరభద్రదేవాలయపు గోడలమీదను, శివాలయపు అర్ధమంటపమునను శివకథలు అచ్చెరువు గొల్పునట్లు అలంకరించినారు. ఒక్కొక్క చిత్తరువును వర్ణింప వ్యవధి చాలదు. పార్వతీపరిణయము పార్వతీ పరమేశ్వరుల పరస్పరానురాగ క్రీడలు త్రిపురసంహారము, శివతాండవములోని అఖ్యాయికలు గాథావిషయములుగ నేర్పడినవి. గౌరీప్రసాద శివుడను చిత్తరువున పద్మములు మీనములతో జటాజూటమునుండి ప్రవహించు గంగను మురుసుపరుస జూచుచు శివుడు పార్వతిచిబుకముపై చేయిడి బుజ్జగించుట, ఖండితానన పార్వతి ప్రణయకోపమున మోముద్రిప్పుట, ఈ దంపతుల కండ్లతీరు, ముఖముల సౌరు చూచువారలను ముగ్ధులగావించును. పరిణయమునకు ముందు పార్వతియలంకారము, పార్వతీపరమేశ్వరులు చదరంగమాడుట స్వభావ ప్రతిబింబములు. శివుడు అంధకాసురసంహార మొనర్చుచోట ముఖమున శాంతి, కరమున శూలము పెట్టి రుద్రుని నిర్లిప్తధర్మపరత చాటించినారు. కృష్ణుని వేణుగానము గోపికల సమ్మోహిత కేసినట్లు శివుని భిక్షాటనము ఋషిపత్నులను సమ్మోహితలను గావించుట కనుపరచినారు. వృషభారూఢశివుడు, నటేశుని ఆనందతాండవము, శివానుగ్రహము, దక్షిణామూర్తి మున్నగు నితర చిత్రము లెన్నియో యున్నవి.

విష్ణ్వాలయమున మత్స్య విష్ణువును, చుట్టును దశావతారములను చిత్రించినారు.

లేపాక్షిశిల్పములును అనల్పములు. ౭౦ కాళ్ల ముఖమంటపములోని స్తంభములమీద పూర్ణాకృతులగు సంగీతకారులయు, నటులయు మూర్తులను విజయనగర ఫణితిని తీర్చినారు. బ్రహ్మ మద్దెలను, తుంబురుడు వీణను, నందికేశ్వరుడు హుడుక్కను, మరియొక

నాట్యాచార్యుడు తాళములను వాయింపరంభ నాట్య మాడుట ఒకచోట కానవసును. శివుని ఆనందతాండవము నొకచోట చెక్కిరి. లింగమునుండి ఆ పరమేశ్వరు డావిర్భవించి భక్తుల నాశీర్వదించుట మరియొకచోట కానవసును.

సాధారణమానవు లీదేవాలయపు చిత్తరువులను, ఇందలి శిల్పములను వివరముగా చూడగల్గినను చూడలేకున్నను, దారిలో నున్న బసవేశ్వరుని మాత్రము మరవలేరు. నుట్టరాటి జాతి నిచ్చట బసవేశ్వరుడుగా దీర్చి నిలిపినారు. ఇంత పెద్ద బసవడు మన కెన్నిచోట్లనో దొరకడు.

లేపాక్షినుండి సెలవు పుచ్చుకొనుటకు ముందు ఈ ప్రాంతములలో పేరైన హరికథ లేపాక్షి రామాయణ మనునది కలదనీ, అది తరతరములుగ ఈ ప్రాంతప్రజల కానంద మిచ్చినదనీ స్మరించికొనుట యావశ్యకము.

(ఆలిండియా రేడియో-మద్రాసు కేంద్రమువారి అనుమతితో)

---

# చిఱువ్రోలి తామ్రశాసనము

= శ్రీ నేలటూరి వెంకటరమణయ్య =

గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా రావెల పోస్టుఆఫీసుకు చేరిన నెమలికల్లు గ్రామమునఁ దక్షారామవాస్తవ్యులగు నెమలికంటి సుబ్బారావుగారి యింటియొద్ద ౨-౫-౧౮గవాఁడు పాటిమట్టికొఱకు నేలను త్రవ్వుచుండఁగా నేలమట్టముక్రింద ౩౪గజముల లోఁతున వీనఁగుముద్రతోఁ గూడిన వలయమును, ఐదు రాగిరేకులును దొరకినవి. ఈరేకులతోఁగూడ చిక్కిన వలయ మింకను నాకు చేరలేదు. కావున దానినిగూర్చి యిచట నేమియుఁ జెప్పుటకవకాశములేదు; కాని దొరకిన ఐదురేకులలో వలయమును దూర్చుటకనువైన బెజ్జము నాల్గింటికిమాత్ర ముండుటచేతను, నైదవదానియందు బెజ్జముండవలసినచోవున వర్తులరేఖ యొకటి గాన్పించు చుండుటచేతను వలయమునఁ గ్రుచ్చియుండినవి బెజ్జము గల నాల్గురేకులే యనియు, బెజ్జములేని యైదవరేకు విడిగానే లభించియుండవలయుననియుఁదోఁచుచున్నది. మఱియు నీ యైదురేకులును పరిమాణమున సమానములు గావు. ఇందు బెజ్జములేని రేకును, బెజ్జముగలరేకులలో రెండును సమపరిమాణములుగలవి. ఒక్కొక్కటియు ౧౦¾అం. నిడుపును, ౬ అం. వెడల్పును గలిగియున్నవి; మందము ⅛ అం. ఈ మూఁటియందును రెంటికి కుడి యంచు మధ్యభాగమున ⅜ అం. మధ్యపరిమాణము గల రంధ్ర మొకటి కలదు. ఈరంధ్రముగుండనే వలయమును దూర్చి, దాని రెండుకొనల నతికించి యతుకుమీఁద రాజముద్రను దాపటము సేయుట యాచారము. రేకుల నాలుగుకడలను అంచులు మాత్రముగ నవతీర్చఁబడి యున్నవి. మొత్తముమీఁద వీనియెత్తు ౧౫౦తులములు.

ఇఁక మిగిలిన రెండు రేకులును గించిత్పరి మాణవ్యత్యాసము గలిగి విజ్ఞోడుపడియున్నవి. వీనియం దొకదాని నిడివి ౭¾ అం., వెడల్పు ౫¾ అం. మఱి యొకదాని నిడివి ౬ అం., వెడల్పు ౪ అం. రెంటికిని డాపలిఅంచుమధ్యమున వలయమును దూర్చుటకుఁ దగు రంధ్రము గలదు. ఈ రెండు రేకులయొక్క బరువు ౫౫తులములు.*

పైఁజెప్పిన పరిమాణాదిభేదములనుబట్టి చూడఁగా నీరేకులన్నియు నొక శాసనమునకుఁ జెందినవి కావని తోఁచుచున్నది. మొదటి మూఁడురేకులును పరిమాణ మందు సమానములైనను అవియు నొక్క శాసనమునకు సంబంధించినవి కావేమో యను సంశయము గలుగు చున్నది. ఈసందేహము గలుగుటకు ముఖ్యకారణములు రెండు: ౧. వీనియందు రెండురేకులలో వలయమును దూర్చుటకై చేయఁబడిన రంధ్రము గాన్పించుచున్నది. మూఁడవదానియం దట్టి రంధ్రము లేదు. రంధ్రముండ వలసినచోట రేకున కొకప్రక్క కుండలాకృతిగల రేఖ యొకటి చెక్కఁబడియున్నది. ౨. ఇదిగాక మొదటి రేకునుబోలి దీనియందు శాసనోక్తదానకాలము దెల్పఁ బడియున్నది. కావున నీమూఁడవరేకుపైని శాసనము మొదటి రెండురేకులలోని శాసనముకంటె భిన్నమైన దను తలంపు కలుగుచున్నది. కాని రెండుశాసనము లందును జెప్పఁబడిన దాత యొక్కఁడే; కాల మొక్కటే; దానోద్దిష్టగ్రామముగూడ నొక్కటియే. కావున పైఁజెప్పిన కారణములవల్ల నీరేకులు భిన్న దానశాసనములకుఁ జెందినట్లు తోఁచినను వీని నొక్క శాసనముక్రిందనే పరిగణించుట యుక్తము. కడపటి రెండురేకులు విజ్ఞోడుపడియుండుటచే నవి రెండును రెండు ప్రత్యేకశాసనములకు సంబంధించినవని చెప్ప వలసియున్నది. ఈయైదురేకులయందుఁగానవచ్చెడి లిపియు, భాషయు, ఇతివృత్తమును పైసిద్ధాంతమునే స్థిరపఱచుచున్నవి.

ఇందు రెండువిధముల లిపులును, మూఁడు భాష లును వాడఁబడియున్నవి. మొదటి మూఁడురేకుల

---

* గవర్నమెంటు శాసనశాఖాధ్యక్షులగు రా. బ. సి. ఆర్. కృష్ణమాచార్యులవారు దయాపూర్వకముగ నీ పరిమాణములను దెల్పిరి. వారియెడ కృతజ్ఞుఁడను.

యందలి లిపి క్రీ. శ. ౧౫-వ శతాబ్దోత్తరార్ధమున ఆంధ్రదేశమునఁ బ్రచారమం దుండిన తెనుఁగులిపి; భాషలు రెండు: సంస్కృతము, తెనుఁగు. అక్షరముల పోలికను జూడ రెండును నొక్కనిచేఁ జెక్కఁబడిన ట్లున్నవి. కావున నీమూఁడురేకులపైఁ జెక్కఁబడిన యంశమంతయు నొక్కశాసనమునకే సంబంధించినది కావచ్చును. కడపటి రెండురేకులయందును నొక్క దానిమీఁదనే నాలుగుపంక్తుల యొడ్డెయక్షరములును, గజపతివారి హస్తాక్షరచిహ్నమును గానవచ్చుచున్నవి; రెండవదానిపై వ్రాఁతలేదు. పరిమాణభేదముచే నీ రెండు రేకులును రెండు ప్రత్యేకశాసనములకుఁ జెందిన వని చెప్పవలసివచ్చెను. ఈ యొడ్డెయక్షరముల శాసనము గూర్చి కొంత విచారణ యావశ్యక మగుటచేతఁ దద్విషయమై యిప్పు డేమియుఁ జెప్పుటకు వీలులేదు. కావున నీవ్యాసమున మొదటి మూఁడు రేకులలోని శాసనవిషయము మాత్రమే వివరింపఁబడును.

చిరకాలము భూస్థాపితమై దట్టముగఁ జిట్టెము గట్టిన చిలుముచే నాచ్ఛాదితములై యుండినను ఇందలి యక్షరములు మాయక స్పష్టముగఁ దెలియవచ్చుచున్నవి.* వ్రాఁత పొంకమైనది కాదు; శాసనగ్రంథకర్తయొక్క పైదుష్యముగూడ సామాన్యమైనదే. తప్పులనేకములు గానవచ్చుచున్నవి. వీనిని శాసనగ్రంథమునఁ జూడవచ్చును. సాధ్యమైనంతవఱకు తప్పులను సవరించి దిద్దుఁబాట్ల నధోజ్ఞాపికలయందు సూచించియున్నాను.

## శాసనలిపి

ఇందలి లిపి క్రీ.శ. ౧౫-వ శతాబ్దోత్తరార్ధమున నాంధ్రదేశమున వాడుకలోనుండిన తెనుఁగులిపి యని పైన వ్రాసియున్నాను. అక్షరస్వరూపమునుగూర్చి విశేషించి చర్చింపవలసిన యవసరము లేదు. అప్పటికే తెనుఁగుఅక్షరములు వాని ప్రస్తుతరూపమును బొందినవి. కాని యందుఁగానవచ్చెడి రెండుమూఁడుముఖ్యభేదముల నిచటఁ జేర్కొనవలసియున్నది. మొదట నెన్నఁదగినది 'తా'కారము. ఈశాసనమునఁ గానవచ్చెడి 'తా'కారము నందు ఇప్పటి 'తా'కారమునందువలె కుడిభుజమున నుండి మొదలు తలకట్టువఱకును గల భాగము గానరాదు. దీనికి మారు ఎడమభుజమును బొడుగుచేసి కుడిభుజము నందలి నుండి మీఁదికి వచ్చునట్లు వంచి, వంపునకు పైభాగమున నక్షరమునకుఁ దగులనీయక తలకట్టు వ్రాయఁబడియున్నది. చూచుటకు అది యీకాలపు చేతివ్రాఁతలలోఁ గానవచ్చు 'హ'ను బోలియున్నది. ఇట్లే శాసనమునందలి 'శా'కారము ఇప్పటి 'శా'కారమునవలె నుండక అచ్చుఅక్షరములలోని 'క'వలె వ్రాయఁబడియున్నది. మఱియు శకటరేఫమున నొక విశేషము గానవచ్చుచున్నది. అక్షరముతలపై రెండుభుజములకు మధ్య పెక్కుతావులయం దొక నిలువుగీటు కలదు (చూ: రేకు ౧-ప్రక్క ౨, పంక్తి ౨ 'మేళ్లమి|ఱు'; రే, ౨-ప్ర ౧ పం ౧ చిఱు|వ్రోలి, పం ౩ యఱ|గుంటల, పం ౬ |చఱకూరు; రే ౩ ప్ర ౨ పం ౪ యూఱు|వ్వూరి, పం ౧౫ |యఱజంటల ఇత్యాది). ఈగీటు సర్వత్ర నిలువుగానుండక కొన్నితావుల (చూ: రే ౨ ప్ర ౧. పం ౧ |చిఱువ్రోలు) పైభాగమున స్వల్పముగ కుడివైపునకు వంగియున్నది. ఈగీటువల్ల అక్షరముయొక్క ఉచ్చారణయం దేభేదమేని యేర్పడునో నిశ్చయించి చెప్పుటకు వీలుకాదు. కాని, ఇది యొకవేళ 'ఱ'కారొపల్లు| అగునేమో యను సంశయము గలుగుచున్నది. యఱ|గుంటల, యఱు|భట్ట, ఎఱగుంటల (చూ: రే ౨ ప్ర ౧ పం ౭, ౯, ౧౦, ౧౩; ప్ర ౨ పం ౪) అను మాటలు ఇప్పటి వాడుకప్రకారము 'య(ఎ)ఱ్ఱగుంటల, య(ఎ)ఱ్ఱభట్ట' అని యుచ్చరింపఁబడుచుండుటచేతను, ఈ శాసనముననే స్థలాంతరమున 'యఱ్ఱభట్ట, యఱ్ఱసోమయాజి' (చూ: రే ౩ ప్ర ౨ పం ౧, ౨) అను మాటలలో శకటరేఫము గానవచ్చుచుండుటచేతను, పైనఁ జెప్పినతావులఁగూడ శకటరేఫమును నొక్కి పలుకవలయునేమో యను నూహ పొడముచున్నది. ఈ యూహయే సరియగునేని ప్రస్తుతము పరామర్శయం దుఁడు నీ

---

* తమ లేబరేటరీలో నీరేకులపైఁ జిలుమును వదల్చి శాసనగ్రంథమును జదువుట కనుకూలపఱచియిచ్చినందుకు మద్రాసుగవర్నమెంటు వస్తుప్రదర్శనశాలాధ్యక్షులగు డాక్టర్ ఎ. అయ్యప్పన్ గారికిఁ గృతజ్ఞతాసూచకవందనములను సమర్పించుచున్నాను.

నిలువుగీటు ద్విత్వచిహ్నము కాఁజాలదు. శకటరేఫ ద్విత్వము ఇప్పటిరీతినే కొన్ని స్థలములయం దీశాసనమున వ్రాయఁబడియున్నది (చూ: రే ౩ ప్ర ౨ పం ౧, ౨). కావున నీనిలువుగీటు 'ఱ'కారపొల్లుచిహ్నముగా నుండ వచ్చును. అయినను ఈ సిద్ధాంతము నిర్బాధకమని చెప్పుటకు వీలులేదు. రే ౨ ప్ర ౧ పం ౧ యందలి 'చిఱువ్రోలు'లోని 'ఱు'పైని గీటు లేఖకప్రమాద జనితమని త్రోసిపుచ్చినను, ఈప్రక్కనే ౮-వ పంక్తి యందును, రెండవప్రక్క ౪-వ పంక్తియందును గన్పట్టు 'చెఱుకూరు' 'చెఱుకూరి' అను మాటలలో నీ గీటును ద్విత్వ, లేక 'ఱ'కారపొల్లుల చిహ్నమని తలఁచిన నీమాటలను 'చెఱ్ఱ లేక చెఱఁకూరు' అని యుచ్చ రించవలసివచ్చును. ప్రాచీనకాలమునుండియు 'చెఱు కూరు' అనియే ఈ గ్రామనామమైనట్లు శాసనములు రుజువుసేయుచున్నవి. ఈ సందర్భమునఁ జేర్పఁ దగిన సందిగ్ధమింకొకటి కలదు. రే ౨ ప్ర ౨ పం ౩ లో 'ఎనమంఱ్రఅగంగాధరభట్టః' అనుచోట శకట రేఫముమీఁద నిలువుగీటును, క్రింద ్రకారముఁ గాన వచ్చుచున్నవి. ఈయక్షరము నెట్లుచ్చరించవలయునో తెలియదు. 'ఎనమండ్ర'మను నింటిపేరు గల బ్రాహ్మణు లాంధ్రదేశమునఁ బెక్కు స్థలములయందు నేఁడును నివసించుచున్నారు. ఈశాసనములోని 'ంఱ్ర' నేఁటి 'ండ్ర'గా మారినదా? ఇచ్చటను 'ంఱ్ర'ను 'ండ్ర'యనియే యుచ్చరించవలయునా? అట్లుచ్చరించుటకు వీలు లేదని నాయభిప్రాయము. ఏలన, ఇందు పెక్కుస్థలములయందు 'డ'కారము వేఱువిధముగ వ్రాయఁబడియున్నది (చూ: రే ౧ ప్ర ౧. పం ౮. 'భూమండలాఖండలః', రే ౨ ప్ర ౧ పం ౨. 'అంకు విశయజ్య' 'కౌండిన్యః', రే ౩ ప్ర ౧ పం ౪ 'కౌండిన్య'). కావున 'ంఱ్ర' 'ండ్ర' కాఁజాలదు. దీని యుచ్చారణ యెట్టిదో తెలియదు.

వర్గాక్షరములలోని యొత్తక్షరముల యొత్తు దెలుపుటకు ప్రత్యేకచిహ్న మొకటి వాడుకయం దుండెను. ఇప్పటివలెనే యొత్తులేని యక్షరము ప్రక్కలి క్రింద చేరినట్లు నిలువుగీటుగీచిన యొత్తక్షర మగు చుండెను. కాని ఈశాసనలేఖకుఁ డచటనచట యొత్తు చిహ్నమును వ్రాసియున్నను సర్వసామాన్యముగ దాని నుపేక్షించియుండుటచేత నీపద్ధతి యప్పుడప్పుడే యాచారములోనికి వచ్చుచుండెనేమో యను సంశ యము కలుగుచున్నది. మఱియు నీశాసనమున ఒత్తన్ని యెడలను నిలువుగీటువల్ల సూచింపఁబడక కొన్నిచోట్ల అలుగురూపుఁ గల ౧ రేఖచేఁ దెల్పఁబడియున్నది (చూ: రే ౧ ప్ర ౨ పం ౩ 'ఫలతరు'). ఇట్టిరేఖనే 'ర'క్రింద వ్రాసిన నది 'ఋ'కార మగును (చూ: రే ౧ ప్ర ౨ పం ౫,౬ 'ఈశాన్య').

లేఖనవిశేషములనుగూర్చి కొంత చెప్పవలసి యున్నది. పదాదియందు వచ్చు అచ్చునకు మారు హల్లు పెక్కుతావులఁ గానవచ్చుచున్నది. 'ఎ'కారమునకు మారు 'య'కారమును, 'ఉ'కార 'ఒ'కారములకుమారు 'వ'కారమును వ్రాయసకాఁడు వాడియున్నాఁడు. ఉ: ఎఱుగుంటల — యఱుగుంటల (చూ: రే౨ప్ర౧.పం౩౯, ౧౦,౧౩); ఉత్తరం — వుత్తరం, ఉత్తరావకు — వుత్త రావకు (రే ౧.ప౨.పం౧౩); ఒడ్డె—వొడ్డె (రే౨ప్ర. ౧ పం౭). ఇది కేవలప్రమాదజనితము గాదనియు, వ్రాయస కాఁడు శిష్టాచారుల యుచ్చారణ ననుసరించి ఇట్లు వ్రాసెననియు తోఁచుచున్నది. కృష్ణ — క్రిష్ణ, (రే౧. ప్ర ౨ పం౧౦) నరసింహ—నరశింహ్వ (రే౨ ప్ర౨.పం౨) లును నీతరగతికిఁ జెందినవే; కాని, 'స'కు బదులు 'శ' (రే౨ ప్ర౨ పం౭ సింగ—శింగ), 'ఱ'కు బదులు 'ర'(రే౧. ప్ర౨పం౮,౯ మెఱకనపల్లి—మెరకనపల్లి) లను వ్రాయుట వ్రాయసకాఁడు వాని యుచ్చారణభేదమును జక్కఁగ గుర్తించలేకపోవుటవల్లనని చెప్పవలయును.

గుణింతవిశేషము లును చేర్పఁదగినవి కొన్ని కలవు. ఇచ్చట మొదట చెప్పఁదగినది రేఫ సంయుక్తాక్షరము. రేఫముతో సంయోగమై వచ్చు నక్షరమును ముందు వ్రాసి తదనంతరము రేఫమును, అనఁగా తత్సూచకమైన గిలకను వ్రాయుట ప్రాచీన పద్ధతి. ఈపద్ధతి నేఁటికిని కన్నడమున వాడుకయం దున్నది. తెనుఁగున నీగిలకకు వలపలిగిలక యని పేరు. అర్వాచీనపద్ధతి దీనికి విరుద్ధమైనది. రేఫమును మొదట వ్రాసి తత్సంయోగమై వచ్చు నక్షరమును దానిక్రింద

వత్తుగా వ్రాయుట నవీనాచారము. ఈశాసనమున నీ రెండుపద్ధతులును గన్పడుచున్నవి. అంగీరసబార్హస్పత్య (రే౨ ప్ర౧ పం౬) మేదలమిత్ర (రే౧ప్ర౨ పం౧౨) ధర్మశాసనం, సర్వేషాం (రే౧.ప్ర౨.పం౧౬). రేఫసంయుక్తాక్షరములు ప్రాచీనపద్ధతి ననుసరించి వలపలిగిలకతోఁ గూడ వ్రాయఁబడిన కొన్ని తావులయందు గిలకకుముం దుండు అక్షరము ద్విత్వము గావింపఁబడి యున్నది (ప్రత్యాఖ్యజ్జ రే౧ప్ర౧పం౬, తూర్వ్వ, రే౧ప్ర౨పం౬). ఒక్కొకచోట అనుస్వారానంతరము వచ్చు నక్షరముగూడ ద్విత్వము సేయఁబడియున్నది (రే౧ ప్ర౧ పం౭ 'స్వాక్రాంత్తి').

## భాష

ప్రస్తుతము పరిష్కృతమగుచున్న ఈమూఁడు రేకులయందును రెండుభాషలు గానవచ్చుచున్నవి. దానోద్దిష్టగ్రామసీమావర్ణనలను వర్ణించు భాగముదప్ప తక్కిన చోట్ల గద్యపద్యాత్మకమైన సంస్కృతభాష వాడఁబడియున్నది. మొదటిరేకు ఆరంభమున ప్రథమ పంక్తియందలి 'శుభమస్తు' కడపటిపంక్తి తుదయందలి 'మంగళమహాశ్రీ' అనుమాటలను, రెండవరేకు మొదటి ప్రక్క రెండవగీటు మొదలు రెండవప్రక్క కడపటి పంక్తి వఱకును, మూఁడవరేకు మొదటిప్రక్క పదునారవ పంక్తియుత్తరార్ధము మొదలు రెండవప్రక్క కొనవఱకును గల శాసనభాగము గద్యమున నున్నది. మిగతభాగము పద్యరూపము. ఈశాసనగ్రంథమున నిరువది రెండు శ్లోకములు గలవు : అనుష్టుప్పులు ౯, ఆర్యావృత్తములు ౨, స్రగ్ధరలు ౨, శార్దూలవిక్రీడితములు ౬, వసంతతిలక ౧, ఉపజాతి ౨. సీమావర్ణనలను దెల్పు భాగము తెనుఁగువచనమున వ్రాసియున్నది.

ప్రస్తుతము పరిష్కృతమగు మూఁడురేకుల మీఁదను రెండుశాసనములు గలవను శంక కెడ మున్న దనియు, నవి యొక్కదానమునకే సంబంధించినట్లు శాసనాంతర్గత సాక్ష్యమువల్లఁ దెలియవచ్చుచున్నందున వాని నన్నిటిని ఒక్కశాసనముగనే ఈవ్యాసమున పరిగణించుచున్నామనియుఁ బైన వ్రాసియున్నాము. ఈమూఁడు రేకులలోను మొదటిదానిమీఁద రెండుప్రక్కలయందును హంవీరదేవుఁడు బ్రాహ్మణుల కొసఁగిన భూదానము వర్ణింపఁబడినది. రెండవరేకున నిరుప్రక్కలను ప్రతిగ్రహీతల పేర్లుతప్ప మఱియేమియుఁ గానరాదు. మూఁడవరేకుపైఁ బ్రతిగ్రహీతలలో నొక్కఁడైన నైషధీయ యాథళసూరియొక్క వంశాతిశయాదివర్ణనయుఁ, బ్రతిగ్రహీతల పట్టికయుఁ గలవు. ఈరేకుల పౌర్వాపర్యము గనుఁగొనుటకు వానియందే కొంత యాధారము గలదు: ౧. ఈమూఁడు రేకులును నొక్కగ్రామమునకు సంబంధించినవే. దాత యొక్కఁడే, దానోద్దిష్టగ్రామ మొక్కటే; దానముగూడ నేకకాలమున నిచ్చినదే. ౨. మఱియు నైషధీయ యాథళసూరిని బ్రతిగ్రహీతగఁ జేర్కొనియున్న రేకునందే "లక్ష్మణభట్టపుత్రో గంగాధరభట్టో భారద్వాజః పున రేకభాగీ"యని యున్నది. ఇందువల్ల నీ గంగాధరభట్టునకీదానము సేయఁబడిన గ్రామముననే ఇంతకుపూర్వ మొకభాగ మొసఁగఁబడెనని తెల్లమగుచున్నది. కేవలము ప్రతిగ్రహీతల పేర్లె కానవచ్చెడు రేకునుపరిశీలించిచూడఁగా నందు (రే౨ ప్ర౧పం౫,౬) "భారద్వాజః లక్ష్మణభట్ట పుత్రః గంగాధరభట్టః ఏకభాగీ"అని యున్నది. ౩. ఇంతే కాదు, ఈరేకుఆరంభమున ప్రథమపంక్తియందు "చిలుక్రోలికుమార శ్రీహంవీరపురభాగినః లిఖ్యంతే౽ద్య షడ్వర్గ హమ్వీర స్తంభానివాచలాః"అను శ్లోక మొకటి కానవచ్చుచున్నది. కావున నైషధమువారి వంశమును వర్ణించు రేకునకంటెఁ గేవల ప్రతిగ్రహీతల పట్టిక గల రేకు ముందరి దనుట నిశ్చయము. ఇందువల్ల నీమూఁడు రేకుల క్రమ మిట్టిదై యుండవలయును : మొదటిది హంవీరదేవుని శాసనము గల రేకు; పిమ్మటిది ప్రతిగ్రహీతలను జేర్కొను రేకు; కడపటిది నైషధము యాథళసూరివంశమును వర్ణించు రేకు.

## శాసనగ్రంథము

హరిహరుల స్తోత్రములతో శాసన మారంభమగుచున్నది (రే ౧ ప్ర ౧ పం ౩); తరువాత సూర్యుఁడు (పం ౪); అతని వంశమునఁ గపిలేశ్వరుని జననము; అతని కీర్తిప్రతాపములు; అతని భేరీధ్వనిచే హంప కంపమందెను; ధార భీతిఁజెందెను; కల్బరగ విముక్తతురగయాయెను; ఢిల్లీ ఢిల్లీవృత యాయెను (పం ౫-౯). ఇతని కుమారుఁడు కుమారహంవీరుఁడు

అతని కీర్తిప్రతాపములు (పం ౯-౧౪). శకాబ్దము ౧౩౮౩-వ సంవత్సరమునకు సరియైన వృషనామ సంవత్సర భాద్రపద బ ౧౫ అమావాస్య శుక్రవారము నాఁడు బ్రాహ్మణులకు హంవీరదేవుఁడు కృష్ణాతీరము నందలి చిఱుత్రోలు గ్రామమును పేళ్లమిఱ్ఱుతోఁగూడ సర్వమాన్యముగ దానముఁజేసెను (శే ౧ ప్ర ౨ పం ౧-౪); గ్రామసీమచిహ్నములు (శే ౧ ప్ర ౨ పం ౫-౧౪); భావిభూపతుల ప్రార్థన (శే ౧ ప్ర ౨ పం ౧౪-౧౫); శాసనగ్రంథకర్త (పం ౧౬); విప్రదత్తమైన భూమి రాజులకు నభోజ్య నకరగ్రాహ్యయని విజ్ఞప్తి (పం ౧౭-౧౮); శాసనము కడపట గజపతుల చేవ్రాలు. ఇట్టి వ్రాలే ప్రచురమైన వీరి శాసనముల యందు కొన్నిటియందుఁ గానవచ్చుచున్నది (చూ: నెల్లూరు శాసనములు, సం. ౧ రాగిశాసనములు ౨౦, ౨౧); కాని ఇందు కొంతభేదము గాన్పించుచున్నది. ఇందలి వ్రాలును రెండు భాగములుగ విభజింపవచ్చును: (౧) దాపలిప్రక్క నూర్ధ్వముఖమై నిలిచియుండు త్రిశూలరేఖ; (౨) వలపలిప్రక్క దీని నానుకొని యడ్డముగ సమదూరమున గీచియుండు మూఁడు అడ్డగీట్లు. ఈ మూఁడు గీట్లును సమదీర్ఘములు గావు. నడిమి గీటు ఎడమ కొనయందుఁ దక్కిన రెండుగీట్లకంటె మిగిలి కొంచె మెక్కువ నిడివి గలిగి యెడమవైపున నుండు త్రిశూల రేఖయొక్క కామను మధ్యభాగమునఁ దాఁకుచున్నది. మఱియు నీ యడ్డగీట్లలో మీఁదను, క్రిందను నుండు గీట్ల యెడమకొనలను దాఁకుచు నడిమిగీటు ముక్కున కడ్డముగ నొక నిలువుగీటును, నీ నిలువుగీటునకుఁ గుడి తట్టు పై మూఁడు అడ్డగీట్లకు మధ్యమున మఱియొక నిలువుగీటును గలవు. ఈ రెండు నిలువుగీట్లవల్ల పై మూఁ డడ్డగీట్లును నాలుగు గళ్లుగ విభజింపఁబడియున్నవి. ఇందు ఎడమవైపున నుండు రెండుగళ్ల కడ్డముగ తెనుఁగు అచ్చు ౭-వ సంఖ్యను బోలిన చిహ్నములు మూఁడును, కుడివైపున నుండు రెండుగళ్లలో క్రింది దానియందు పై చిహ్నమే యొకటి యొత్తికిలినట్లును వ్రాయఁబడియున్నవి. పైగడియందు మీఁది యడ్డగీటును దాఁకుచు వర్తులరేఖ యొకటి యగపడుచున్నది. మఱియుఁ బైవర్ణింపఁబడిన మూఁ డడ్డగీట్ల యుపరితలమున గొలుసువంటి రేఖ యొకటి కానవచ్చుచున్నది. ఇది గొలుసువ్రాఁత కావచ్చును.

ఇఁక మిగిలియుండు రెండు రేకులయందును ప్రతిగ్రహీతలు పేర్కొనఁబడియున్నారు. మొదట నీ దాన శాసనకాలమును, దానివల్ల వ్యక్తమగు చరిత్రాంశములను వివరించి పిమ్మట వీరిని గూర్చిన విశేషములను దెల్పెదను.

## శాసనకాలము

ఇందు హంవీరదేవునిచేఁ దానముచేయఁబడిన కాలము రెండు స్థలములయందుఁ దెల్పఁబడినది. ఒక చోట (శే ౧ ప్ర ౨ పం ౧,౨) హంవీరదేవుఁడు శకాబ్దము రామ (౩) ఇభ (౮) లోక (౩) ద్విజపతి (౧) గణితము, అనఁగా శ ౧౩౮౩-వ వర్షమునకు సరియైన వృషనామసంవత్సర భాద్రపద బ ౧౫ శుక్రవారమునాఁడు చిత్రోలును పేళ్లమిఱ్ఱుతోసహా బ్రాహ్మణులకు దానముచేసెనని యున్నది. ఇందుకు క్రీస్తుశకము ౧౪౬౧-వ సం. సెప్టెంబరు నెల ౪ తేది శుక్రవారము సరిపోవుచున్నది. మఱియొకతావున (శే ౩. ప్ర ౧. పం ౧౦, ౧౧) మాస పక్ష దిన వారములను విడిచి శకాబ్దము చంద్ర (౧) అక్షి (౩) నాగ (౮) అర్ణవ (౪) అనఁగా ౧౩౮౪-వ సంవత్సరమునకు సరియైన వృషనామవర్షమున వైవధీయ యోధశనూరి విబుధ సంరక్షణార్థము చిత్రోలియగ్రహారమును గజపతిపుత్రుఁడును, మహావీరుఁడును నైన హంవీరుని కడనుండి ప్రతిగ్రహించెనని యున్నది. * రెండు స్థలములయందును వృషనామసంవత్సరము సామాన్యమగుటచేత శకాబ్దమును ౧౩౮౩ అనుచో గతాబ్దముగను, ౧౩౮౪ అనుచో వర్తమానాబ్దముగను గ్రహించవలయును. ఇందువల్ల రెండెడలఁ జెప్పిన దానకాలము నొక్కటియే యని తెల్లమగుచున్నది.

---

* ఇచట "అంకానాం వామతో గతిః" అను న్యాయమునకు విరుద్ధముగ అంకములన్నియు సక్రమముగనే కానవచ్చుచున్నవి. శాసనములయందు సర్వసామాన్యముగ కాలమును దెలుపు పద్ధతి ఇది కాదు. కుడినుండి యెడమవైపునకు వానిని చదివినఁగాని సరిపోదు. కడపటిసంఖ్య మొదటను, దాని ముందటి సంఖ్య తరువాతను ఇట్లు మొదటి సంఖ్యవఱకును వ్రాయఁబడియుండును. అట్లుకాక సక్రమముగ వ్రాయు పద్ధతియు లేకపోలేదు. అచటనచట కదాచిత్తుగ

### చరిత్రాంశములు

ఈశాసనమువల్లఁ దెలియవచ్చు చరిత్రాంశములు రెండు: I కపిలేశ్వరుని పరాక్రమాతిశయము : కపిలేశ్వరుఁడు పరాక్రమశాలి; పెక్కు దేశములను జయించెను. ఇందు ముఖ్యమైనవి:

"హంపా కంపమగాత్తదాధికదరా దారాచ ధారాతుర।
ద్వారా కల్బెరగా విముక్తపురగా ఢిల్లీచ భిల్లీకృతా"॥

అను శ్లోకమునఁ జేర్కొనఁబడినవి. ఇవి నాలుగు: ౧. హంప, ౨. ధార, 3. కల్బెరగ, ౪. ఢిల్లీ. ఈ విజయములన్నియు క్రీ. శ. ౧౪౫౮-వ సం. నాఁటి కపిలేశ్వరుని వెలిగలనితామ్రశాసనమునఁ బడి యున్నవి.* కావున కపిలేశ్వరుఁ డీపట్టణప్రభువులను దత్పూర్వమే జయించియుండె ననుట నిశ్చయము.

(౧) కపిలేశ్వరుని హంపావిజయమునుగూర్చి గంగాధరవిరచిత గంగాదాసప్రతాపవిలాస మను గ్రంథమునఁ గొంత చెప్పియున్నది. విద్యానగర చక్రవర్తియగు రెండవ ప్రౌఢదేవరాయల మరణానంతరము అతని కుమారుఁడు మల్లికార్జునరాయలు సామ్రాజ్యపీఠము నధిష్ఠించెను. అతఁడు పసివాఁడగుటచే నతి యదనని తలఁచి కటకము రాజధానిగ నొడ్డెదేశము నేలుచుండిన గజపతియుఁ, గలుబరిగె నేలుచుండిన బహమనీసుల్తానును కలసి యెత్తివచ్చి విద్యానగరమును ముట్టడించిరి. కాని మల్లికార్జునరాయలు వారి నోడించి పాఱఁదోలెను.† వాస్తవముగ మల్లికార్జునరాయలు వీరల నోడించెనో లేదో రుజువుసేయుటకుఁ దగిన సాధనము లేవియుఁ గానరావు. కపిలేశ్వరుఁడు దండెత్తివచ్చి విద్యానగరమును ముట్టడించె ననియు, రాయల నోడించి యతనికడఁ గప్పముగొనెననియు గజపతుల శాసనములు దెల్పుచున్నవి. క్రీ. శ. ౧౫౦౦ నాఁటి యనంతవరతామ్రశాసనమున

"ప్రసహ్య కర్ణాటమహీపతేః పురీం
నిరుధ్య విద్యానగరీం నిజై ర్బలైః,
సమున్నతం మాన మివోచ్ఛ్రయం కరం
సమాదదే కర్కశచక్రవిక్రమః."‡

ఈ ముట్టడియందు విజయ మెవ్వరిదో నిర్ణయించుటకు సాధ్యము కాకపోయినను ముట్టడి జరిగెననుట నిస్సంశయము. ఎప్పుడు జరిగెనో తెలియదు. మల్లికార్జునరాయలు సింహాసన మెక్కిన వెంటనే ముట్టడి ప్రారంభమైనట్లు గంగాధరుఁడు చెప్పియున్నాఁడు. కాని దీని నంగీకరించుటకు వీలుపడదు. శాసనములందు దీని స్థిరపఱచుటకుఁ దగిన యాధార మేమియు లేదు. లభ్యమైన గజపతిశాసనముల మూలమున ముట్టడి నడచిన కాలమును స్థూలముగఁ గనఁగొనవచ్చును. క్రీ. శ. ౧౪౫౦-వ సం. నకు పూర్వము గజపతికపిలేశ్వరుని యధికారము ఆంధ్రదేశమునఁ జెల్లలేదు. తెనఁగుదేశమునఁ గానవచ్చు నతని శాసనములలో మొదటిది పై సంవత్సరము నాఁటిది సింహాచలమునఁ గానవచ్చుచున్నది (340 of 1899); క్రీ. శ. ౧౪౫౨-వ సంవత్సరపు నాఁటి మఱియొక శాసనము శ్రీకూర్మమునందున్నది (817 of 1896); క్రీ. శ. ౧౪౫౪-వ సం. నాఁటి శాసనమొకటి గుంటూరుతాలూకా చింతలపల్లిపాడు గ్రామమున నున్నది. ఇందువల్ల అద్దంకి, కొండవీడు, వినికొండ పట్టణములు కపిలేశ్వరుని స్వాధీనమునం దుండినట్లు తెలియుచున్నది (70 of 1917); క్రీ. శ. ౧౪౫౫-వ సంవత్సరము నాఁటి యొక తామ్రశాసనమున గాణదేవుఁ డనునాతఁడు కొండవీడు నిజరాజధానిగాఁ దత్పరిసర దేశమును గపిలేశ్వరుని పక్షమున

నిట్లు కాలము దెల్పఁబడిన శాసనములును గలవు. ఇంకొకయంశము: 'అక్షి' అను సంకేతమునకు ౨ (రెండు) అని లెక్కపెట్టుట యాచారము. ఆయాచారము ననుసరించిన శకాబ్దము ౧౨౭౮ వృషనామ సంవత్సరమున యోగభళనూరి హంపీరదేవునియొద్ద దానము గొన్నట్లు చెప్పవలసివచ్చును. హంపీరుఁ డప్పుడు పుట్టనైనఁ బుట్టకపోవుటచే నట్లు గుణించుటకు వీలుకాదు. అతఁడు శా. శ. ౧౩౭౩-వ సంవత్సరమున వర్ధిల్లియుండుటచేత నిచట 'పుర' అన్న త్రిపురములను గుణించినట్లు 'అక్షి' యన 'త్ర్యక్షు' ములను లెక్కచేయవలసివచ్చినది. ఇట్లు గుణించు నాచారముగూడ కలదేమో తెలియదు.

* MER 1934-35 *Part ii Para* 67. † *Sources of Vijayanagara History P. 65.* ‡ ఆంధ్రపత్రిక, విభవ ఉగాదిసంచిక, పుట 175.

పాలించుచుండినట్లు చెప్పియున్నది.* ఈ శాసనములనుబట్టి చూడఁగాఁ దెనుఁగుదేశమునఁ గపిలేశ్వరుని యధికారము క్రీ. శ. ౧౪౫౦-వ సం.న నారంభమై క్రమక్రమముగ వర్ధిల్లి క్రీ. శ. ౧౪౫౫-వ సం. నాఁటికి దక్షిణమున నెల్లూరుమండలమువఱకును వ్యాపించెనని తెల్లమగుచున్నది. క్రీ. శ. ౧౪౪౭-వ సంవత్సరము వఱకును కృష్ణకు దక్షిణమున నుండు తెనుఁగుదేశమంతయు రాయరాజ్యమున నిమిడియుండెను. క్రీ. శ. ౧౪౫౪-వ సంవత్సరమున నీ దేశమంతయుఁ గపిలేశ్వరుని యధికారమున నుండెనని పై శాసనములవల్ల స్పష్టపడుచుండుటచేత క్రీ. శ. ౧౪౪౭-౧౪౫౪ సంవత్సరముల మధ్యకాలమునఁ గపిలేశ్వరుఁడు రాయల నోడించి దానిని స్వాధీనపఱచుకొనె ననుట నిశ్చయము. ఇట్లు రాయరాజ్యమునకుఁ జెందిన తూర్పుసముద్రతీర తెనుఁగుదేశము నాక్రమించుకొనినపిమ్మటనే కపిలేశ్వరుఁడు విజయనగరముపై దండెత్తిపోయియుండవలయును. ఇంకొక విధముగఁ జింతించిచూచినను నీ సిద్ధాంతమే సరియైనదని తోఁచుచున్నది. కపిలేశ్వరునికి పెక్కు బిరుదములు గలవు. ఇం దొక్కొక్కటియు నొక్కొక్క దేశముపై విజయమును సూచించును. వీనియం దిచ్చట గమనించఁదగినది 'నవకోటి కర్ణాట కలుబరిగేశ్వర' అనునది' ఇది ప్రప్రథమమున క్రీ. శ. ౧౪౫౭-వ సం. నాఁటి పెలిగలని తామ్రశాసనమునఁ గన్పించుచున్నది. "హంపాకంపమగాత్" అను శ్లోకముగూడ నిందే యుండుటచేతఁ గపిలేశ్వరుఁడు విజయనగరముఁ దత్పూర్వము ముట్టడించె నని తెలియుచున్నది.

(౨) ధార : ఇది మాళవదేశమునకు రాజధాని. కపిలేశ్వరునికాలమున రెండవ మహమ్మదు ఖల్జీ యను నొక తురుష్కపాదుశాహ యచట రాజ్యముసేయుచుండెను; కపిలేశ్వరునికి మహమ్మదుషహాతో నే సందర్భమున నెచ్చట ఘర్షణ కలిగెనో చెప్పుటకు వీలుకాదు; కపిలేశ్వరుఁడు మాళవముపై నెత్తిపోయినట్లుగాని, మహమ్మదు కటకరాజ్యముపై నెత్తివచ్చినట్లుగాని తెల్పు నిదర్శనము లేవియుఁ గానరావు. కాని యీసందర్భమునఁ జింతించఁదగిన విషయ మొకటి కలదు. ఒండొరులపై వారికి ద్వేషములేకున్నను ఆశ్రితులకొఱకు అన్యరాష్ట్రములయందుఁ బోరియుండవచ్చును. ఇట్టి పోరాటమున కేమేనియు నవకాశము గలిగియుండెనో విచారించవలయును. ఫెరిష్టా మొదలగు మహమ్మదీయచరిత్రకారులు బహమనీసుల్తాను రెండవ అల్లాఉద్దీనుచరిత్రమును వర్ణించుచు మాళవసుల్తాను మహమ్మదుతో నతఁ డొనర్చిన యుద్ధమునుగూర్చి యిట్లు వ్రాసియున్నారు: బహమనీసుల్తానుక్రింది యమీరులు జలాల్ ఖాన్ బుఖారియు, నతని పుత్రుఁడగు సికందరుఖానుఁడును దమ ప్రభువుపైఁ గలహించి యతని యధికారమును గూలఁద్రోయసెంచి ధారాసుల్తానగు మహమ్మదుషహాను బహమనీరాజ్యాంతర్గతములైన బీరారు తెలింగాణా దేశములపై నెత్తిరమ్మని ప్రేరేపించిరి. రాజ్యకాంక్షచే మహమ్మదు సైన్యసమేతుఁడై వచ్చి మాహూరముపై దిగి ముట్టడివేసెను. అంతట బహమనీసుల్తాను భీకరసైన్యముతో మాహూరికి రాఁగా మహమ్మదు భయచేతస్కుఁడై పాఱిపోయెను. మహమ్మదీయచరిత్రకారు లీవిజయమునొవిన కీర్తియంతయు నల్లాఉద్దీనుకే అంటఁగట్టినను నతఁ డన్యసహాయము నపేక్షించక మాళవసుల్తాను నెదుర్కొనఁ దలపెట్టలేదు. రేచర్లలింగమనాయఁడు సికందరుఖానుని జయించి యల్లాఉద్దీన్ సుల్తానుని యధికారమును దెలింగాణమున నిల్పినట్లు వెలుగోటివారి వంశావళియందు వచింపఁబడియున్నది. అట్లే కపిలేశ్వరుఁడును నల్లాఉద్దీనునకు బాసటయై మాళవసుల్తానుని మాహూరినుండి తఱిమివేయుటకుఁ దోడ్పడియుండవచ్చును. ఈయూహ రెండు విషయములపై నాధారపడియున్నది: ౧.కపిలేశ్వరునికిని బహమనీసుల్తానుతో సఖ్యము గలదని గంగాదాసప్రతాపమువలనఁ దెలియుచున్నది. ౨. కపిలేశ్వరుఁడు జయించిన పట్టణములలో మాహూర మొకటి యైనట్లొక చాటువునందుఁ జెప్పియున్నది :

సీ. "కటకంబులోపలి గజవాడ బెజవాడ
   యొద్ది బండారిల్లు యోరుగల్లు
తోటకూరంగల్లు తొండమారయుగుల్లు
   పెరటిబచ్చలికోట చెడదకోట
వీరపుంగవులకు వేటలు మాడెలు
   మణికి విహారంబు మాహూరంబు
గజయూథముల గట్టు కంబాలు కంబాలు
   పట్టణంబు గురాలపల్లె ఢిల్లి

* *Ind. Ant* XX. *pp.* 390–93.

గీ. ఇట్టి గజరాజు శౌర్యంబు లెన్ని చూడ
కొలఁదిమీరిన దేవరకొండ కొండ
సీదుకొర్కొంటి సింహంబు నిఖిలబిరుదు
దిశలములుజూపు దా మెరతిమ్మభూప!"[1]

(3) కల్బురగ:- కపిలేశ్వరుఁడు కలుబరిగను అశ్వసైన్యరహితముగ నొనర్చెనని ఈ శాసనమునం దున్నది. ఎప్పుడో చెప్పుటకు వీలుపడదు. మల్లికార్జున రాయల కాలమున, అనఁగా క్రీ.శ. ౧౪౫౭-వ సంవత్సర ప్రాంతమున కపిలేశ్వరుఁడు బహమనీసుల్తానుని రెండ మైత్రిగల్గియుండెనని గంగాదాసప్రతాపవిలాసమువలనఁ దెలియుచున్నది. పైఁ జెప్పినట్లు అల్లాఉద్దీన్ సురత్రాణునకు బాసటయై ధారాసుల్తానుఁ బొఁదోలి మాహూర మును శత్రువిముక్తను సేయుట నిజమగునేని కపిలేశ్వరునికి బహమనీసుల్తానుతోడి స్నేహము క్రీ.శ. ౧౪౫౭-వ సంవత్సర ప్రాంతమునుండియుఁ గలదని చెప్పవచ్చును. ఇతనికి బహమనీసుల్తానుతో వైర మెప్పుడు పొసఁగెనో యితని బిరుదులను బరిశీలించిన స్థూలముగఁ దెలియఁగలదు. క్రీ. శ. ౧౪౫౦-వ సంవత్సరమునకు పూర్వము వ్రాయించిన శాసనములలో బిరుదు లెవ్వియుఁ గానరావు. క్రీ. శ. ౧౪౫౦-వ సం. నాఁటి సింహాచల శాసనమున గజపతి, గౌడేశ్వర అను బిరుదములుమాత్రము గానవచ్చుచున్నవి.[2] ఈ సంవత్సరముననే వేయించిన జగన్నాథాలయములోని శాసనమునసైత మీ రెండుబిరుదులే యున్నవి.[3] క్రీ. శ. ౧౪౫౫-వ సం. నాఁటి శ్రీకూర్మ శాసనమున వీరశ్రీ గజపతి గవుడేశ్వర యనియే యున్నది.[4] క్రీ. శ. ౧౪౫౭-వ సంవత్సరము నాఁటి వెలిగలని తామ్రశాసనమున గజపతి గవుడేశ్వర నవకోటి కర్ణాటకలుబరిగేశ్వర యని యున్నది.[5] ఈ బిరుదులన్నియు క్రీ. శ. ౧౪౫౯-వ సం. నాఁటి పూరీ జగన్నాథాలయ జయవిజయ ద్వార శాసనమునను గానవచ్చుచున్నవి.[6] ఇప్పటికి లభ్యమైన శాసనములను బట్టి చూడఁగా 'నవకోటి కర్ణాట కలుబరిగేశ్వర' అను బిరుదు క్రీ. శ. ౧౪౫౭-వ సంవత్సరమునకుఁ బూర్వము గపిలేశ్వరునకు లేనట్లు తోఁచుచున్నది. ఇది ఆయాదేశములపైఁ గపిలేశ్వరుని విజయములను సూచించును గావునఁ క్రీ. శ. ౧౪౫౫-౫౭ సంవత్సరముల మధ్యకాలమున నతఁడు కర్ణాటకలుబరగ ప్రభువుల నోడించినట్లు తెలియుచున్నది.

క్రీ. శ. ౧౪౫౮-వ సంవత్సరము ఏప్రిలు మాసమున సుల్తాన్ అల్లాఉద్దీన్ మృతినందెను. బహమనీసంస్థానాశ్రితులైన సర్దారు లమీరులకు సుల్తాను అల్లాఉద్దీను యొక్క పెద్దకుమారుఁడు హుమాయూన్ ఖానుఁడు సుల్తానగుట ఇష్టము లేకపోవుటచేత కుట్రలపన్ని యతని తమ్ముఁడగు హసన్ ఖానని సింహాసనము నెక్కించిరి. కొంత యలజడి పుట్టెను.[7] కాని తుదకు హుమాయూన్ ఖానుఁడు సింహాసనము నధిష్ఠించెను. కుట్రకారులలోఁ గొందఱు మడిసిరి. అనేకు లన్యరాజ్యములకుఁ బాఱిపోయిరి. వెంటనే సికందరుఖానుబుఖారి తెలింగాణమున నల్లరి లేపి గోలకొండపై నడచెను. హుమాయూన్ మహా ఖాన్‌జహానను నాతనిఁ గొంతసైన్యముతో వానిని నెదుర్కొనఁ బంపెను. కాని యుద్ధమున ఖాన్‌జహానుఁడు మడిసెను. తరువాత మఱికొంత సైన్యముతో హుమాయూన్ బయలువెడలి సికందరుఖానుని మార్కొని యతనిఁ జంపి, యతనికి చేదోడువాదోడుగ నుండిన దేవరకొండ వెలమరాజును శిక్షించుటకై యొక గొప్ప సైన్యము నంపెను. బహమనీసైన్యము దేవరకొండను ముట్టడించెను. ఆ దుర్గాధిపతికి తురకదండును దఱిమివేయ శక్తిలేకపోయెను. అతఁడు కపిలేశ్వరుని సాయ మడిగెను. కపిలేశ్వరుఁ డొక గొప్ప సైన్యము నంపెను. వీరు తురకదళమును దేవరకొండకడ మార్కొని పరిమార్చిరి. ఈ విజయ మెప్పుడు సమకూడెనో దృఢముగఁ జెప్పుటకు వీలుకాదు. కాని హుమాయూన్ మహా రాజ్యాభిషేకమునకు వెనుకను, క్రీ. శ. ౧౪౬౦-వ సంవత్సరమున అంబదేవుఁడు ఓరుగంటి కోటను స్వాధీనముచేసుకొనిన కాలమునకు మధ్యనుసైయుండవలయును. క్రీ. శ. ౧౪౬౧-వ నాఁటి

1. *Mac. Mss.* 15-4-3. 2. S. I. I. vi. 1089. 3. J. A. S. B. LXII Part i No. 2 p 99. 4. 313 of 1896. 5. A 17 of 1934-35 MER 1934-35 Part ii para 37. 6. J. A.S. B. LXII Part i pp 99-100. 7. Burhan-i-Ma' asir. Ind. Ant. XXVIII pp 242.

వెలిగలని తామ్రశాసనమునఁ 'గలుబెరగావిముక్తతురగా' అని యుండుటచేతను, అప్పటినుండియే కపిలేశ్వరుని శాసనములందు 'కలుబరగేశ్వర' యను బిరుదు కాన వచ్చుచుండుటచేతను, క్రీ. శ. ౧౪౫౭—౧౪౬౦ సం.ల మధ్య తురకదళము దేవరకొండదగ్గర గజపతి సైన్యముచే నోడిపోయి యుండుటచేతను నీ విజయము క్రీ. శ. ౧౪౫౮-వ సం.న నే సమకూడినట్లు తోఁచుచున్నది.

(౪) ఢిల్లీ: కపిలేశ్వరుని కాలమున ఢిల్లీలో లోది వంశజుఁడగు బహ్లోల్ లోదీ రాజ్యము సేయుచుండెను. ఇతనితో కపిలేశ్వరుని కెచట యుద్ధము పొసఁగెనో కనుఁగొనుటకు సాధనము లేవియూ లేవు.

II. శాసనోక్తదానము నొనర్చిన కుమార హంవీర దేవుని వంశక్రమము: ఇతనికి హంవీరవీరేశ్వరుఁ డను పేరును గలదు (చూ: శే ౧ ప్ర ౧ పం ౧౨). ఇతఁడు సూర్యవంశజుఁడైన కపిలేశ్వర దేవుని కుమారుఁడు (చూ: 'అస్తి తేజార్క-సంజ్ఞాకం' 'తద్వంశే కపిలేశ్వర' శే ౧. ప్ర ౧ పం ౩,౪). ఇతఁడు శాసనోక్తకాలమునఁ దండ్రియగు కపిలేశ్వరుని పక్షమునఁ గృష్ణాతట దేశమును బాలించుచుండెను. ఈప్రాంతమున నితని శాసనములు పెక్కు కానవచ్చుచున్నవి.[1] ఈ శాసనములవల్ల నితనికి 'అంబిదేవరాజు', 'హంబీర' లేక హంవీర దేవమహాపాత్రుఁడు అను నామాంతరము లుండినట్లు తెలియవచ్చుచున్నది. ఈసందర్భమునఁ జెప్పవలసిన యంశ మొకటి కలదు. భావసం. ఫాల్గున భారతిలో అంబీర దేవుని యోరుగంటిశిలాశాసనమును బ్రకటించుచు నీ యంబీర, లేక హంబీర దేవుఁడు గజపతి కపిలేశ్వరుని కుమారుఁడని వ్రాసియుంటిని.[2] ఈయభిప్రాయము సరియైనది కాదని ఖండించుచు యువ సం. జ్యేష్ఠ భారతియందు శ్రీగొడవర్తి రామదాసుగారు ఒక విమర్శవ్యాసమును బ్రకటించిరి.[3] సంగ్రహముగ వీరి వాద మిది: ఓరుగంటిశాసనమునను, ఇతర శాసనము లందును బేర్కొనఁబడిన అంబీర, లేక హంబీర, లేక హంవీర దేవుఁడు కపిలేశ్వరుని పుత్రుఁడు గాఁడు. పై శాసనములలో నీతని పేరుతో జోడింపఁబడిన 'కుమార' శబ్దమునకు 'స్కందుఁ'డని యర్థము. అంబీర దేవునకు ఓరుగంటిశాసనమున మహాపాత్రుఁ డను బిరుదుండినట్లు చెప్పియున్నది. రాజపుత్రులకు 'మహాపాత్ర' బిరు దుండుట యసంభవము. 'మహాపాత్రుఁ' డనఁ బెద్ద సేనాధిపతి. కావున అంబీర దేవకుమారమహాపాత్రుఁడు కపిలేశ్వరుని సేనాపతులయం దొక్కఁడగును గాని కుమారుఁడు కాఁజాలఁడు. మఱియు నితఁడు రాజ కుమారుఁడు గాఁడనియు, సేనాపతి యనియు నిశ్చయించుట కొక ప్రబలప్రమాణమును జూపిరి. క్రీ. శ. ౧౪౫౮-వ సం. నాఁటి సింహాచలశాసనమున సూర్య వంశజుఁడు, మందుదేవ మహాపాత్రుని కుమారుఁడు అంబీర దేవకుమార మహాపాత్రుఁ డొకఁడు పేర్కొనఁ బడియున్నాఁడు.[4] ఓరుగంటి శాసనమునఁ బేర్కొనిన యంబీర దేవ కుమారపాత్రుఁడే యితఁ డని గుర్తించిరి.

శ్రీగొడవర్తి రామదాసుగారి వాదము అంగీకరింపఁ దగినది కాదు. మందుని కుమారుఁడగు అంబీర దేవుఁడు ఓరుగంటి శాసనమునందుఁ బేర్కొనఁబడిన యంబీర దేవుఁడు గాఁడు. వారు భిన్నవ్యక్తులు. 'మహాపాత్ర' బిరుదు రాజపుత్రులకు ఉండుట యసంభవమని చెప్పిరి. ఏల ? ఏయాధారము ననుసరించి చేయఁబడినది యీ సిద్ధాంతము? ఊహలతో పనిలేదు. గ్రంథస్థ, లేక శాసనస్థమైన యాధారము చూపువఱకు నీవిషయము నంగీకరించుటకు వీలుకాదు. పైఁ జెప్పఁబడిన యోరుగంటి శాసనమునందే అంబీర దేవుఁడు కపిలేశ్వరుని పుత్రుఁడని విస్పష్టముగఁ జెప్పియున్నది: "గజపతికపిలేంద్ర మహారాయల కుమారుండ అంబ్బీర దేవకుమార మహాపాత్రుండు" అను శాసనవాక్య మిచట పరిశీలించఁదగినది. ఇందు అంబ్బీర దేవ కుమారమహాపాత్రుఁడు గజపతికపిలేంద్రమహారాయల కుమారుఁడేకాని యన్యుఁడు గాఁడని తెల్పియున్నది. 'కపిలేంద్ర మహారాయల కుమారుండు' అని యుండక 'కపిలేంద్ర మహారాయల కుమారుండ' అనియే యున్నది. అనఁగా ఓరుగంటికోటను గొన్న అంబ్బీర కుమారమహాపాత్రుఁడు కపిలేంద్రమహారాయల కుమారుఁడే. అన్యుఁడు, అనఁగా మందుని కుమారుఁడు గాఁడు. సమకాలికులు అంబ్బీర దేవకుమారమహాపాత్రు లిరువు

1. చూ. భారతి సం ౧౨. సం. 3 పుటలు ౪౩౦-౩౧. 2. చూ భారతి సం. ౧౨. సం. 3 పు. ౪౩౧. 3. పైదే. సం. ౧౨. సం. ౬. పుటలు ౭౫౧-౫౪. 4. S. I. I. V. No. 1089.

రుండినందువల్లనే వారియం దెవ్వరు కోటను గానిరో యావిషయమును స్పష్టము సేయుటకే 'కపిలేంద్ర మహారాయల కుమారుండు' అని యాశాసనగ్రంథకర్త వ్రాసెను. కావున శ్రీరామదాసుగారు తలఁచునట్లు అంబీరదేవుఁడు కపిలేంద్రునికి చరిత్రకు తెలియని కొమారుఁడుగాఁడు. సమకాలికు లాతని చక్కఁగ నెఱుఁగుదురు. మహమ్మదీయ చరిత్రకారులు ఫెరిస్తాయును, దబ్బార్యులును నతని చరిత్ర నెఱుఁగుదురు. ప్రస్తుత శాసనగ్రంథకర్త యెఱుఁగును. హంబీరుఁడు (అంబీరుఁడు) కపిలేశ్వరుని కుమారుఁడని ముమ్మాఱు వచించి శ్రీరామదాసుగారి సిద్ధాంతమును ధ్వంసము చేసినాఁడు శాసనగ్రంథకర్త.

## స్థలనిర్ధారణ

ఈ శాసనమున దానోద్దిష్టగ్రామము యొక్క పొలిమేరలు నిర్ణయించు సందర్భమున పెక్కు గ్రామములు పేర్కొనఁబడియున్నవి. దానోద్దిష్టగ్రామము కృష్ణాతీరమందలి చిఱ్ఱవోలు. చిర్వోఁలనియు, చిఱుఁద్రోలనియుఁగూడ నిది పేర్కొనఁబడియున్నది. దీనితోఁజేరిన పల్లె మేళ్ళమిఱ్ఱు; మేడలమిఱ్ఱనికూడ ఒకచోటఁ గలదు. ఇవిగాక దీని సరిహద్దునం దుండిన గ్రామముల పేర్లు మఱికొన్ని యిందు చెప్పఁబడియున్నవి. ఈ గ్రామము లెవ్వి యనఁగా (౧) ఆవలంక, (౨) ఎడ్లలంక, (౩) మెఱకనపల్లి, (౪) ఐల్లులంక, (౫) మోందమూండి, (౬) కైతరాజుపాలెం, (౭) మామిడికుంట, (౮) సాంగళకోడు. ఇందు చిఱ్ఱవోలు కృష్ణాజిల్లా దివితాలూకాయం దున్నది. దీని యిప్పటి పేరు చిరువూలు; దీనికిఁజేరిన పల్లెయగు మేళ్ళ, లేక మేడలమిఱ్ఱు ప్రస్తుతము మేళ్లమఱ్ఱనఁబడుచున్నది. ఎడ్లలంక, మెరకనపల్లియు నేఁటికిని ఆ నామములనే వ్యవహరింపఁబడుచున్నవి. మోందుమూండికి ఇప్పటి పేరు మోదుమూడి. ఇవన్నియు దివితాలూకాయందుఁ గలవు. ఆవలంక, ఐల్లులంక, కైతరాజుపాలెం, మామిడికుంట, సాంగళకోడు మున్నగునవి దొరతనమువారిచేఁ బ్రకటింపఁబడిన 'గ్రామపట్టిక' యను గ్రంథమునఁ గానరావు. అవియు దివితాలూకాలోనే చిరువోలుసమీపమున నుండవలయును.

## ప్రతిగ్రహీతలు

ప్రతిగ్రహీతల పట్టిక రెండవ రేకునందే యారంభమగుచున్నదని పైనఁ జెప్పియున్నాను. మూఁడవ రేకుకడపట కేశవదేవుఁడును, నగరేశ్వరదేవుఁడును భాగస్థులైనట్లు చెప్పఁబడియుండుటచేఁ బ్రతిగ్రహీతల పట్టిక యంతటితో సమాప్తమైనట్లు తోఁచుచున్నది. ప్రతిగ్రహీతల శాఖాసూత్రాదులను జెప్పునప్పుడీశాసన రచయిత యొక పద్ధతి నవలంబించక యిచ్చవచ్చినట్లు వ్రాసియున్నాఁడు. కొందఱిని పేర్కొనునపుడు వారి శాఖాసూత్రములను దెల్పకపోయినను ప్రవరను సంపూర్ణముగఁ జెప్పియున్నాఁడు. అనేకుల గోత్రము సైతము దెలుపలేదు.

### ప్రతిగ్రహీతల పట్టిక

| | పేరు | తండ్రిపేరు | వేదము | సూత్రము | గోత్రము | భాగము |
|---|---|---|---|---|---|---|
| 1 | అండువిల్లి యజ్వా ... | | యజుర్వేది | | కాశ్యప | ౨ |
| 2 | యఱ్ఱగుంటల భాస్కరభట్ట ... | కేశవభట్ట | యజుర్వేది | | కౌండిన్య | ౫ |
| 3 | వల్లభభట్ట ... | | | | ,, | ౧ |
| 4 | గణపతిభట్ట ... | గంగాధరభట్ట | | | ,, | ౬ |
| 5 | గుడిమెట్ట యజ్ఞేశ్వరభట్ట ... | | | | హారీత | ౧ |
| 6 | ఓలేటి సింగాభట్ట ... | | | | శఠమర్షణ | ౨ |
| 7 | గంగాధరభట్ట ... | లక్ష్మణభట్ట | | | భారద్వాజ | ౧ |
| 8 | చఱుకూరి తిరుమలభట్ట ... | | | | కాశ్యప | ౨ |
| 9 | పాములపాటి ఔభళభట్ట ... | | | | శ్రీవత్స | ౧ |
| 10 | వొడ్డె సోమాభట్ట ... | అగ్రవేది లక్ష్మణభట్ట | | | ఆంగీరసబార్హస్పత్యభారద్వాజ | ౧ |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 11 | యఱ్ఱగుంటల కృష్ణభట్ట | ... | కేశవభట్ట | | ౧ |
| 12 | యఱ్ఱగుంటల కేశవభట్ట | ... | అలాడభట్ట | యజుర్వేది | ౧ |
| 13 | యఱ్ఱగుంటల కేశవభట్ట | ... | నరసింహభట్ట | | ౧ |
| 14 | జన్నావఝుల ఓబళభట్ట | ... | | | ౨ |
| 15 | కాటనిగడ్డ లక్ష్మణభట్ట | ... | | | ౧ |
| 16 | ముట్నూరి దుర్గాభట్ట | ... | | | ౧ |
| 17 | సోమయాజుల వల్లభభట్ట | ... } | | | |
| 18 | అజ్జంపూడి పెద్ది | ... } | | | ౧ |
| 19 | చిట్టాల వల్లభన్న | ... } | | | |
| 20 | కట్రువడియం దేవరభట్టః | ... } | | | ౧ |
| 21 | కృష్ణభట్ట యఱ్ఱభట్ట | ... } | | | |
| 22 | పెనుబంచిప్రోలు యఱ్ఱభట్ట | ... } | | | |
| 23 | వీట్టూరి పెద్దిభట్ట | ... } | | | ౧ |
| 24 | వీట్టూరి గంగాధరభట్ట | ... } | | | |
| 25 | ఉట్రవడియం ప్రోలుభట్ట | ... | పర్వ్యభట్ట | | ౧ |
| 26 | కాశిభట్ల కసవాభట్ట | ... | | | ౧ |
| 27 | దొడ్డిసోమయాజుల నరసింహభట్ట | | | | ౧ |
| 28 | మండ సింగాభట్ట | ... | | | ౧ |
| 29 | మండ అనంతభట్ట | ... | | | ౧ |
| 30 | ఎనమండ్రఱ గంగాధరభట్ట | ... | | | ౧ |
| 31 | రామకృష్ణభట్లవారి సింగాభట్ట | ... | | | ౧ |
| 32 | చెఱుకూరి పోతుభట్ట | ... | | | ౧ |
| 33 | వినికొండ రామాభట్ట | ... | | | ౧ |
| 34 | ఎల్లెమంచి కాశీభట్ట | ... | | | ౧ |
| 35 | కాటనిగడ్డి చిట్టిభట్ట | ... | | | ౧ |
| 36 | దోనావఝ్ఝుల వల్లభభట్ట | ... | | | ౧ |
| 37 | భట్లూరి అనంతభట్ట | ... | | | ౧ |
| 38 | ఒడ్డె దేవరభట్ట | ... | | | ౨ |
| 39 | పణ్యారం మాధవభట్ట | ... | | | ౧ |
| 40 | ఎఱ్ఱగుంట్ల తెలుంగరిభట్ట | ... | | | ౧ |
| 41 | చఱుకూరి గంగాధరభట్ట | ... | నరసింహభట్ట | | ౧ |
| 42 | పణ్యారం సింగాభట్ట | ... | | | ౧ |
| 43 | నారాయణద్వివేదుల వల్లభభట్ట | ... } | | | |
| 44 | ఎంటూరి ప్రోలుభట్ట | ... } | | | ౧ |
| 45 | దొడ్డిసోమయాజులవారి ఎల్లుభట్ట | ... } | | | |
| 46 | పణ్యాహారం రామాభట్ట | ... | | | ౧ |
| 47 | పణ్యాహారం అప్పలెభట్ట | ... | | | ౧ |
| 48 | పణ్యాహారం గోపాళభట్ట | ... | | | ౧ |
| 49 | శృంగారం గంగాధరభట్ట | ... | | | ౧ |
| 50 | ఉప్పల దేవర ఒఝః | ... | | | ౨ |
| 51 | తోయూరి రామా ఒఝ | ... | | | ౧ |
| 52 | చల్ల అన్న మోఝ | ... | | | ౧ |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 53 | పెనుమర్తి లింగాభట్ట | ... | | | ౨ |
| 54 | గోడెవర్తి నారాయణభట్ట | ... | | | ౨ |
| 55 | చిట్టి పోచనభట్ట | ... | | | ౧ |
| 56 | తొండపి నాగాఒఝు | ... | | | ౧ |
| 57 | జంపని సోమాభట్ట | ... | | యజుర్వేది | ౧ |

ఇఁక మూఁడవశ్లోకముమీఁది సైమధమువారి వంశ మిట్లు వర్ణింపఁబడియున్నది. సైమధకుల సంభూతుఁడు గంగాధరుఁడు, అతని భార్య యాభళ (శ్లో ౧). వీరిది కౌండిన్యగోత్రము. వీరి కుమారుఁడు ఔభళసూరి (శ్లో ౨). అతని కీర్తి విద్వత్తు(శ్లో ౩,౪). ఇతఁడు శకాబ్దము ౧౩౭౪-వ సం.నకు సరియైన వృషనామవర్షమున గజపతిపుత్రుఁడగు హంవీరునివల్ల సకలబుధులను సంరక్షించుటకొఱకు చిప్రోలిగ్రామము నగ్రహారముగాఁ బడసెను* (శ్లో ౫). పైయౌభళసూరి తమ్ముఁడు గణపతి; ఈయన్నదమ్ము లిరువురును హంవీరమహారాజునుండి పొందిన చిప్రోలి హర్మ్యస్థలమున నుండిరి † (శ్లో ౬). గణపతియొక్క విద్యాతిశయ సుజాతిశయప్రశంస(శ్లో ౭,౮). సైమధీయగంగాధరపుత్రుఁడును, కౌండిన్యగోత్రజుఁడునునగు యౌభళేశ్వరునికి పది భాగములు. ఇతర భాగస్వాములు:

* 'అగ్రే౭గాత్' అని శాసనమూలము. 'అగాత్' అను క్రియకు 'పోయెను' అని యర్థము. సందర్భము ననుసరించి యిచ్చట 'పొందెను' 'పడసెను' అను నర్థము కావలసియున్నది. † ఈ శ్లోకమునందును అన్వయము చక్కఁగ కుదురలేదు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 58 | పెనుమర్తి గణపతి | ... | | | ౧ |
| 59 | సామధీయ ఔభళ | ... | గంగాధర | కౌండిన్య | ౧౦ |
| 60 | అందువిళ సోమాభట్ట | ... | | కాశ్యప | ౧ |
| 61 | ఘడియారం గంగాధరభట్ట | ... | | | ౫ |
| 62 | నారాయణ యజ్వ | ... | | | ౨ |
| 63 | అద్నపలి తిప్పాభట్టః | ... | | | ౨ |
| 64 | మారెళ నారాయణభట్ట | ... | | | ౧ |
| 65 | భాగవతి రామాభట్ట | ... | | | ౧ |
| 66 | ,, యల్లుభట్ట | ... | | | ౧ |
| 67 | గడియారం సర్వాభట్ట | ... | | | ౧ |
| 68 | సిద్ధి యల్లుసోమయాజీ | ... | | | ౨ |
| 69 | రాజకొండ మల్లుభట్ట | ... | | | ౧ |
| 70 | అడాడ రామాభట్ట | ... | | | ౨ |
| 71 | పెద్దిభట్ట | ... | కోటమామిడిభట్ట | | ౧ |
| 72 | రామభట్ట | ... | పావమానభట్ట | భారద్వాజ | ౧ |
| 73 | సామనారాయణ ద్వివేది | ... | | కౌండిన్య | ౧ |
| 74 | గంగాధరభట్ట | ... | లక్ష్మణభట్ట | భారద్వాజ | ౧ (పునశ్చ భాగః) |
| 75 | కామభట్ట | ... } | | | ౧ |
| 76 | తిరుమలభట్ట | ... } | | | |
| 77 | కొండవీటి యల్లుభట్ట | ... | | | ౨ |
| 78 | ఇందవూరి ఔభళభట్ట | ... | | | ౨ |
| 79 | వెలంకి అనంభట్ట | ... | | | ౧ |
| 80 | కటంగూరి తిమ్మభట్ట | ... | | | ౧ |
| 81 | యాజ్వారి నారాయణభట్ట | ... | | | ౧ |

| | | | | |
|---|---|---|---|---|
| 82 | యల్లుభట్ట | ... | | ౧ |
| 83 | కంభంపాటి కామభట్ట | ... | | ౧ |
| 84 | పెనుమత్తి గంగాధరభట్ట | ... | కౌండిన్య | ౪ |
| 85 | ముకుందుని సింగయ | ... } | | ౧ |
| 86 | గుడిమెట్ట నారుభట్ట | ... } | | |
| 87 | వెలంగూరి నరసింహభట్ట | ... | | ౧ |
| 88 | భైరవభట్ట | ... | | ౧ |
| 89 | కూచి మల్లావధాని | ... | | ౧ |
| 90 | చల్ల నరహరిభట్టః | ... | కౌండిన్య | ౧ |
| 91 | వేమూరు గంగాధరభట్ట | ... | శ్రీవత్స | ౧ |
| 92 | మారెళ ఎల్లుభట్ట | ... | | ౧ |
| 93 | పులె ఛీకేశ్వరభట్ట | ... | | ౧ |
| 94 | తిరుమల భాగవతి | ... | సిరిగిరివొజ్జ | ౧ |
| 95 | కొంతభట్ట | ... | | ౧ |
| 96 | లొల్ల వల్లభభట్ట | ... | | ౧ |
| 97 | భాస్కరభట్ట | ... | | ౨ |
| 98 | పహిండి కృష్ణభట్ట | ... | | ౧ |
| 99 | పుట్టాభట్ట | ... | | ౧ |
| 100 | యల్లాభట్ట | ... | | ౧ |
| 101 | ఒడ్డె సింగాభట్ట | ... | | ౨ |
| 102 | శ్రీకొండ నారాయణభట్ట | ... | | ౧ |
| 103 | మంచిభట్ట | ... | | ౧ |
| 104 | యజ్ఞజంటల చిటికేశవభట్ట | ... | | ౩ |
| 105 | కేశఒఝుల వల్లంభట్ట | ... | | ౧ |
| 106 | జన్నసాని అన్నమభట్ట | ... | | ౧ |
| 107 | ముప్పి అప్పలెఒఝ | ... | | ౧ |
| 108 | కేశవదేవ | ... | | ౧ |
| 109 | నగరేశ్వరదేవ | ... | | ౧ |

ఇందు ప్రతిగ్రహీతలయం దనేకులు ఇంటి పేర్లతోఁగూడ పేర్కొనఁబడియున్నారు. వీనియం దనేకములు నేఁటికిని ప్రచారమున నున్నవి. ఎజ్ఞగుంటల, గుడిమెట్ట, ఓకేటి, చఱుకూరి, పాములపాటి, వొ (ఒ) డ్డె, జన్నావఝుల, కొటనిగడ్డ, ముట్నూరి, సోమయాజుల, అజ్జంపూడి, చిట్టాల, వట్రు (ఉట్ర) వడియం, పెకుబంగిప్రోలు, ఏట్టూరి, కాశీభట్ల, దొడ్డి సోమయాజుల, మండ, ఎనమంత్రి, రామకృష్ణభట్లవారి, వినికొండ, ఎల్లెమంచి, దోనావఝుల, భట్లూరి, పణ్యారం, నారాయణద్వివేదుల, ఎంటూరి, పణ్యాకారం, శృంగారం, ఉప్పల, తోయూరి, చల్ల, పెనుమర్తి, గొడెవర్తి, తొండపి, జంపని, సైపధీయ, అందువిళ్, ఘ (గ) డియారం, అద్దుపలి, మారెళ్, భాగవత, సిద్ధి, రాజుకొండ, అడాన, కోట, పావమాన, సామ, కొండపీటి, ఇందజొరి, వెలంకి, కటంగూరి, యాజ్వూరి, కంభంపాటి, ముకుందుని, వెలంగూరి, కూచి, వేమూరు, పులె, లొల్ల, పహిండి, శ్రీకొండ, యజ్ఞజంటల, కేశఒఝుల, జన్నసాని, ముప్పి.— ఈ యింటిపేర్లను నాలుగుతరగతులుగ విభజించవచ్చును: (౧) పెక్కు నివాసగ్రామములవల్ల గలిగినవి. (౨) మూలపురుషునివల్లఁ గలిగినవి కొన్ని. (౩) అన్యదేశాగతులగుటవలనఁ గలిగినవి మఱికొన్ని. (౪) వైదుష్యమువల్లఁ గలిగినవి యొకకొన్ని. పైఁ బేర్కొనఁబడిన యింటిపేర్లనుగూర్చి విశేషించి చెప్పవలసిన

ఏదియు లేదు; కాని యం దొక్కటియగు 'పణ్యారం' నుగురించి కొంత చర్చ యవసరము. మిత్రులు డాక్టరు చిలుకూరు నారాయణరావుగారు పండితారాధ్య చరిత్రకుఁ దాము విరచించిన బృహత్పీఠికయందు 'పణ్యారం' శబ్దార్థము నిట్లు నిర్వచించియున్నారు:

"ఇది 'ప్రతిహారము' నుండి పుట్టినదని నా తలంపు. 'ప్రతిహారుఁడు' అంటే 'సేవకుడు'. ప్రతిహారమంటే సేవ. ప్రతిహారము, పడిహారము, పణిహారము, పణియారము, పణ్యారము అనే రీతిగా మార్పు కలిగినది. 'పణిహారమువారు' అని వైష్ణవ కుటుంబమువా రుంటున్నారు. 'ఆలయములో కైంకర్యము చేసేవారు' గనుక ఆ యింటివారి కాపేరు వచ్చినది. ఇప్పుడు 'ఫణిహారమువా'రని చెప్పుకొంటారు. వైష్ణవులయి ఉండి వా రట్లు శివపరమైన పేరు ఏర్పరచుకొనడము తగదు."*

ప్రతిహారము, పడిహారము, పణిహారము, పణియారము, పణ్యారము అను నీ యైదుమాటలకు నొండొంటితో లంకె వేసి యవి యన్నియు 'ప్రతిహారము'నకు పరిణామము లని నారాయణరావుగారు సిద్ధాంతీకరించి యున్నారు కదా. కాని ఇవి యన్నియు 'ప్రతిహారము'నకు పరిణామమువల్ల యేర్పడిన రూపాంతరములని యొప్పుకొనుటకు వీలుపడదు. ప్రతిహారమునకు పడియార, లేక పడిహారశబ్దము తద్భవరూపమని కన్నడ నైఘంటుకుల యభిప్రాయము. అది సరియైనచో 'పణిహారము' 'పడిహారము'నకు రూపాంతరమగును; కాని పణియార, పణ్యార శబ్దములకు వీనితో సంబంధము గలుపుటకు వీలు లేదు. ఇవి వేఱ్వేఱుపదములు, వేఱ్వేఱు ధాతువులనుండి యుత్పత్తిల్లినవి. అర్థమునందుఁ గూడ భేదించుచున్నవి. నారాయణరావుగారీపదముల పూర్వోత్తరమును నింపాదిగ పరిశీలించియుండిన నీ విషయము వారికి స్పష్టమైయుండెడిది. 'ప్రతిహారము' అంటే 'సేవ', 'ప్రతీహారుడు' అంటే 'సేవకుఁడు' అని నారాయణరావుగారీ రెండుమాటలకు అర్థము చెప్పియున్నారు. ఇది తప్పు. 'ప్రతిహారము' అను మాటకు 'ద్వారము' అని యర్థము. ప్రతిహారమును పాలించువాఁడు ప్రతీహారుఁడు. కావున 'ప్రతీహారుఁ' డనఁగా 'ద్వారపాలుఁ' డని యర్థము. 'ప్రతీహారి' వృత్తి సేవకావృత్తులలోఁ జేరినదే; కాని దానికి 'సేవకుఁడు' అను సామాన్యార్థము చెల్లదు. ఇఁక పడిహార, పణిహార శబ్దములు ప్రతీహార శబ్దభవము లగుటచే వీనిగూర్చి ప్రత్యేక చర్చ యనావశ్యము.

నారాయణరావుగారు పేర్కొన్న ఐదుపదములలో నిఁక 'పణియారము', 'పణ్యారము' అనునవి రెండు మిగిలియున్నవి. ఇందు 'పణియారము' 'పణ్యారము'నకుఁ బ్రాచీనరూపము. ఇది యరవము నుండి యెరవుదెచ్చుకొనినమాట యని బ్రౌనుగారి యభిప్రాయము. అరవమున 'పణియార'శబ్దము గలదు. ఇది సంస్కృత'పణ్య'శబ్దభవ మని తమిలు(ళు)లెక్సికన్ కర్తలు గ్రహించియున్నారు. కాని 'పణ్య'శబ్దము నుండి 'పణ్యార' మెట్లుత్పత్తిల్లెనో వారు చెప్పలేదు. ఈ విషయ మిప్పుడు పరిష్కృతమగుచుండు నీశాసనము వల్ల విదితమగుచున్నది. ఇందు 'పణ్యాహారము'వారనియు, 'పణ్యారము'వారనియు గృహనామముగల రెండు బ్రాహ్మణకుటుంబములు పేర్కొనఁబడియున్నవి. 'పణ్యాహార' 'పణ్యార' శబ్దము లొక్కటియే యనియు, రెండవది మొదటిదాని రూపాంతరమనియు స్వయంవ్యక్తముగఁ దెలియుచున్నది. 'పణ్య + ఆహార' అను రెండు పదముల కలయికచే 'పణ్యాహార' శబ్ద ముత్పత్తియగుచున్నది. 'పణ్య' శబ్దమునకు 'అమ్మఁదగినది' లేక 'కొనఁదగినది' అని యర్థము. 'ఆహార' మనఁగా తినఁదగిన పదార్థము, భక్ష్యము. 'పణ్యాహార'మన్న విక్రయార్థము సేయఁబడిన భక్ష్యమని తేలుచున్నది. ఇది దీని మొదటి యర్థము. ఈ యర్థము నుండి మఱికొన్ని విశేషార్థములు బయలుదేరినవి. వాని నిచ్చుటఁ దడవఁబని లేదు.

ఈశాసనపరిష్కార సందర్భమున రా. బ. శ్రీ సి. ఆర్. కృష్ణమాచార్యులుగారును, డాక్టరు వి. రాఘవన్ గారును, శ్రీ హెచ్. శేషయ్యగారును నాకు అమూల్యమైన సహాయ మొనర్చిరి. వారికి వందనములు సమర్పించుచున్నాను.

---

* పండిత. (ఆం. గ్రం. సం 30) పుట ౨౬౩.

# మూలం

## మొదటిరేకు : మొదటిప్రక్క

౧ శుభమస్తు [॥*] హరిఃకిరితనుకిపాతులోకోద్భ[1]తి విలాసభాక్[*।] సరసాయాభు[వ]

౨ స్సంగాదేవ రోమాంచనాంచితః । [।*] శుభం శిభ[2]శిరోభూషా కళా చాంద్రీ కరో తు వః । సు

౩ ధాధాతవసాభాతియాజటాతటిసీతకే । [।*] అస్తితేజార్క[2a]సంజ్ఞాకం మహిత

౪ ంమహతాంగణైః । సకృద్భువనజాతానాం కమలోధేతి [య *]త్కరైః। [।*] తద్వంశే క[పి] లే

౫ శ్వరసకళభూనాథప్రతాపానలజ్వాలాజాలతిరస్కృదుజ్వలలసత్తేజో విశేషారుణః

౬ లోకాలోకలలామభూత విలసత్కీర్తి ప్రభాశు[3]త ప్రస్ఫూర్జత్కకుబంతరో విజయ

౭ తేభూమండలాఖండలః। [।*] వీర(శ్రీ)కపిలేశ్వరక్షితిపతేధాటీ[4]షు భేరీధ్వనౌ। భారా భుగ్న భుజంగ

౮ పుంగవఫణాస్ఫారాంత్తదిఙ్మండలే । హంపాకంపమగాత్తదాధికదరాధా

౯ రాచధారాతుర [।*] ద్వారా కల్బెరగావిముక్తతురగా ఢిల్లీచభిల్లీవృతా। [।*] తత్పుత్రః పరభూ

---

1. 'ద్భ్రి' అని చదువవలయును. 2. 'శివ' అని. 2a. 'తేజోఽర్క' అని. 3. 'విలసత్కీర్తి ప్రభాక్షా ళిత' అని. 4. 'ధాటీషు' అని.

౧౦ పవారణఘటాపంచాననస్సంచితా [।*] నేకోద్యత్సుకృతః కృతాఖిలమహీబ్రహ్మ ప్రతిష్ఠాపనః ।

౧౧ అర్థివ్రాతసురద్రుమస్సురసభానింవాసి[1]నారీమణీ [।*] గీతస్ఫీతగుణాకరచ్ఛి [2] రమహాం పీరఃకుమారో

౧౨ విభుః[।*]పీరశ్రీకపిలేశ్వరస్య తనయేహాంపీరవీరేశ్వరే[।*]నన్నద్ధోద్ధురసింధురంధ్వనిత

౧౩ దిగ్భాగంసమారోహతి। ఆరోహంత్యరయః శిరాంస్యుత ముహుర్గ్రాణ్ణాంకు

౧౪ చాగ్రణీవా[।*] స్వస్త్రీణామథవా తదీయచరణద్వంద్వం భజంతే సదా। [।*]మంగళ మహా శ్రీ శ్రీ శ్రీ

మొదటి రేకు : రెండవప్రక్క



౧ శాకేరామేభలోకద్విజపతిగణితే వత్సరేస్మిన్ వృషాఖ్యే [।*] యానే భాద్రేచకుంహ్వాం[3] భృగుతన

౨ యదినే దేవహాంపీరభూపః।చిర్రోలిగ్రామ ముర్వీ విబుధసమితయే మేళ్లమిఱ్ఱప్ర

3 యుక్తం[।*] ప్రాదాత్కృష్ణాతటస్థం సహఫలతరుభిస్సర్వమాన్యం స్వనామ్నా।[।*] శ్రీమత్ప్ర

౪ తాపహాంపీరకుమారసత్పురస్యచ।[4]సీమాచిహ్నాని సర్వాణి[5]విలిఖ్యంత్తే [ఽ*]ంధ్ర భాష

౫ యా। [।*] పశ్చిమానకు ఆవలంక పడుమట గొంగపూండివారి గుట్టలు కడపల । ఈ లంకకే ఉత్తరానకు గొంగపూండివారు వేయించిన గుట్టలు క

1. 'సంవాసి' అని. 2. 'గుణాకరశ్చిర' అని. 3. 'మానే భాద్రేచ కుహ్వాం' అని చదువవలయును. 4. 'కుమారస్య పురస్య' అని. 5. 'సర్వాణి' అని.

౬ డపల । ఆవలంకతూపుఁనను బోలావానిచేని వుత్తరం కడపల । ఆచేనితుప్పూఁనను[1] గోపాళుని చేని ఉత్తరం కడ

౭ పల। ఆచేనితూపుఁనను బయ్యరాజు కోడె వుత్తరపు పొలమేర । ఈశాన్యం చిఱువోలి మెఱకనపల్లి సంద్దు

౮ కు అరుజాబయ్యరిసేని తూపుఁగట్టు పొలమేర [।*] ఆతూపుఁకు వెల్లాణిగరువు కడపల[।*]

౯ చిఱువోలి మెరకనపల్లి మేడలమిత్తిఁపొలానకు ముత్తలచేను చిఱువోలి కేశవరాయని చేను తూ

౧౦ పుఁంగడపల । ఆగ్నేయంమూలకు తెల్లులంకదక్షనను క్రిష్ణవెణ్ణ[2]కడపల । దక్షాన[2a] మోందుమూండి చిఱు

౧౧ వోలి పొలమెర ఎడ్లలంక దక్షిణం అడుసుంగాలువ కడపల। చిఱువోలికిన్ని జైతరాజు పాలెంకు పొలమెర

౧౨ తెల్లిపల్లాం కడపల । గ్రామగ్రాసం మేడలమిత్తిఁపొలమెర దక్షిణానకు క్రిష్ణ[3] కడపల। పశ్చిమాన

౧౩ కు మామిడికుంట్ల కడపల । వుత్తరానకు పూరంమ్మచెఱువు వుత్తరపుగట్టు కడపల । తూపుఁనా

౧౪ ంగళకోడు కడపల । [।*] శ్రీహంవీరకుమారో[౽*] యం యాచతే భావిభూపతీఁ ।

౧౫ ఆచంద్రతారకం ధీమాన్సద్ధర్మం పాలయం త్వితి। [।*]జీయాదేకైక

౧౬ భాగిభ్యో మహంవీరనృపాజ్ఞయా । శ్రీ కాంతతింమయా

౧౭ ర్యాభ్యాం కథితం ధర్మశాసనం [॥*] ఏకైవ భగినీ లోకే సర్వేషామేవ భూభు

౧౮ జాం । నభోజ్యా నకరగ్రాహ్యా వి[ప్ర] దత్తా వసుంధరా[॥*] మంగళమహాశ్రీ.

రెండవరేకు : మొదటిప్రక్క

౧ చిఱుఁవ్రోలికుమార శ్రీహంవీరపురభాగినః ॥ లిఖ్యంతే [౽*] ద్యసద్ధమఁహమ్యఁ స్తంభానివాచలాః[4][।]యజు

౨ వేఁదీకాశ్యపః। అండువిల్లియజ్వాద్విభాగీ। కౌండిన్యః కేశవభట్టపుత్రః। యజువేఁదీ

౩ యఱ్ఱగుంటల భాస్కరభట్టః పంచభాగీ । కౌండిన్యః (!) వల్లభభట్టః ఏకభాగీ।

౪ కౌండిన్యః గంగాధరభట్టపుత్రః గణపతిభట్టః షడ్భాగీ। హారీతః గుడిమెట్టయజ్ఞేశ్వర

౫ భట్ట ఏకభాగీ। శటమపణః[4a] ఓలేటిశింగా[5] భట్టః ద్విభాగీ। భారద్వాజః లక్ష్మణభట్ట

౬ పుత్రః గంగాధరభట్ట ఏకభాగీ। కాశ్యపః నఱకూరితిరుమలభట్టః ద్విభాగీ। శ్రీవ

---

1. 'పూర్వనను' అని. 2. 'దక్షిణానను కృష్ణవెణ్ణ' అని. 2a 'దక్షిణాన' అని. 3. 'కృష్ణ' అని.
4. ఈ శ్లోకములో ప్రథమ తృతీయపాదములయం దొక్కొక్క మాత్ర తగ్గుచున్నది. 4 a. 'శఠమర్షణః.'
5. సింగా.

౭ త్సగోత్రః పాములపాటి ఔభళ[1] భట్ట ఏకభాగీ। ఆంగీరసబార్హస్పత్యభారద్వాజ(ః)గో
౮ త్రః అగ్రవేదిలక్ష్మణభట్టపుత్రః వొడ్డెసోమాభట్టఏకభాగీ[।*] కేశవభట్టపుత్రః యఱ్ఱ
౯ గుంటలకృష్ణభట్టః ఏకభాగీ। అలాడభట్టపుత్రః యజుర్వేదీ యఱ్ఱగుంటల కేశవభట్టఃఏ
౧౦ కభాగీ । నరసింహాభట్టపుత్ర [ః*] యఱ్ఱగుంటలకేశవభట్టః ఏకభాగీ । జన్నావొఝు
లఔభ
౧౧ ళభట్టః ద్విభాగీ। కాటనిగడ్డ లక్ష్మణభట్టః ఏకభాగీ। ముట్నూరిదుగ్గాభట్ట ఏక [భా]
౧౨ గీ। సోమయాజుల వల్లభభట్టః అజ్జంపూండిపెద్ది చిట్టాలవల్లభన్న ఇతిత్రయాణామే
౧౩ కో భాగః। వట్రువడియం దేవరెభట్టః కృష్ణభట్టయఱ్ఱభట్ట ఇతీత్యుభయోరప్యే
౧౪ [కో] భాగః । పెనుబంచిప్రోలియఱ్ఱభట్టః ఏట్టూరి పెద్దిభట్టః ఏటూరి[2]గంగాధర
౧౫ భట్ట ఇతిత్రయాణామప్యేకో భాగః। నవాఱభట[3]పుత్రఃఉట్రవడియంప్రోలుభట్ట

## రెండవరేకు : రెండవప్రక్క

౧ ఏకభాగీ। కాశిభట్లకనవాభట్ట ఏకభాగీ। దొడ్డిసోమయాజుల నరసింహాభ
౨ ట్టః ఏకభాగీ। మండశింగా[4]భట్ట ఏకభాగీ। మండ అనంతభట్టః ఏకభాగీ।
౩ ఏనమంౘఅగంగాధరభట్ట ఏకభాగీ। రామకృష్ణభట్లవారి శింగాభటః[5] ఏకభా
౪ గీ। చెఱ్ఱకూరి పోతుభట్ట ఏకభాగీ। వినికొండరామాభట్ట ఏకభాగీ। ఎల్లెమంచికాశి
౫ భట్ట ఏకభాగీ। కాటనిగడ్డ చిట్టిభట్ట ఏకభాగీ। దోనావఝ్ఝలవల్లభభట్ట ఏకభాగీ [।*]

1. 'భళ' పంక్తిమీఁద వ్రాయఁబడియున్నది. 2. 'ఏట్టూరి' 3. భట్ట. 4. 'సింగా'. 5. 'సింగాభట్టః.'

౬ భట్లూరి అనంతభట్ట ఏకభాగీ। ఒడ్డెదేవరెభట్ట ద్వి[1]భాగీ। పణ్యారం మాధవభట్ట
౭ ఏకభాగీ। ఎఱ్ఱగు [ం*] ట్టల తెలుంగరిభట్ట ఏకభాగీ। చఱ్ఱకూరి నరశింహ్యా[2]భట్ట
౮ పుత్రగంగాధరభట్ట ఏకభాగీ। పణ్యారం శింగా[3]భట్ట ఏకభాగీ। నారాయణద్వివేదు
౯ ల వల్లభభట్ట ఎంటూరిప్రోలుభట్ట దొడ్డిసోమయాజులవారి ఎల్లుభట్ట ఇతి
౧౦ త్రయాణా మప్యేకో భాగః। పణ్యాహారం రామాభట్ట ఏకభాగీ। పణ్యాహారం
౧౧ అప్పలెభట్ట ఏకభాగీ। పణ్యాహారం గోపాళభట్ట ఏకభాగీ। శృంగారం గంగా
౧౨ ధరభట్ట ఏకభాగీ। ఉప్పలదేవరబఝః ద్విభాగీ। ఓయూరిరామాబఝ ఏకభా
౧౩ గీ।చల్ల అన్నవోఝ ఏకభాగీ। పెనుమత్ఱిలింగాభట్టః ద్విభాగీ।గోడవఱ్ఱి నారాయణభ
౧౪ ట్టః ద్విభాగీ। చిట్టిపోచనభట్టః ఏకభాగీ। తొండ్డపి నాగాబఝఃఏకభాగీ [।*]యజుర్వేది
౧౫ జంపనిసో మాభట్ట ఏకభాగీ।

## మూఁడవ రేకు : మొదటి ప్రక్క

౧ ప్రఖ్యాత నైషధకులే సమభూద్బుధేంద్రో గంగాధర స్సకలవేదవిదాం వరేణ్యః। గౌరీ
వ సర్వజ
౨ స మంగళ సుందరాంగీ శ్రీ యాభళా గుణవతీ భువి తస్యభార్యా[।*] శ్రీయాభళాయా
౩ ముదగాత్కుమారో గంగాధరా దాభళనామసూరిః। మణిః పయోదాదివ శుక్తి
౪ కాయాం కౌండిన్యగోత్రాంబుధిశీతరశ్మిః। [।*]హారంత్యాసు సరోరుహాం తిభువ। [నే]

1. 'ఏక' మొదట వ్రాసి, 'ఏ'ను 'ద్వి'గా దిద్ది 'క' విూదకుడుపు పెట్టఁబడియున్నది. 2. 'నరసింహా'. 3. 'సింగా', 4. మొదట 'శ' వ్రాసి తరువాత వది 'హ'గ దిద్దబడియున్నది.

౫ తారంతిహారంత్యథోసిహారంతిపటీరదుగ్ధకుముదం త్యంభోధిఫేనంతి [చ]। నూ [నం]

౬ నైషధయాభళస్య బహుధా సత్కీర్తి కాయ స్సర్వదా స్తో యుం కల్ప లతాయుతే సుర
గవీబ్బృందాయ

౭ తే త్వర్థినాం। [।*] భాషాసు సర్వా [స్వ] పి శారదాయతే [।*] వేదేషు సర్వేషు
చతుర్ముఖాయతే [।*] భా [ష్యా]

౮ ది శాస్త్రేషు ఫణీశ్వరాయతే [।*] శ్రీనైషధీయాభళకోవిదేశ్వరః। [।*] అగ్రే గా
దగ్రహారం త్రి

౯ భువనతిలకో నైషధీయాభళేంద్రో [।*] హంపీరాల్లోకవీరా ద్గజపతినృపతే ర్భాగ్య
పుత్రాత్ప

౧౦ విత్రాత్। చిర్వోలిగ్రామమేతం సకలవిబుధసంరక్షణార్థం ద్విజేంద్ర [।*] శ్శాకే
చంద్రాక్షినాగా

౧౧ వపరిగణితే వత్సరేస్మి న్వృషాఖ్యే। [।*] శ్రీగంగాధర సూరిరాజ తనయో
కౌండిన్యగోత్రోద్భవో [।*] సోహో

౧౨ ర్భువిరామలక్ష్మణసమా సర్వజ్ఞ చూడామణి[1]। శ్రీమా నౌభళకోవిదో గణపతిశ్చా
శేషసంపన్నిధీ [।*] హం

౧౩ పీరాఖ్యనృపాదుభౌనిజయత[2]శ్చిర్వోలి హర్మ్యస్థలే। [।*] సంగీత సరసకవితాసంగతి
రతి[3]మానసంగమేరాంగః।

---

1. 'చూడామణీ' అని. 2. 'విజయత'. 3. 'రతి' పంక్తి క్రింద సూక్ష్మముగా చెక్కఁబడియున్నది.

౧౪ శృంగారామృతపూరో గంగాధరసుత గణపతిశ్రీమాన్। [।*] భాగీగణపతినామా త్యాగీ
పెనుమరితి వ[ం*]శ చం

౧౫ ద్రో[౭*]యం। భోగీ సర్వసుఖానాం రాగీ సన్మిత్రరమ్యసల్లాపే। [।*] గంగాధరార్య
పుత్రో [*౭]సౌ నైమధీయాంభశేశ్వరః।

౧౬ కౌండిన్యగోత్రసంభూతో[1] దశభాగీపతి ర్మహాన్। [।*] అందుపిళ సోమాభట్టః కాశ్య
ప ఏకభాగీ।

౧౭ ఘడియారం గంగాధరభట్టః పంచభాగీ। నారాయణయజ్వా ద్విభాగీ। అద్దుపలి
తిపా[2]భట్టః ద్వి

మూఁడవరేకు : రెండవప్రక్క

౧ భాగీ [।*] మారెళనారాయణభట్ట ఏకభాగీ [।*] భాగవతరామాభట్ట ఏకభాగీ। [*]
ఆయజ్జుభట్ట ఏ

౨ కభాగీ [।*] గడియారంసర్వాభట్ట ఏకభాగీ [॥*] సిద్ధియజ్జుసోమయాజినో ద్విభాగినః
[।*] రాజుకొండమల

3 ల్లుభట్ట ఏకభాగీ[।*]అడాడరామాభట్ట[ః*]ద్విభాగీ [।*] కోటమామిడిభట్టపుత్ర పెద్ది
భట్ట ఏకభాగీ[।*]పౌవ

౪ మానభట్టపుత్రరామభట్టో[3]భారద్వజ[4] ఏకభాగీ[।*]సామకనారాయణ ద్వేది కౌండిన్య
ఏకభాగీ [।*]

---

1. తుడుపుమీఁది వ్రాఁత. 2. 'తిప్పా' అని. 3. 'ఏక' వ్రాసి తుడుపుపెట్టి 'ద్వి' గా దిద్దబడినది.
4. 'ర' గీటుపై వ్రాసియున్నది. 'భారద్వాజ'అని చదువవలయును.

౫ లక్ష్మణభట్టపుత్రో గంగాధరభట్ట[ః*] భారద్వాజః పునరేకభాగీ [।*] కామాభట్ట తిరుమలభ

౬ ట్టయోరేకభాగః[।*] కొండవీటియల్లుభట్ట[ః*] ద్విభాగీ[।*] ఇందబూరి సో[మశ*]భట్ట[ః*] ద్విభాగీ[।*] వెలంకి అనం

౭ భట్ట[ః*] ఏకభాగీ[।*] కటంగూరి తిమ్మా[*—తి]భట్ట[ః*] ఏకభాగీ [।*] యాబ్బూరి నారాయణభట్ట[ః*] ఏకభాగీ[।*]

౮ యల్లుభట్ట[ః*] ఏకభాగీ[।*] కంభంపాటి కామాభట్ట[ః*] ఏకభాగీ[।*] పెనుమత్తి గంగాధరభ

౯ ట్టః కౌండిన్యగోత్ర[।*] చతుర్భా[1]గీ[।*] ముకుందుని సింగయ[2] గుడిమెట్ట సూరభట్టయో రేకభా

౧౦ గీ[3] [।*] వెలంగూరి నరసింహ్య[4]భట్ట ఏకభాగీ[।*] భైరవభట్ట ఏకభాగీ[।*] కూచిమల్లా వధాని ఏకభాగీ[।*]

౧౧ చల్లనరహరిభట్ట [।*] కౌండిన్య ఏకభాగీ[।*] వేమూరి గంగాధరభట్ట[ః*] శ్రీవత్స ఏకభాగీ[।*]

౧౨ మారెళ్ళ ఎల్లుభట్ట ఏకభాగీ[।*] పులభీమేశ్వరభట్ట ఏకభాగీ[।*] శిరిగిరి[5] వాజ్జ పుత్ర తిరుమ

౧౩ లభాగవతి ఏకభాగీ[।*] కాంతభట్ట(ః) ఏకభాగీ[।*] లొల్లవల్లవభట్ట భాగీ[6] [।*] భాస్కర భట్ట[*ః] ద్వి [భా]

౧౪ గీ[।*] పహిండి క్రిష్ణ[7]భట్ట ఏకభాగీ [।*] పుట్టా[ః*] భట్ట ఏకభాగీ [।*] యల్లాభట్ట ఏకభాగీ।

౧౫ భట్టః ద్విభాగీ। శ్రీకొండ నారాయణభట్ట ఏకభాగీ। మంచిభట్ట ఏకభాగీ బడ్డని శింగా [8] [।*] యజ్జంటల

౧౬ చిటి కేశవభట్ట[ః*] త్రిభాగీ। కేశవ బర్భులవల్లంభట్ట ఏకభాగీ। జన్నసాని అన్నమభట్ట ఏకభాగీ।

౧౭ ముప్పిలి అప్పలె బర్భు ఏకభాగీ[।*] కేశవదేవ ఏకభాగీ। నగరేశ్వరదేవ ఏకభాగీ।

1. తుడుపు పెట్టి మరల దానిమీద 'భా' చెక్కబడియున్నది. 2. 'సింగయ' అని. 3. 'గీ' అని. 4. 'నరసింహ' అని. .5 'సిరిగిరి' అని. 6. భాగముల సంఖ్యను శాసనము చెక్కినవాడు వదలివేసెను. 7. 'కృష్ణ' అని. 81 'సింగా' అని.

---

## ప్రకటన

ఈక్రింది కనబరచిన నెంబర్ల వారికి ఈనెల భారతి (1941 సం. నవంబరు నెల) తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమున కగు చందా మాకు చేరునట్లు ఈ నెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమ యొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్మురానిచో సహజ భాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరమువఱకు భారతి చందాదారులుగ నుందురను నమ్మకముతో 1941 సం. డిసంబరు 10-వ తేదిని రూ 6—4—0 లకు వి. పి. పంపుచున్నాము. కావున తామెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన బ్రార్థితులు. ఒకవేళ తమకీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మాకావిషయము వెంటనే తెలియజేసిన యెడల వి. పి. పంపుట నాపుదుము.

H 17, 21, 44, 48, 52, 53, 54, 55, 56, K 8, L 3, N 7, P 21, 22, R 5, S 20, 33, 66, 68, 69, 70, 71, Y 3.

 

# క ల గూ ర గ ం ప



## = త్యాగరాజు - అతని దివ్య సంగీతము =

అక్టోబరు నెల మొదటివారమున త్యాగరాజవర్ధంత్యుత్సవములు దేశమం దంతటను అఖండవైభవముతో జరుపబడినవి. మద్రాసులోను అట్టి యుత్సవ మొకటి జరిగినది. ఆ సభలో శ్రీ శొంఠి రామమూర్తిగారు త్యాగరాజునుగూర్చియు, అతని సంగీతకళను గూర్చియు నొక గంభీరోపన్యాసము నిచ్చిరి. సంగీతసాహిత్యములలో సాహిత్య మప్రధానమనియు, సంగీతమే ప్రధానమైనదనియు, సంగీతమును శాసించి తన యిచ్చవచ్చిన రీతిని సాధించుట సాధ్యముకానిపని యనియు రామమూర్తిగారు చక్కగా వ్యక్తీకరించిరి. తమిళకీర్తనోద్యమవాదులకు చక్కని సమాధానము అందులో గలదు. దాని నీదిగువ ఉద్ధరించుచున్నాము:

" త్యాగరాజువర్ధంత్యుత్సవములలో ఇది నూరవది. పండిత పామరులందరి దృష్టిలోకూడ త్యాగరాజు దక్షిణదేశగాయకులలో కెల్ల అగ్రగణ్యు డను ఖ్యాతి నార్జించుకొన్నాడు. అట్టి మహనీయుడు నిన్న మొన్నటివా డనియు, ఎంతో కాదు–ఇంచుమించు నూరేండ్లక్రితమువాడేయనియు, ఈతరమువారికిని అతనికిని ఇంత సన్నిహితసంబంధమున్నదనియు తెలుసుకొన్నప్పుడు నిజముగా ఎట్టివారికైనను ఆశ్చర్యము కలిగితీరును. హిందూదేశమునందు వర్తమానకాలములో మనము తలచుకొని తలచుకొని ఉబ్బితబ్బిబ్బు లవుచున్నట్టివియు, భవిష్యత్కాలములో మనకు ధైర్యము నిచ్చునట్టివియు నగు అనేక విషయములు - మన కెరుకలో నున్నంతవరకు - ఎన్నో శతాబ్దములక్రింద జరిగినవేకాని ఇంత అర్వాచీనములుమాత్రము కావు. మహోన్నతశిఖరముల నందుకొన్న మన వాస్తుశిల్ప ప్రతిమాశిల్పములు చోళరాజుల నాటివి. కళాకలితములైన మనచిత్రములు ఆంధ్రరాజుల నాడే వెలసినవి. మన వేదాంతదర్శనము విశ్వోన్నతిని పొంది ఏండ్లుపూండ్లు గడచినవి. భూమార్గమునను, జలమార్గమునను మన మలవాటుగావించిన సాహసయాత్రాచర్యలు ప్రాచ్య ఆసియాఖండములో విస్మృతిమార్గమున బడి నేటికి మసకమసకగా మాత్రము తోచుచున్నవి. మన సాంఘికవ్యవస్థ ముదిమినొప్పులతో కట్టెబారిపోయినది. బహుపురాతనమైన ఈ భారతదేశము ఇంకను పూత ఉడుగలేదు, పూచుచునే యున్నది. కాని ఆపూలు కొంతకాలనుపాటు విరళవిరళముగానే యుండి పరిమితములు గానుండెను. అట్టివాటిలో సంగీత మొకటి. ఈసంగీతములో మన మూసృష్టికర్తసన్నిధానముం దున్నట్లే తోచుచుండును. ఇది నిజముగా గర్వింపదగిన యంశము.

త్యాగరాజును ప్రశంసించుచున్నప్పుడు దక్షిణదేశీయు లెవరుగాని అత డొక వైయక్తికమైన అభిరుచిని పెంపొందించినాడని తలపగూడదు. దక్షిణదేశీయ విజ్ఞానమంతయు అతని సంగీతములో సంశ్లిష్టమైయున్నది. భారతీయ విజ్ఞానముయొక్క వివిధరూపములలో ఇదికూడ ఒక మహనీయరూపమై వెలుగొందినది. ఆసంగీతములో అతడు వాడిన ఆ తెనుగుభాష. ఇంచుమించు సాయంత్రపు వేళలందు గడ్డిమోపులను మోసుకొని ఆడుచుపాడుచు ఇండ్లకేగు పల్లెపడుచుల తెలుగువలె తేటయై, నిరాడంబరమై, సులభమైయుండును. కాని, అంతటి చిన్న ఆధారముతోనే త్యాగయ్యసంగీతము విశ్వమంతటి విశ్వరూపముతో ఆకాశమున కందుకొన్నది. దాని సంప్రదాయము ఆళ్వారులును, నాయనారులును అనుసరించిన తమిళసంప్రదాయము. దానిది కర్ణాటకవ్యాకరణము. దాని సాహిత్యము దాక్షిణాత్యము. దాని విజ్ఞానము భారతీయము. దాని ఆత్మ మానవీయము. దక్షిణదేశములో ప్రతివాడును దాని నర్థము చేసుకొనగలడు; దాని లయను గ్రహింపగలడు; దాని భావము నవగతము చేసుకొనగలడు; రసానుభూతి పొందగలడు. సజీవమైన ఇట్టి ఉత్తమకళను ఇతరగాయకు లందరికంటెను గాఢముగా త్యాగరాజు మనకు పదిలపరచి పోయినాడు.

త్యాగరాజు సంగీతము భారతీయ జీవితసంగీతముతో సమమేళముగా శ్రుతిచేయబడినది గావున అతడు మన హృదయములలో సంపాదించుకొన్న స్థానము

సుప్రతిష్ఠిత మైపోయినది. అతని రచనాశిల్ప మంతయు అతని సంగీతములో కనిపించుచున్నది. అదియే దానికి సొంపు సెంపులను సమకూర్చుచున్నది. ప్రాచీన రాగముల నుపయోగించుటలోను, నూతన రాగములను సృష్టించుటలోను అతనిది అందెవేసినచేయి. అతని సంగీత మది ప్రయత్నపూర్వకముగానే దొర్లుచుండెనో, లేక అప్రయత్నముగా అనాలోచితముగానే దొర్లుచుండెనో ఎట్లయిన నేమికాని అది సంగీతశాస్త్రసూత్రములకు సర్వథా సరిపోవుచుండెను. ఆశాస్త్ర నియమము లన్నియూ అందులో తూచా తప్పక ప్రతిఫలించుచుండెను. అంత శాస్త్రశుద్ధముగా, అంత అప్రయత్నసిద్ధముగా నాటిచోళదేశస్థపతి యెవడుగాని అప్పర్, మాణిక్యవాచకర్ మొదలైన మహనీయుల ప్రతిమలను మలచి యెరుగడు. త్యాగరాజు సంగీత మంత శాస్త్రశుద్ధమైనది. త్యాగరాజు తన కర్మయోగము తన రచనాశిల్పముతోను, తన భక్తియోగమును శ్రీరామునియందు తనకుగల భక్తితోను సాధించెను. ఆ శ్రీరాముడే అతని సంగీతమునకు జీవగఱ్ఱ, జీవము నై యుండెను. త్యాగరాజు జీవాత్మ పరమాత్మల స్వస్వరూపముల నెరిగిన యోగికూడ అయియుండెను. అదియే అతని జ్ఞానయోగము. ఈ యోగమార్గములు మూడును అతని సంగీతరచనలందు తారసిల్లుచుండును.

ఇదియే భారత జీవిత లక్ష్యము. జీవాత్మ, పరమాత్మ అను దృశ్యాదృశ్యములు రెండును యథార్థములే యనియు, కాని అందులోను దృశ్యమైన జీవాత్మకంటె అదృశ్యమైన పరమాత్మయే పరమ యథార్థమనియు భారతీయుల పరమ విశ్వాసము. ఇదియే భారతీయుల మనోభావము. భారతజాతి చైతన్యమున కిదియే ఆధారము. భారతీయ జీవితమునకు త్యాగరాజు సంగీతము అచ్చపుబిడ్డ. ఎవరైనను వెళ్లి త్యాగరాజునొక సందేశ మిమ్మని కోరియుండుచో "నేను సంగీతమువల్లనే భగవంతుని పొందగలిగితిని. నాదోపాసనవల్లనే ముక్తిని పొందితిని. భగవంతుడు సర్వాంతర్యామి; విశ్వవ్యాపి. అతనిని పొందుటకు అనేక మార్గము లున్నవి. కాని ఆ అన్నిటిలోను మధురతరమైనది, సులభతరమైనది ఒక్క సంగీతమే" యని సందేశ మిచ్చియుండునని నాతలంపు. అతని సంగీతములోని రచనాకౌశలమును, అందలి భక్తిని, దానిలోని తత్వవివేచనను వేరువేరుగా విడదీయుటకు వీలులేదు. జీవాత్మనుండి పరమాత్మకు వెళ్లుట యన అది ఒక మహోన్నతశిఖరము నెక్కుట వంటిది. ఆ శిఖరము నెక్కుటకు దృఢమైన శరీర ముండవలెను; నిర్మలమైన హృదయ ముండవలెను; మిక్కుటమైన మేధాసంపద యుండవలెను. ఈ మూడు గుణములును త్యాగరాజున కమరియుండెను. అందుచేతనే అతడు అనితర సాధారణముగా ముక్తిని సాధింపగలిగెను.

భారతదేశమునం దెందరో యోగు లుండిరి. ఆ మహానుభావు లందరును పూజలు గొనినవారే. కాని వారందరును ప్రజలహృదయములందు శాశ్వతముగా నాటుకొనిపోయిరి కారు. భగవంతునిపై తమకుగల గాఢమైన ప్రేమను వ్యక్తపరచినవారే ప్రజల హృదయములందు నాటుకొనిపోగలరు. త్యాగరాజు వట్టి సంగీతశాస్త్రజ్ఞుడే అయి యోగిపుంగవుడు కాకపోయియుండినచో అతనిని మన మిప్పుడంత ఆరాధించి యుండము. అట్లే అతడు వట్టియోగిమాత్రమైయుండి సంగీతశాస్త్రవేత్త కాకపోయియుండినచో కూడ మన మతనిని ఇప్పుడంత ఆరాధించియుండము. భగవంతుని యందు తనకుగల ప్రేమ నతడు అంత దృఢముగాను, అంత హృదయస్పందిగాను వెల్లడించెను గనుకనే ఆ మహానుభావుడు ప్రజలహృదయములలో శాశ్వతముగా నాటుకొనిపోయినాడు. ఇట్టి మహానుభావులు ఎందరో యుండరు. సాధారణగాయకులు శాస్త్రసిద్ధమైన సంగీతముతో తమ పాండిత్యమును వెల్లడించిన వెల్లడింపవచ్చునేకాని త్యాగరాజునంత ప్రతిభనుమాత్రము వెల్లడింపలేరని నిష్కర్షగా చెప్పవచ్చును. జీవితము ఆధ్యాత్మికసూత్రములకు కట్టుబడవలెను. అట్లని భౌతికసూత్రములకు దూరము కారాదు; వాటి కనుగుణము గానే యుండవలెను. ఐహికసంపదకంటె ఆముష్మికసంపద గొప్పదేకాని ఐహికసంపదలో యథార్థత అనునది విశిష్టముగా నున్నది. కావున దానినికూడ నీమరరాదు. ఈసంస్పృష్టశక్తియే త్యాగరాజును త్యాగబ్రహ్మముగా చేసెను. భరతవర్ష మనాదిగా పరమప్రాప్యమని యెంచుకొనినట్టియు స్థూలము, సూక్ష్మము, సృష్టికారకము నైన మతసంప్రదాయమునే త్యాగరాజు ప్రతిష్ఠించి లబ్ధప్రతిష్ఠుడాయెను. భారతీయుల కారాధ్యులైన దేవతలలో శాంతినిలయమైన భూదేవియు, సృష్టికర్తయైన బ్రహ్మయు కూడ స్థానము సంపాదించుకొన్నవారే. కాని ఈ యిద్దరిని మన మిప్పుడు మనదేవాలయములలో కాని, మనహృదయములందుగాని పూజింపమానుకొంటిమి. ఇది మన బాహ్యజీవితములో బాగుగా ప్రతిఫలించుచునే యున్నది. ఈ ఉపేక్ష నిజముగా శోచింపదగినది. భగవం

తుని తెలిసికొని, అతనిని నిర్మలహృదయముతో ప్రేమిం
చినంతమాత్రముచేత చరితార్థులైనట్లు భావించుకొనుట
తప్పని త్యాగరాజు అభిప్రాయము. అంతమాత్రమే
చాలదని అతని ఉద్దేశ్యము. సృష్టిస్థితిలయములనెడు
తన నిత్యనైమిత్తిక కర్మలను భగవంతు డెట్లు, ఎంత
శ్రద్ధాసక్తులతో నెరవేర్చుచుండునో అట్లే అతనిసృష్టి
యైన మానవుడుగూడ తన విధ్యుక్తధర్మములను, నిత్య
నైమిత్తికకర్మలను అంతకంటె ఎక్కువ శ్రద్ధాసక్తులతో
నెరవేర్చుచుండవలెను. అప్పుడే మానవుడు భగవదైక్య
మును పొందగలడు. అట్లు చేసియే త్యాగరాజు భగవం
తునితో తాదాత్మ్యమును పొందగలిగెను. ఈ నవయుగ
ములోకూడ ఆ భారతజీవితలక్ష్యము సంపూర్ణవికాసము
తో పునశ్చైతన్యమును పొంది వెలయగలదని ఆశించు
చున్నాను.

భారతీయుల భావములలోను, భావనలలోను
రెండు విశిష్టగుణము లున్నవి: పరిపూర్ణత, నిర్దిష్టజ్ఞా
నము. పాశ్చాత్యవ్యామోహములో పడిపోయి మన మీ
రెండు గుణములను విస్మరించుచున్నాము. ఆధిదైవిక
ముకన్న ఆధిభౌతికమునే మనము గొప్పగా ఎంచు
చున్నాము; ఆముష్మికముకంటెను ఐహికమునే ఆరా
ధ్యముగా అనుష్ఠించుచున్నాము; పారలౌకికముకం
టెను లౌకికమునే లోకోన్నతముగా భావించుచు
న్నాము. దీనితో మనము మన వస్తుమూల్య జ్ఞానమునే
కోలుపోవుచున్నాము. ఆధిభౌతికముకన్నను ఆధిదై
వికమే గొప్పదనుట మనము మరవరాదు. ఐహికము
కన్నను ఆముష్మికమే అనుత్తమమైనదనుటను విస్మరింప
రాదు. మనుష్యునికి ఒక నిర్దిష్టమార్గము కలదు. మనపాద
ములు క్రిందనున్నవి; తల పైన ఉన్నది. మనుష్యునికి పాద
ములు ముఖ్యమైనవే. కాని మనము వాటిపరిమాణము
తోనే మానవులను గౌరవించుటలేదు. గాయకుడు తన
చాతురిని, తన భావవాహినిని, తన దర్శనపరిజ్ఞానమును
దేనిమూలమున వెల్లడించుకొనునో అది-ఆ భావ-సంగీ
తములో ఒక అంశమే కాని అదియే ఉత్తమోత్తమమైనది-
ముఖ్యమైనది కాజాలదు. ఇటువంటి సాధననిర్ణయము
కళావేత్త తనకుతానే చేసికొనవలెను. ఇంకొకరు చేసి
పెట్టరాదు. తన సాధననిర్ణయమును తాను చేసి
కొన్నప్పుడే కళావేత్త తనశిల్పమును చక్కగా వెల్ల
డించగలడు. చక్కని సంగీతమును వినదలచినచో
గాయకుని శాసింపరాదు. అట్టి సంగీతమును వినదగు
నావలసినదే కాని శాసించి సాధించుటకు సాధ్య
ముకాదు. అయత్నజన్యమైన సంగీతమే మన పిపాసను
తీర్పగలదుగాని యత్నజన్యమైన సంగీతము తీర్పలేదు.
చక్కని సంగీతమును వినదలచినవాడు యాత్రికుడుగా
మెలగవలెను; యాత్రికుని భావన నలవరచుకొనవలెను.
దివ్యక్షేత్రములకు యాత్రవెళ్లినయాత్రికుడు ఆ క్షేత్రము
లందలి దేవతలను "రాతితో చెక్కబడినారే,
కొయ్యతో ఏల చెక్కబడలేదు? నాపరాతితో చెక్క
బడితిరే, చలవరాతితో ఏల చెక్కబడలేదు? కృష్ణా
నదీతీరములో వెలసితిరే, కావేరీతీరములో ఏల వెలయ
లేదు?" ఇత్యాది కొంటెప్రశ్నలు వేయుట ఎందైనను
కంటిరా? నీకు వీలైన విధమున, నీకు వీలైనప్పుడు,
నీకు నచ్చినట్టి రూపముతో భగవంతుని నారాధింపుము;
పొందుము. అంతే నీపని. సంగీతమువిషయముకూడ
అంతే. అదికూడ ఆధ్యాత్మికమైనదే. ఎవరికి లభించిన
రీతిని వారు దాని నాస్వాదింపవలసినదేకాని దానిని తన
ఇచ్చ చొప్పున శాసించి సాధింతు మనుకొనుట వట్టి
మాట.

జీవితప్రవంతిలో త్యాగరా జొక తెప్పపైన
సాగిపోవుచుండెను. అతని శిల్పమే ఆ తెప్ప. ఒక్కొ
క్కప్పు డది బ్రహ్మానందములో ఉరకలెత్తుచుండెను;
మరొకప్పుడు శాంతిలో తేలియాడుచుండెను; ఇంక
కొన్ని వేళలందు ఆశానిరాశలలోను, సంశయ విప్రతి
పత్తులలోను ఊగిసలాడుచుండెను. కాని అతని నడక
మాత్రము ఆగిపోలేదు; దారితప్పలేదు. నిరంతరాయ
ముగా అది సాగిపోవుచునేయుండెను. భారతీయ
మునివర్యులు చిరకాలముక్రిందటనే ఆధిదైవికమైన
భూగోళపరిజ్ఞానమును కనుగొని, భగవత్సన్నిధానమును
సూచించగల దిక్సూచిని కని పెట్టినారు. అట్టి దిక్సూచి
యొక్కటి త్యాగరాజువద్ద ఉండియుండెను. దాని
నతడు తన హృదయములో దాచుకొని, దాని సాయము
తో తన తెప్పను నడిపించుచుండెను. మనభావములు,
మనభావనలుగూడ అతని తెప్ప సాగిపోయిన తెన్ను
ననే అనుసరించినయెడల మనముగూడ అతడు పొందిన
ఫలితములను పొందగలుగుదుము.

అట్టిమహాత్ముని అనునిత్యమును స్మరించి,
సన్మానించి మన జీవితసంపదను సార్థకముచేసికొందము
గాక."

## భీమా చేసికొని దేశసంపదను వృద్ధిచేయుడు

ప్రతి వ్యక్తి యొక్క ఆర్థిక స్వాతంత్ర్యమే, జాతి ఆర్థిక బలప్రమాణము.

ప్రస్తుత ప్రపంచసంక్షోభములో ఇన్సూరెన్సు పాలసీహోల్డర్లందరు వారివారి ఇన్సూరెన్సు రక్షణలను సరిచూచుకొని, అనూహ్యమైన భవిష్యత్తునకు అవి ఎంత రక్షణీయముగా నున్నవియో తెలుసుకొనవలెను.

తమ రక్షణకై ఇంకను ముందుగా జాగ్రత్తపడని వ్యక్తులు, ఆలశ్యము లేకుండ తగిన కట్టుదిట్టము చేసికొని దేశసౌభాగ్యమునకు తోడ్పడుడు.

సలహా తీసికొని నేడే వ్రాయుడు :

## నేషనల్ ఇన్సూరెన్సు కంపెనీ, లిమిటెడ్.

ప్రధానకార్యాలయం: కలకత్తా. స్థాపితము: 1906

బ్రాంచి ఆఫీసు :

"నేషనల్ ఇన్సూరెన్సు భవనములు"

362, చైనాబజారు రోడ్డు, ఎస్ప్లనేడ్, మద్రాసు.

సబ్ ఆఫీసులు : 171, న్యూస్ట్రీట్, మధుర.

5, కెంపెగౌడ రోడ్డు, బెంగుళూరు.

---

# బలవృద్ధికి

# ఆనంద : :

# : : : సుధ

## సమస్త వ్యాధులకు

**8 టా॥ 2-8-0**

**4 టా॥ 1-6-0**

డాక్టర

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి,

బెజవాడ (లేక) రాజమండ్రి.

---

# గర్భనిరోధము

"రహాత్" మూడు దినములు వాడిన జీవిత మున్నంతకాలము గర్భోత్పత్తిబాధనుండి విముక్తులను చేయును. గ్యారంటీ పత్రముతో సహా ఖరీదు.

రు. 5-8-0. 10 షిల్లింగులు.

# బహిష్టు

"త్రినాట్" మూడు దినములు సేవించిన బహిష్టు నిలిచిపోయిన వారికి సక్రమముగా బహిష్టు యగును. ఋతుదోషముల నన్నిటిని నివారణచేయును. ప్రతి ఆర్డరుతోపాటు గ్యారంటీ పత్రము పంపబడును. ఖరీదు రు 5-8-0.

10 షిల్లింగులు.

**Dr. S. H. KHAN.,**

42, B. M. Churchgate Street, Fort, BOMBAY.

'Phone No. 21343.

---



## ముడతపడు బాక్సు కెమిరా

జర్మన్ లెన్సు. క్రొత్తవారుగూడ సెకండులో దివ్యమైన ఫోటోలనుతీయవచ్చును. నిరుద్యోగులు దినమునకు రు 5 కు పైగా సంపాదింపవచ్చును సులభమైనవిధానము, పరికరములు, ఫిల్ముకార్డు, కెమికల్సు ఉచితము. బాక్సు కెమిరా నం. 2 ఖరీదు రు 2-12-0, నం. 1 రు 3-12-0, ముడత కెమిరా రు 4. పోస్టేజి అణాలు 10 మాత్రమే.




## పాకెట్ ప్రెస్

కార్డులు, జాబులకు విజ్ఞాపనలకు ఉపయోగపడు కరపత్రములు అచ్చువేసుకొనుటకు ఇది అత్యవసరము. సీసాలపై అంటించు చీటీలు, కరపత్రములు, విజిటింగుకార్డులు మున్నగునవి తయారుచేసుకొనవచ్చును. ప్రతి పెట్టెలోను అచ్చుపరికరము లన్నీ ఉండును.

ఖరీదు నెం. 1 రు 1-4-0, నెం. 2 రు 1-8-0

పోస్టేజి 11 అణాలు.

CALCUTTA CLOCK Co. (369-B),

P. O. Box No. 12203, CALCUTTA.



# విమర్శనము

## తూణీరం

కవి: పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారు. ఖరీదు: వేస. కావలి స్టే - కృష్ణాజిల్లా, ఉయ్యూరుపోస్టు, శాయపురంలోని కవికి రాయాలి.

తెలుగు కవితాలోకంలో ఇది ఒక కొత్తగ్రంథం. రెండుమాటలు ముందు అనుకుందాము దీన్నిగూర్చి అనుకునేముందు. తెలుగు సాహిత్యంలోకూడా రకరకాల మార్పులు వొస్తున్నై. అనేకసంఘర్షణలు జరుగుతున్నై. ఒకటి పండాగా నిండుగా ఉదాత్తంగా ఉండాలనీ. వీరు కావ్యానికి ఆనందమే ప్రయోజనమనీ అంటున్నారు. రెండోవారు కళను ప్రబోధంగా తీసుకుంటారు. ఆనందం వీరికీ ఉంది. దాన్ని మించి ప్రబోధాన్ని చూస్తారు అసలు నోరెత్తితేనే ప్రబోధం, ప్రచారం తప్పవనేదాకా వీరి వాదం. ఇతర భావాల ప్రాబల్యాలు ఇద్దరూ సహిస్తారు. ఇక్కడమాత్రం తేడావొస్తుంది. ఈలోగా, ఇంకోటి కూడా మనం విచారించాలి. పాతకొత్తల సంగ్రామం. పాతదిచాలా మేలనీ, కొత్తది చాలాచాలా మేలనీ అనుకోడం ఏ నాడూ నిలవదు అనేది తేలిపోయింది. కావ్యానికి ఆనందం ప్రయోజనం అని ఈ కావ్యపీఠిక అంటుంది. యింకా చాలా చాలా అంటుందిగాని, అవి అవకాశాలంలో పాండిత్యాన్ని వినియోగం చెయ్యడమా ఇది అనే ప్రశ్నమాత్రం కదిలించకుండా వుండవు. ఈ కావ్యంలో ఒక తీవ్రత ఉంది నిజమే. ఒక మెసేజి వుంది నిజమే. కాని, దాన్ని రమణీయంగా చెప్పడమనేది మాత్రం కనపడదు చాలాచోట్ల. కళకు ప్రయోజనమును అర్థించినవారుగూడా రమణీయార్థప్రతిపాదకతను విడవలేదు. విడవరు. విడవలేరున్నూ.

'తూణీరం' లో అనేకచోట్లు కనిపిస్తై. శ్రీ. శ్రీ. గారి పద్ధతిని సరిగా ఆకళించుకోకపోతే — కృష్ణశాస్త్రిగారి విధానం ఆకళించుకోకుండా కొందరు తెచ్చిన ముప్పులాంటిదే ఇక్కడావొస్తుంది. వొచ్చిందికూడా. శ్రీ. శ్రీ. గారి 'నవకవిత' కు అనేక అపహాస్యభాసలు ఇటీవల చౌకబారుపత్రికల్లో దృష్టపూర్వాలు. ఈ తూణీరంకూడా ఆ పద్ధతినే వరించిందా అనేది కొంతవరకూ మనస్సులో ఆడుతుంది. కాని, కవికి ఉన్న ఉద్వేగోద్రేకాలు ఆయనలోని కవిని గెంటుతూంటే, ఆయనలోని కవి పడే సంజాటనకూడా ఇక్కడ కనపడుతుంది.

శాస్త్రి.

## కాశీయాత్ర చరిత్ర

రచయిత: ఏనుగుల వీరాస్వామయ్యగారు. సంపాదకుడు: దిగవల్లి వేంకటశివరావుగారు, వకీలు, బెజవాడ. వెల రు. ౨-౦-౦.

సుమారు ఒక శతాబ్దివెనుక, అనగా క్రీ. శ. ౧౮౩౦ ప్రాంతమున భారతవర్షమునందలి కొంతిభాగములోనూ, ముఖ్యముగా చెన్నరాజధానియందలి కొన్ని ఆంధ్రసీమలలోనూ రాజకీయముగగాని, సాంఘికముగగాని, నైతికముగగాని, భౌగోళికముగగాని ఎట్టిపరిస్థితులు, ఎట్టివిభాగములు, ఎట్టి మానవీయాభిప్రాయములు వర్తిల్లుచుండెడివో తెలిసికొనవలెనంటే ఈ కాశీయాత్రాచరిత్రము కాలసంబంధమైన దూరదర్శినిగా ఉపయోగపడుతుంది. అంతేకాదు, అప్పటి మన భాషారచన ఎట్లా వుండేదో, ఆంగ్లేయులయెడల దేశీయులకూ, దేశీయులయెడల ఆంగ్లేయులకూ ఎటువంటి భావము లుండేవో గుర్తెరుగవలెనంటే ఈ గ్రంథాన్ని చదువడానికన్న మంచివుపాయం వేరొకటి లేదు. హిందూ, మహామ్మదీయ, క్రైస్తవమతాల తారతమ్య వివేచనకా? ఇందులో కొదువలేదు. ఆకాలమునందలి సంస్కారప్రియుల ఉన్నతోద్దేశాల పరిమాణానికా? ఇందులో తక్కువలేదు. ఇవ్వాళ గ్రాండ్‌ట్రంక్ ఎక్స్‌ప్రెస్సులో కూచోని మూడోనాడు కాశీచేరి అక్కడ రెండురోజులుండి మరల మూడునాళ్ల కిల్లు

చేరి వారంతో జాల్లో యాత్ర పూర్తిచేసుకొనే ఈనాటి వారికి కాశీయందలి విశేషములే తెలియరావు. ఇక సుమారు రెండు నెలలకాలములో కాలినడకను గావించిన బాటయందలి విశేషాలన్నీ ఎట్లా తెలుస్తాయి? ఇన్ని వింతవిశేషాలు, ఇంత పరమార్థముతో తెలియచేయు నీగ్రంథమును ముద్రించి మరల తెలుగువారి కందచేసినందులకు శివరావుగారు స్తవనీయులు. జటిలములై సామాన్యజనులకు అర్థముకాని మతసిద్ధాంత విషయములుకూడ సరళరీతి అర్థమగులాగు వ్రాయబడుట ఇందలి విశేషమని చదువరులు తెలిసికొనగలరు.

---

## సుశీల

రచయిత: తిరుపతి వెంకటేశ్వర కవులు, వెల రూ. ౧-౦-౦.

ఇది ఆరాశ్వాసముల పద్యప్రబంధం. పుష్కలముగా ధనము నార్జించి, లోభియై జీవితమును గడపిన వైశ్య డొకడు వృద్ధాప్యంలో తన కుమారు లొనరింపగడగిన ఉదారకార్యముల శైవగించుకొని కుటుంబాన్ని వదలిపెట్టి వనమునకు పోయి ఒకచోట నుండగా శత్రువులచే రాజ్యమును గోలుపోయిన రాజొకడు అక్కడికే వస్తాడు. ఆ ఇద్దరూ ముచ్చటించుకొనుచుండిన సమయమున కులవృత్తిపై రోసి ధనాఢ్యయు, షోడశియునైన సుశీలయను పేరుగల గణికాకుమారిరొకతె అక్కడికే వస్తుంది. పిదప భూతభవిష్యత్కాలవేదియగు సాధు వొక డచటికి జేరి వారి వారి పూర్వజన్మ వృత్తాంతములను తెలియబరుస్తాడు. అనంతరము వీరు నలువురూ యాత్రావశమున శ్రీగిరి పర్వతమునుజేరి అందే పద్వృత్తులై తమ జీవితశేషమును గడుపుతారు. ఇది ఇందలి ఇతివృత్తం. కాని సందర్భం కల్పించి తదనుసారంగా అనేక నూతన సమస్యలను ప్రవేశపెట్టి వాటిని పరిష్కరించేటందులకు ప్రయత్నించారు శాస్త్రులుగారు. వేశ్యావృత్తి, ధనసంపాదనమూ తద్వితరణము, రాజుల పారతంత్ర్య పుష్టి, శైవవైష్ణవుల విశ్వాసాలు, ద్వైతాద్వైతవాదాలు, ముక్తుల కర్తవ్యాలు, నిమ్నకులజాలనువారి దేవాలయ ప్రవేశము, బాలబాలికల, యువతీ యువకుల సహవిద్యాభ్యాసము; వర్తమాన పరోపాసం గ్రామక్రీడ, పశ్యతోహారవృత్తాంతం, ఆధునికవిద్యాపద్ధతి, వేశ్యా సంస్కరణం మొదలగు విషయములను గైకొని వానిని తమ ఇచ్ఛానుసారంగా పరిష్కరించి వదలినారు.

---

## మధుకణములు

గ్రంథకర్త: పిల్లలమర్రి వేంకటహనుమంతరావుగారు. సాధనసమితికార్యాలయం, ౬౮-బి, బన్సీలాలుపేట, సికింద్రాబాదు. వెల రు. ౦-౬-౦.

ఉపాసన, నాదమహతి, ప్రభాతం, అశ్రుచయము మొదలగు కవితలు గల పుస్తకం. ఇవన్నీ ఇదివరలో భారతి, గృహలక్ష్మి, కృష్ణాపత్రిక, వినోదిని, చిత్రగుప్త, వాణి ఇత్యాదిపత్రికలలో ప్రకటితమైనవే. అన్నిటిని ఒకగ్రంథముగా ప్రకటించారు.

---

## ౧. పతివ్రత, ౨. పల్లీయులు

రచయిత: శరత్ చంద్ర చటర్జీ. అనువాదకుడు: చక్రపాణిగారు శరచ్చంద్రుని నవలారచనా కౌశలమూ, చక్రపాణిగారి అనువాదకరణసామర్థ్యమూ ఆంధ్రజనులకందరకూ అవగతమయ్యేవుంది. 'పతివ్రత' తోబాటు 'శృంగభంగ'మను వేరొక కథయు కలదు. పల్లీయులు అనునది చిన్ననవల. వెల క్రమముగా రు. ౦-౬-౦, ౦-౮-౦.

---

## ఖడ్గతిక్కన

గ్రంథకర్త: శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు, రచన, జీరా, సికింద్రాబాదు (దక్కను). ఆంధ్రకావ్యమాలయందలి ఆరవపుష్పము.

ఈ తిక్కనకథ చాలకాలమునుండి మన దేశములో ప్రచారములో వున్నదే. యుద్ధమును విడనాడివచ్చిన తిక్కనను భార్య, తలిదండ్రులు లోనగు స్వకీయులు సిగ్గుపడునట్లుచేయగా నతడు మరల రణరంగమున కేగి స్వంతప్రాణముల నర్పించి శత్రువుల బారదోలిన వీరకథ ఇందు మధురముగా వర్ణితమైనది. పద్యకావ్యము. వెల రు. ౦-౮-౦.

---

## నాజీ తుపాను

గ్రంథకర్త: ఫిల్లిప్ బొట్టోం; అనువాదకుడు: యర్రమిల్లి నరసింహారావుగారు, తెనుకు. జర్మనీలో నాజీలు గావించు చర్యలను వెలిపరచే చిన్ననవల. వెల ౦-౬-౦.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras. Editor:— S. Sambhu Prasad.